"యశస్వి"

# "సంవాదచిత్ర సాహిత్యమ్"

# (Samvāda Citra Sāhityam)

(సంస్కృతాంధ్రాంగ్లహిన్ద్యాది భాషాతులనాత్మక చిత్రాలంకార ప్రక్రియ)

(పరిశోధనగ్రంథము)


ఆఖ్యాత ,వ్యాఖ్యాత :

పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ (1996)

పండిత ప్రతిభా పురస్కార (అవార్డు) గ్రహీత,

''సాహిత్యరత్న'' **సూరపనేని వేణుగోపాలరావు,**

సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ, T.C.P.T., M.A., P.O.L.,

రిటైర్డ్ – సంస్కృతాంధ్రాధ్యాపకులు,

అక్కినేని నాగేశ్వరరావు కళాశాల, గుడివాడ – 521301



ప్రచురణ :

**"ఆనన్దవర్ధన" ప్రచురణలు**

40 – 9/10 –12

మునిసిపల్ కాలనీ, వెంకటేశ్వరపురం –P.O.

విజయవాడ – 520 010.

వెల : రు. రూ. 70/=

"ఆనన్దవర్ధన" పఞ్చమ ప్రచురణ, 1999

తులనాత్మక పరిశోధన గ్రంథము :

**సంవాద చిత్ర సాహిత్యమ్**

ఆఖ్యాత, వ్యాఖ్యాత : "యశస్వి"

ప్రథమ ముద్రణ 1000 ప్రతులు, 1999



"పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారి
సహాయంతో ప్రచురితము"

ప్రతులకు :

**శ్రీమతి సూరపనేని కాంతారత్నమ్**

"ఆనన్దవర్ధనప్రచురణలు", 40-9/10-12,
మునిసిపల్ కాలనీ, వెంకటేశ్వర పురం పోస్ట్,
విజయవాడ - 10.

# మున్నుడి

''సంవాద మనగా పరస్పరసంభాషణ....'' అని లోకంలో సాధారణంగా వాడతారు. అది కావ్యాలలో, శ్లేష, వక్రోక్తి, ఎత్తిపొడుపులు, హాస్యం. వెం. వానితో చమత్కారాన్నందిస్తుంది.

పూర్వం వృత్తి విద్యలెన్నో ఉన్నా, భుక్తి విద్యలు, ఉద్యోగ – సద్యోగాలు తక్కువ, కనుకనే కవి పండితులు జమీందార్లను, రాజాధిరాజులనాశ్రయించేవారు. వారు కూడ కవి పండిత పోషణను బాధ్యతగా భావించి, అగ్రహార, గండపెండెర, గజారోహణ, కనకాభిషేకాదులతో సత్కరించేవారు. ఆనాటి విక్రమార్క, భోజ, కృష్ణదేవరాయాదుల పేరు ప్రతిష్ఠలు నేటికీ, సాహిత్యంలోనేకాక, సంస్కార ప్రపంచంలో కూడ పరిఢవిల్లుతున్నాయి. నేడట్టివారేరి? నేడు ప్రజలే, పాఠకులే ప్రభువులు 'వినాశ్రాయం న శోభస్తే పండితా వనితా లతాః' పండితులు, పడతులు, తీగలు, ఆశ్రయ దాతలు లేకున్నచో వృద్ధి చెందరట!

సామాన్యుడు కూడ నేడు ఒక అందగత్తెను చూచి 'సుందరి' అనక, 'ఆమె రంభ' అంటాడు. క్రూరాత్ముని చూచి 'రాక్షసుడు' అంటాడు. ఈ ఆలంకారిక మర్యాదలను వానికి ఎవరు నేర్పారు? సాధారణ సంవాదము చప్పగా, చాదస్తంగా, చెత్తగా ఉంటుంది. ఒక కథో, చరిత్రో చెప్పుచున్నట్లు గాక, సంవాద రూపములో ఉన్న సరస సాహిత్యము అనిర్వచనీయానందాన్ని కల్గిస్తుంది. అది అన్యాపదేశ, ఆధిక్షేప, శ్లేష, వక్రోక్తులతో ఒయ్యారంగా రక్తి కట్టించి, భావ సంచలనము కల్గిస్తుంది.

గీతి ప్రియులగు కవులకు శబ్దాలంకార ప్రీతి మెండు. వారు సాధారణంగా శబ్దాలంకారాలను వాడుతున్నా, చిత్రాలంకారాల వాడుక తక్కువ. మెదడుకు మేతనందించి, ఒరిపిడిపట్టు చిత్రాలంకారాలు, మొదట కొంచెం కష్టంగానున్నా, అర్థం చేసుకుని, ఒంట బట్టించుకొంటే, మానసికానందానికి మానదండాలవుతాయి.

మున్మొదట, ఈ చిత్రాలంకార వైచిత్ర్యం ప్రశ్నోత్తరాదిరూపములో ప్రాబలుకుల (వేదాల) లోనే ప్రారంభమయినట్లు –

''కోహగం స్యా మిత్యబ్రవీత్ ఏత త్వదాయేతి,

ఏతత్ స్యా ఇత్యబ్రవీత్ య దేతత్ బ్రవీతీతి ''

అను ఋగ్వేద మంత్రం, బ్రహ్మేంద్రుల సంవాదాన్ని తెలుపుతుంది. ఒకప్పుడు, దేవేంద్రుడు, సర్వాధికారాలు తనకే కావాలని కోరగా, అవన్నీ నీకిచ్చి, నేనేంకావాలి? అ

బ్రహ్మ ప్రత్యుత్తరము . అప్పుడు ఇంద్రుడు, హే బ్రహ్మన్! పై 'కోహగ్ంస్యాం ---' మంత్రంలో, ప్రయుక్తమైన 'కః' అనేశబ్దం, మొదట, ప్రశ్నవాచకమై, తర్వాత శ్లేషతో ''బ్రహ్మ'' అనే అర్థాన్ని బోధిస్తుందికదా! కనుక నీవు 'కః' = బ్రహ్మపదవాచ్యుడవుగానే ఉంటావు సుమా! అని ఇంద్రుని జవాబు. ఇట్లే మరొకప్పుడు, బ్రహ్మచర్యవ్రతానంతరం, బ్రహ్మ 'దేవ, మానవ, దానవులకు---- ఉషిత్వా బ్రహ్మచర్యం, ---దేవా ఊచుః ---' ఇత్యాది మంత్రంలో 'ద' అనే అక్షరాన్ని, ముమ్మారు ఉపదేశించి, మీకు అర్థమైనదా? అనిఅడుగ, వారు 'దమం, దానం, దయ' అనినట్లు, అర్థం చేసుకొన్నా మనగా, బ్రహ్మ సంతోషించాడట! ఇంతలో, మేఘంకూడ, 'ద-ద-ద' అని ముమ్మారు ప్రతిధ్వనించినట్లు బృహదారణ్యక భణితి(2.2) సాక్ష్యం.

మొత్తం మీద వేదకాలంనుండి 'సంవాద' పద్ధతిలోనున్న 'సంవాదచిత్రసాహిత్యం' క్రమంగా, శాస్త్రేతిహాసపురాణ కావ్యాలలోనికి దిగుమతైంది. ఈచిత్రాలంకారాలు, వానివైచిత్ర్య చమత్కారాలు, 'తల్లి సమస్తభాషలకు సంస్కృతమంద్రు' అనుకొన్నా, దానిపిల్ల భాషలైన హిన్దీ, తెలుగు మొ. భాషలలో అంతంగా భాసింపలేదు. కొందరు కవులు కొన్నిటిని నామరహితంగా వాడినా, విడమర్చి , చమత్కారాన్ని చిందింపలేదు. కావ్యజీవితం వ్యంగ్యవైభవమైనందున, చిత్రాలంకారాలు ఆస్థాయినందుకొనలేక, అవరాలు, అధమాలుగా నే పరిగణింపబడ్డాయి. పగలేకాక, రాత్రుళ్లుకూడ, కాయకష్టంచేసి, రెక్కలుముక్కలుచేసుకొన్న కార్మిక, కర్షకులకు, కొంతవిశ్రాంతి అవసరం. విశ్రాంతి అంటే, 'కుర్చీలో కునుకుపాట్లు, మంచంపై శవాసనం'వేయటం కాదు. మరియొక తేలికైన పనిలో ప్రవేశించడమంచారు అనుభవజ్ఞులు. కనుకనే, పేకాటలు, చదరంగాలు, క్లబ్బులు, ఆటలు, పాటలు మొ.నవి వచ్చాయి. వీలున్నంతవరకు సంగీత, సాహిత్య, సాంస్కృతిక, శిల్ప, కళాభివృద్ధికి వినియోగిస్తే అయాచితంగా, మానసికారోగ్యం కల్గుతుంది. ''కావ్య శాస్త్ర వినోదేన కాలో గచ్ఛతి ధీమతామ్''. క్రీడాదులతో, తాత్కాలిక శరీరారోగ్యంకంటే, మానసికారోగ్యం మహత్తరమైనదిగదా!

సర్వతోముఖము, సమగ్రమునైన 'చిత్రకావ్యాలంకార' విమర్శ, 'అకాడమీ' లవంటి మహాసంస్థలకు సాధ్యమైనట్లు, అస్మాదృశులగు అతిసామాన్యులకు, మందబుద్ధులకు, సాధ్యమౌతుందా? దిగితే కాని లోతు తెలియలేదు. అయినా, 5,6 దశాబ్దాలుగా, 'అధీతి -బోధా-చరణ-ప్రచారణ' లతో, మా నేర్చిన సాహిత్య వ్యవసాయమును, 'సంస్కృతం' తో అంతగా పరిచయంలేని సహృదయపాఠకులకు సమర్పించుకొని, ' ఆనందో బ్రహ్మ' అన్న

సూక్తిని, అంతర్బుద్ధినూహిస్తూ, చాటుగా పడియున్న 'ముక్తక' – మౌక్తికాలను, చారుచమత్కార చందనంతో చర్చించి, పేర్చి, విడమర్చి పాఠకప్రభువులకు ఘ్రాణతర్పణం చేయాలని మా సంకల్పం.

ప్రాయం పతాభవిస్తున్నా, వార్ధక్యం వద్దంటూ మొత్తుకొంటున్నా, చూపుతగ్గి, బుద్ధిమాంద్యంపెరిగి, కాటికి కాళ్లారజాపుకొని కూర్చున్నా, సహృదయపాఠకమహాశయుల పాదారవిందాలకు, పారితోషికంగా పరిఢవిల్లజేసి, జీవితసార్థక్యం పొందవలెనను 'పేరాస' పెనవేసుకొన్నది. అయితే, కష్టపడి, చెమటోడ్చి, వ్రాసినా, దానిని ముద్రించుకోవడం, విక్రయించుకోవడంలో ఉండే కష్టనష్టాలు, బాధలు, అనుభవించినవారికే తెలుస్తాయి. లాభార్జన దృష్టిలేకున్నా, తర్వాతి గ్రంథప్రచురణకైనా, కొంతపెట్టుబడి కావాలిగదా! ఈ, 'సంవాదచిత్రసాహిత్యమ్' ను పా.శ్రీ. తె.వి.వి.వారు పరిశీలించి, ప్రకటింపదగిన ''ఉత్తమగ్రంథం''గా నిర్ణయించి, ముద్రణకై మూడువేల రూపాయల ఆర్థికసహాయం చేసినందుకు, వారికి కృతజ్ఞతాంజలి.

ఇట్టి పరిస్థితులలో, తాము భౌతికశాస్త్రాచార్యులైనా, కేవలం సంస్కృతభాషా-సంస్కృత్యభిమానాలతో, మా,మాజీ ప్రిన్సిపాలుగారు అగు, డా. ఎర్నేని వేఙ్కటేశ్వరరావుగారు, నిర్వ్యాజ కరుణా కటాక్షవీక్షణాలను ప్రసరింపజేసి, తమ వారసునికి కూడ తమవారసత్వాన్ని, అందించి, తమ పుత్రరత్నమగు చి. వేఙ్కటరమణ ద్వారా భూరివిరాళాన్ని, గుప్తదానంగా నిప్పించి, ముద్రణ పూర్తియగుటకు సహకరించిన, వారి ఋణమును అంకితమిచ్చి, కొంత తీర్చుకొనుటకు కూడ అంగీకరింపని, వారి మహౌదార్యము, దాన శౌండీరములకు, చేతులెత్తి, జోతలర్పించుకొనుటకంటే చేయునది కన్పడదు.

అట్టి, నిరాండబర వదాన్యశీలుర 'సుమానుషము '(దాంపత్యము) నకు ఆ వేఙ్కటేశ్వరప్రభువు ఆయురారోగ్యైశ్వర్య మహాభాగ్యాలు భవ్యంగా కలుగజేయాలని, మనసార కాంక్షిస్తూ, కృతజ్ఞతాఞ్జలి సంఘటిస్తున్నాము.

వినమ్రవిధేయుడు,
సూరపనేని వేణుగోపాలరావు.''యశస్వి''

# ఉపయుక్త గ్రంథకర్తల - గ్రంథనామ - సంకేతసూచిక

సంస్కృతం :

| కవి | గ్రంథనామమ్ | సంకేతం |
|---|---|---|
| అమరసింహ | అయరకోశమ్ | అ.కో. |
| అజితసేనాచార్య | అలంకారచిన్తామణి | అ.చి. |
| విశ్వేశ్వర | కవీంద్రకర్ణాభరణమ్ | క.కం. |
| బాణభట్ట | కాదమ్బరీ | బా.కా. |
| మమ్మట | కావ్యప్రకాశ | కా.ప్ర. |
| దండిమహాకవి | కావ్యాదర్శ | కా.ద. |
| రుద్రట | కావ్యాలంకార | రు.కా. |
| అప్పయ్య దీక్షిత | కువలయానందమ్ | అ.కు. |
| సంకలనమ్ | చాటుధారా చమత్కారసారః | చా.చ. |
| ---॥--- | సుభాషిత సుధారత్నభాండాగారమ్ | సు.ర.భాం. |
| ---॥--- | భోజప్రబంధమ్ | భో.ప్ర |
| చక్రకవి | చిత్రరత్నాకరమ్ | చ.చి. |
| ఆనన్దవర్ధన | దేవీశతకం, ధ్వన్యాలోకమ్ | ఆ.దే, ఆ.ధ్వ. |
| ధర్మసూరి | విదగ్ధ ముఖమండనమ్ | వి.ము. |
| భోజ | సరస్వతీ కంఠాభరణమ్ | స.కం. |
| చా.రామ, సీతారామశాస్త్రులు | సీతారావణసంవాదఝురీ | సీ.రా. |

తెలుగు :

| కవి | గ్రంథనామమ్ | సంకేతం |
|---|---|---|
| అప్పకవి | అప్పకవీయమ్ | అ.క. |
| డా. అ. నారాయణరావు | నారాయణీయమ్ | అ.నా. |
| వే. ప్రభాకరశాస్త్రి | చాటుపద్యమణిమంజరి | చా మ.1,2,భా. |
| రామరాజభూషణకవి | వసుచరిత్ర | వ.చ. |
| చేమకూరవెంకటకవి. | విజయవిలాసము | చే.వి. |
| వెలగా వెంకటప్పయ్య | సామెతలు | వె.వే. |
| గాదెధర్మేశ్వరరావు | తెలుగులోచిత్రకవిత్వము | తి.చి. |
| ప్రొ. జి. లలిత | తెలుగులో చాటుకవిత్వము | తె.చా.క. |
| బొ. శ్రీ, బా.న. రావులు | తెలుగుచాటువు | తె.చా. |
| దీపాలపిచ్చయ్యశాస్త్రి | చాటుపద్యరత్నాకరము | చా.ర. |
| హిందీ: కేసవదాస | కవిప్రియా | కే.ప్రి. |

# ఉదాహృత - అకారాది శ్లోకాను క్రమణిక

# విషయసూచిక

# సంవాద చిత్ర సాహిత్యమ్

"సంవాదమనగా, పరస్పర సంభాషణము, లేక క్రొత్త సమాచారాదికమును, ఒకరికొకరు తెలుపుకొని, చర్చించుట - అని, లోకసాధారణార్థము కాని, కావ్యాలలో అట్లుగాక, ఈ సంవాదాలు శ్లేషలతో, వక్రోక్తులతో, ఎత్తిపొడుపులతోనో, లేక హాస్యంతోనో, కార్టూన్లతోనో, చమత్కారాన్ని చెంగలింపచేస్తూ ఉంటాయి. కేవల సంభాషణ చప్పగా, నీరసంగా ఉంటుంది. దానిలో చమత్కార చందనాన్ని కలిపి, పూసి, వాసనచూచి, అనుభవిస్తేగాని, అందులోని మజా - మస్తుగా తెలియదు. అంతేకాక, ఇక్కడ ధ్వనికారుడు చెప్పిన "సంవాదో హ్యన్య సాదృశ్యం. ." (ధ్వ 4 13) లో వివరించిన అన్యసాదృశ్యాన్ని, ఆ కావ్యార్థత్రయ వివరణను కూడా, వింగడించుకోవాలి

మరియు, ఈ కావ్యార్థాన్ని, దేశ, కాల, అవస్థాది భేదాలతో, ఔచిత్య బంధురంగా, రసభావాది వ్యంజకమగునట్లు, చిత్రంగా కూర్చినచో, ఇక లక్షలకొలది బృహస్పతులు, కావ్యనిర్మాణమును తలపెట్టినను, అవి క్షయమునొందక, నవనవోన్మేషంగా వర్తిస్తాయి అనేక కవుల బుద్ధులలో, అనుభుక్తాలైన, అనంత - నవీన - కావ్యార్థాలు క్రొంగ్రొత్త వ్యుత్పత్తులతో వెలుగు చూస్తూనే ఉంటాయి. కనుకనే 'సంవాదిన్యో మేధావినాం బుద్ధయః' - మేధావంతుల బుద్ధులతోటి సాదృశ్యాను తదితరుల బుద్ధులందునూ స్ఫురించుటను చూచి, ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఒకరిపోలికగల మనిషి మరొకరున్నంత మాత్రాన, వారిద్దరు ఒకరే అవుతారా ? కారు గదా !

ఇట్లు, వాక్యార్థములే కాక, పదార్థ సంవాదాలు కూడా ఎన్నో ఉన్నాయి ఇతరులు వాడిన అక్షరాలు, పదాలు, మనంకూడా వాడక తప్పడం లేదు అది తప్పా? కాదు అట్లే, ఈ పదార్థసంవాదం కూడా తప్పుకాదు. ఏలన, దీనిలో అక్షరాది రచనయే క్రొత్తది వస్తురచన మాత్రం పాతదే. (4 -15)

వాచస్పతి అంతటివాడు కూడ, అపూర్వాక్షరాలనుగాని, పదాలనుగాని సృష్టింపజాలనపుడు, మనం (మాత్రం) ఇతరులు వాడిన అక్షరాలనుగాని, పదాలనుగాని వాడితే తప్పేముంది ? మొత్తం మీద పెద్దలరచనలో పూర్వచ్ఛాయలున్నా, అవి వ్యంగ్యసమర్పణ సమర్థములయినచో, నింద్యాలుకాక, ఆ కావ్యానికొక, అభూత అపూర్వ శోభను, చమత్కారాన్ని కూడా అందిస్తాయని తాత్పర్యము ఇతర వివరాలు, ఉదా లు చివరిభాగంలో చూడగలరు.

శ్లేష, వక్రోక్తులతోగూడిన సంవాదాలు, పైకి అధిక్షేపణలను; హాస్యాదులనందిస్తూ, సహృదయానంద కరాలౌతాయి "నిరంకుశాః కవయః" - కవులు సర్వస్వతంత్రులు. అవసరమైనపుడు బ్రహ్మసృష్టిని కూడ అధిగమించి, దానిని నవరస రుచిరను, హ్లాదైకమయిని చేయగలరు. కొండొకచో, తమశ్శ్లేష - వక్రోక్తి మర్యాదలతో, కేవలం మానవులనే కాక, హరి, హరాది దేవతలను, వారివారి దేవేరులను కూడా, దెప్పిపొడుపులతో, వాగ్బంధం చేయించి, నోరు మూయిస్తారు. వేరొకచో, ఆ దేవేరులు తమలో తాము కలహించుకొంటూ, సవతిపోరునుకూడా గుర్తుకు తెస్తారు. ఇట్లే, ఇతర చమత్కారాలు ఎన్నో ఉన్నా, మచ్చుకు కొన్ని ఉదా-లను మన్నించి, పరిశీలించాలని, పాఠకమహోదయులకు మనవి.

అవతారిక విష్ణు (కృష్ణ) సంబద్ధ సంవాదములు కొన్ని

**1 .శ్లో. అంగుల్యా కః కవా(పా)టం ప్రహరతి? కుటిలే! మాధవః, కిం వసన్తః ?**
**నో చక్రీ, కిం కులాలః ? న హి ధరణీధరః, కిం ద్విజిహ్వః ఫణీన్ద్రః?**
**నాహం, ఘోరాహిమర్దీ, కి ముత ఖగపతిః? నో హరిః, కిం కపీన్ద్రః ?**
**ఇ త్యేవం సత్యభామా ప్రతివచనజితః పాతు వశ్చక్ర పాణిః**

సందర్భము ఇది శ్రీకృష్ణ సత్యభామా సంవాదరూపము. శ్రీకృష్ణుని రాక ఆలస్యం కావడంతో, సత్యభామ కోపగించి, తలుపుమూసుకొన్నది. తర్వాత వచ్చిన కృష్ణుడు, తలుపు తట్టినాడు. అప్పుడు సత్యభామ.-

ప్రశ్న : ఎవరక్కడ? వ్రేలితో తలుపుతట్టుచున్నారు? - అని ప్రశ్నింపగా-

కృష్ణుని ప్రత్యుత్తరము :- వంకరగా ఆలోచించు దానా! (కుటిలే!) నేను మాధవుణ్ణే, నీ (మొగుణ్ణే) అనగా

సత్యభామ, మరల వక్రంగానే నానార్థాలతో ఆలోచించి -

ప్ర. 2 ఓహో! వసన్తుడవా? అని సత్య తిరిగి ప్రశ్నించింది.

కృ. ఉ కాదు (నో), నేను సుదర్శన చక్రధారిని సుమా !

సత్య ప్ర.3 ఓహో! కుండలుచేయుచూ, ఆనుచక్రాన్ని పట్టుకొని త్రిప్పేకుమ్మరివాడవా?

కృ ఉ కాదు, సమస్తభూమిని ధరించినవాడను.

సత్య. ప్ర 4. అట్లా నిజం చెప్పు, ఓహో భూభారాన్ని మోసే రెండునాల్కలుగల (ద్విజహ్వ.) ఆదిశేషుడవా?

కృ. ఉ. అబ్బేకాదే, నేను ఆకళింగ సర్పాన్ని మర్దన చేసినవాడను.

ప్ర.5 ఓహో! అదా సంగతి. పాములను పట్టి తినే పక్షీంద్రుడవు (గరుత్మంతుడవు) అన్నమాట!

ఉ. కాదే, నేను హరిని.

ప్ర.6 అయితే పెద్దకోతివి (హరి + ఇంద్రః) అన్నమాట!

**వివరణ, విశేషాలు : ఇలా, ప్రతి ప్రశ్నకు శ్లేష, వక్రోక్తులతో, తీగల్లాగా విపరీతార్థాలను లాగి,తికమకపెట్టిన సత్యభామా ప్రశ్నలకు ప్రత్యుత్తరం చెప్పలేక, విసిగి వేసారి, నోరుమూసుకున్న సుదర్శనచక్రధారి యగు, ఆ శ్రీమహావిష్ణువు (కృష్ణుడు) మిమ్ములను, మమ్ములను కూడా, రక్షించునుగాక.**

**1** వి. శ్లో ; యమానిలేంద్ర చంద్రార్క విష్ణుసింహాంశువాజిషు
శుకా హి కపి భేకేషు హరి ర్నా కపిలే త్రిషు ॥ అ.కో. 3.33

హరి శబ్దానికి నానార్థములు :- "హరి" అను శబ్దము - యమునికి, వాయు దేవునికి, దేవేంద్రునికి, చంద్రునికి, సూర్యునికి, విష్ణువునకు, సింహమునకు, కిరణమునకు, గుఱ్ఱమునకు, చిలుకకు, పాముకు, కోతికి, కప్పకునూ నామము (పేరు) అగునప్పుడు పుంలింగములోనూ (నా), బంగారుఛాయగలదానికి (కపిలే) పేరగునపుడు పుంలింగ, స్త్రీలింగ, నపుంసకలింగములనబడు, మూడు (త్రి) లింగములందును, ప్రయోగింపబడును అనగా ఇవన్నీ "హరి" శబ్దానికి నానార్థములని - అమరకోశము.

వివరణ :2. ఈ సంభాషణ "శ్లేష, వక్రోక్తి" అను అలంకారాలకు కూడా ఉదాహరణమగుచున్నది. "శ్లేష"అనగా అనేక అర్థాలుగల ఒక అలంకారము. "నానార్థసంశ్రయః శ్లేషః".

"వక్రోక్తి" అనగా - ఇతరులు అడిగిన దానికి, కాకు స్వరంతోగాని, శ్లేషతోగాని, నానార్థాలతో, భంగీభణుతులతో, చాతుర్యముతో, విరుద్ధార్థాలు లాగి, ఆ సంవాదానికి చమత్కార చందనం పూసి, ఆనందింపజేయుట ఇది వక్రోక్తుల స్వభావం.

3 మొత్తం మీద మన కవీంద్రులు దేనాదిదేవులను కూడా వదలక, వక్రోక్తులతో, శ్లేషలతో వాయించి, భార్యావిధేయులనూగా చేయించినా దన్నమాట! అన్నమాటేమిటి? అది ఉన్న (జరిగిన) మాటే

**2.శ్లో. కోஉయం ద్వారి? హరిః, ప్రయా హ్యుపవనం శాఖామృగ స్యా త్ర కిమ్?**

**కృష్ణోஉహందయితే ! బిభేమి సుతరాం కృష్ణా దహం వానరాత్?**

**రాధేஉహం మధుసూదనో, వ్రజ లతాం తా మేవ తన్వీ మలం,**

**ఇత్థం నిర్వచనీకృతో దయితయా హ్రీణో హరిః పాతు వః ॥**

సందర్భము : రాధామాధవుల సంవాదము.

రాధ ప్రశ్న1. ఆ గడప దగ్గర ఉన్నది ఎవరు?

కృష్ణుని ఉత్తరం. నేను హరిని (కృష్ణుణ్ణి) హరి = (నానార్థాలు) కృష్ణుడు, కోతి.... మొ.నవి.

ప్ర. 2.కోతికి (శాఖామృగస్య) ఎక్కడ, పనేముంది? ఆ తోటలోకి వెళ్ళి ఆడుకో.

ఉ. ప్రియురాలా! నేను కృష్ణుణ్ణే! (కృష్ణ =(నానా) నల్లనిది, కృష్ణుడు,...)

ప్ర. 3. అమ్మో! నల్లకోతి (కొండముచ్చు) అంటే నాకు మరీ భయం సుమా!

ఉ. రాధా! నేను మధుసూదనుడను. (మధుసూదన (నానా) తేనెత్రాగుతుమ్మెద, కృష్ణుడు...)

ప్ర.4. తుమ్మెదవా? అదుగో, ఆ కన్పడే సన్నని తీగ దగ్గరకు వెళ్ళు. కావలసినంత (అలం) మధుపానం చేసుకోవచ్చు, ఇకమాటలుచాలించు (అలం)..

ఇలా, మరల మాట్లాడకుండా, రాధతో నోరుమూయింపబడి, సిగ్గుపడిన శ్రీకృష్ణుడు మిమ్ము రక్షించుగాక!

వి.1. ఇట్లు రాధ నానార్థ-శ్లేష, వక్రోక్తుల చమత్కారాలతో, నాణెంగా కృష్ణుని ఆటకట్టించిందన్నమాట.

2. ఈ సంవాద శ్లోకాలలో, చివర"వః" (మిమ్ములను) అనిగాని, "నః" (మమ్ములను) అనిగాని ఉంటుంది. ఈ వః-నః అనే పదాలు, కేవలం ఆ అర్థాన్నే గాక, మిమ్ములను, మమ్ములను, అనగా మనలనందరిని - అనే అర్థం చేప్పుకోవాలని కవిసంప్రదాయం. ఇట్లే ఒక ముందు వచ్చు శ్లోకాలలో కూడ గమనించాలి.

**వ్యా. వి. 1. కః + అయం = కోஉయం 2. కృష్ణః + అహం = కృష్ణోஉహం. 3. రాధే + అహం = రాధేஉహం.**

**3.శ్లో. కస్త్వం? కృష్ణ మవేహి మాం, కి మిహాతే? మన్మందిరాశంకయా,**

**యుక్తం త న్నవనీత భాజనపుటే న్యస్తః కి మర్థం కరః? ।**

**కర్తుం లత్ర పిపీలికాపనయనం, సుప్తా కి ముద్బోధితా**

**బాలా? వత్సగతిం వివేక్తు, మితి సంజల్పన్ హరిఃపాతు వః ॥**

సం. ఒకనాడు, ఆ వెన్నదొంగను పట్టుకొని ప్రశ్నిస్తున్న గోపికకు, కృష్ణునికి, జరిగిన సంవాదం.

గోపికప్రశ్న 1. ఎవరవయ్యా ! నీవు? కృ ఉ. నేను కృష్ణుణ్ణే (నన్ను కృష్ణునిగా తెలుసుకో)

ప్ర.2. అయితే, నీ కిక్కడ (మాయింటివద్ద) ఏమి పని?
ఉ. (అయ్యో! ఎంత పొరపాటైనది?) ఇది నా యిల్లనుకొని వచ్చినాను సుమా! ప్ర.3. పోనీ, వచ్చినావుపరే, ఆవెన్నకుండలో చేతినెందుకు పెట్టినావయ్యా? ఇది నీకు తగునా?
ఉ. అబ్బే, ఏమీలేదు దానిలో చీమలుపడితేను వేరుచేసి, తొలగిస్తున్నాను అంతే.
ప్ర.4. సరే, లక్కడ నిద్రపోయే, ఆ ఆడుపిల్ల దగ్గరకు వెళ్ళి, ఎందుకు లేపుతున్నావు?
ఉ అబ్బే మరేమిలేదమ్మా, మా ఆవుదూడ దోవతప్పి ఎక్కడికో పోయింది. ఆసంగతిని ఆమెను అడిగితెలుసుకుందామని.

ఇట్లు, అడ్డదిడ్డాలుగా, వక్రోక్తులతో ఆన్సర్లు చెప్పిన, ఆ కృష్ణావతారం మిమ్ము, మమ్ము కూడ రక్షించును గాక!

వ్యా.వి. కః+ త్వం = కస్త్వం, మత్ + మందిర+ అశంకయా =మన్మందిరాశంకయా, తత్+నవనీత =తన్నవనీత..., పిపీలికా+ అపనయనం = పిపీలికాపనయనం.

**4.శ్లో. మాతః? కిం యదునాథ!, దేహి చషకం? కిం తేన, పాతుం పయః?**
**తన్నాస్త్యద్య, కదాస్తి? తన్నిశి, నిశా కా వా? ంధకారోదయే (యః)।**
**ఆమీల్యాక్షియుగం నిశా ఉప్యుపగతా, దే? హీతి మాతుః పునః**
**వక్షోజాంబరకర్షణోద్యతకరః కృష్ణః స పుష్ణాతు నః ॥ కృ.క.**

సం. యశోదా కృష్ణుల సంవాదము.

కృ. ప్ర.1. అమ్మా! ఉ. నాయనా! యదుశ్రేష్ఠ ఏమికావాలిరా?
2. ఆ పానపాత్రను (చషకం) ఇలా ఇమ్ము. ఉ. దానితో నీకేమిపని?
3. పాలు త్రాగుటకు ఉ. ఆపాలు ఇప్పుడు లేవురా నాయనా!
4. అయితే, ఎప్పుడు ఉంటాయి? ఉ. రాత్రికి ఉంటాయి.
5. రాత్రి (నిశా) అంటే ఏమిటి? ఉ. చీకటి పడినప్పుడు
6. కృష్ణుడు వెంటనే రెండు కన్నులు మూసుకొని, ఇంకేముంది? రాత్రిరానే వచ్చింది.

చీకటి పడింది. పాలిమ్ము - అని, తల్లి రొమ్ముల మీది వస్త్రాన్నిలా చేతులతో లాగుచున్న కృష్ణుడు, మనకు తుష్టిని, పుష్టిని ప్రసాదించుగాక!

వి. సంధులు : తత్+ న+ అస్తి+ అద్య=తన్నాస్త్యద్య, తత్+ నిశి= తన్నిశి, నిశా+ అపి+ ఉపగతా= నిశాప్యుపగతా. ఆమీల్య+ అక్షియుగం= ఆమీల్యాక్షియుగమ్, దేహి+ ఇతి=దేహీతి.

**5.శ్లో. కృష్ణే నామ్బ! గతేన రన్తు మధునా మృద్భక్షితా స్వేచ్ఛయా,**
**సత్యం కృష్ణ! కిమేష ఆహ ముసలీ? మిథ్యామ్బ! పశ్యా ననమ్।**
**వ్యాదేహీ? తి వికాసితే చ వదనే, దృష్ట్వా సమస్తం జగత్**
**మాతా యస్య జగామ విస్మయ పదం, పాయా త్స వః శ్రీపతిః ॥**

సం. బలరామ-యశోదా-కృష్ణుల సంభాషణ.

బలరాముడు : అమ్మా! ఆటలకు వెళ్లిన కృష్ణుడు, ఇప్పుడు (అక్కడ) యథేచ్ఛగా కావలసినంత మట్టి

తిన్నాడమ్మా! అని చెప్పగా,

యశోద . ఏమిరా, కృష్ణా! ఈ బలరాముడు (ముసలీ = రోకలి ఆయుధంగా గలవాడు) చెప్పేదంతా నిజమేనంటావా? అని అడుగ,

కృష్ణుడు : అమ్మా! అతడు చెప్పినదంతా అబద్ధం (మిథ్యా), కావలిస్తే నానోరు పరీక్షించుకోరాదా ? అనగా,

యశోద - సరే, నోరు తెరువు - అనగా, కృష్ణుడు నోరు తెరవగానే, ఆ నోటిలో సర్వజగత్తును, అండ, పిండ బ్రహ్మాండాలను, అంతా చూచి, అతని తల్లియగు యశోద ఆశ్చర్యపడిపోయిందట!

అట్టి, ఆ లక్ష్మీపతి (శ్రీపతి) మనలను రక్షించునుగాక!

**వి. మిథ్యా+అమ్బ = మిథ్యామ్బ, పశ్య+ ఆననమ్ = పశ్యాననమ్, వ్యాదేహి+ ఇతి = వ్యాదేహీతి.**

**6.శ్లో కృష్ణ! త్వం పఠ, కిం పఠామి? నను రే! శాస్త్రం, కిము జ్ఞాయతే?**
**తత్త్వం, కస్య? విభోః, స కః? త్రిభువనాధీశ శ్చ, తేనాపి కిమ్?।**
**జ్ఞానం భక్తి రథో విరక్తిః, అనయాకిం? ముక్తిరే వా స్తు తే ?**
**దధ్యాదీని భజామి మాతు రుదితం వాక్యం హరేః పాతువః॥**

సం. యశోదాకృష్ణుల సంవాదం.

యశోదః ప్ర. 1. ఒరే! కృష్ణా! చదువుకోరానాయనా! ఉ. ఏమిచదువుకోమంటావమ్మా?

2 నాయనా! శాస్త్రాన్ని చదువుకోరా! ఉ. ఆ శాస్త్రపఠనంతో ఏమి తెలుస్తుందమ్మా!

3. యథార్థ జ్ఞానం రా? ఉ ఎవరికి సంబంధించిన తత్త్వం?

4. ఆ ప్రభువు యొక్క (విభోః) ఉ ఆ ప్రభువెవరు? 5. అతడు మూడు లోకాలకు ప్రభువు సుమా!

5. వానితో ప్రయోజన మేమిటి? ఉ. తెలివి, భక్తి (సేవ), ఇంకా వైరాగ్యం కూడ తెలుస్తాయిరా!

6 వీని వలన వచ్చే లాభమేముందమ్మా? ఉ. ఒరే! అబ్బాయీ! నీకు ముక్తి కల్గుతుంది రా !

7. అమ్మా! అదినీకే లభించుగాక! నాకవసరం లేదు నేను మాత్రం పెరుగు మొదలగు వానినే సేవిస్తాను. నాకు అవే కావాలి సుమా! అని, తల్లి మాటలకు, వెటకారంతో సమాధానం వెలిపుచ్చిన కృష్ణుడు అందరిని రక్షించునుగాక!

**వి. త్రిభువన+అధి+ ఈశః+చ=త్రిభువనాధీశశ్చ, ముక్తిః+ఏవ+అస్తు = ముక్తిరేవాస్తు. దధి+ ఆదీని= దధ్యాదీని, అను సంధులనిట్లు సరిగా విడదీసుకోవలెను.**

**7.శ్లో. కే యం భాగ్యవతీ తవో రసి? మణిః, బ్రూహ్యగ్ర వర్ణం వినా ।**
**కృత్వాస్యాః ప్రథమం వినా క్వ సహజో వర్ణో మణే స్తాదృశః ।**
**స్త్రీ రూపం కథ మస్య లింగవచనాత్ పృచ్ఛామి వధ్వాకృతిం**
**ముగ్ధే! త్వ త్ప్రతిబిమ్బ మి త్యపలపన్ రాధాం హరిః పాతు వః ।**

సం . రాధా కృష్ణుల సంవాదం:

రాధ ప్రశ్న1. ప్రియా! నీ రొమ్ముపై ( ఉరసి) నున్న ఆ అదృష్టవంతురా లెవరు?

కృష్ణుని ప్రత్యుత్తరం : అది ఒక మణిసుమా!

ప్ర 2. అదేమిటి? దాని మొదటి (అగ్ర) అక్షరాన్ని తొలగించి చెప్పుచున్నావు? (అనగా నస్తుత: రమణీ అని చెప్పవలసింది పోయి, ఆది నున్న "ర" అనే వర్ణాన్ని తొలగించి మణీ అని చెప్పుచున్నావు? ఎందువలన?
ఉ. ప్రథమాక్షరం కల్పకుండా, ఆ మణికి అలాంటి సహజవర్ణం ఎలా ఉంటుంది.
ప్ర.3. అయితే, దానికి స్త్రీ రూపం కూడ ఎలా సిద్ధిస్తోంది? (పుంలింగం మణి కాగా, స్త్రీ లింగం మణీ ఎలా సిద్ధిస్తోంది? వ్యాకరణంలో స్త్రీలింగనియమాన్ని అనుసరించి ఆ స్త్రీ రూపాన్ని (వధూ+ ఆకృతిం) గూర్చి అడుగుతున్నాను సుమా!
ఉ. ఓహో, అదా?, ఓసి అమాయికురాలా! ఆ మణిపై, నీప్రతిబింబం ప్రతిఫలించడంతో, అది నీకు స్త్రీ రూపంగా కన్పడుతోంది సుమా- అని మాయలో రాధను మభ్యపెట్టిన హరి మనలనందరిని రక్షించునుగాక!.

**వ్యా.వి. కా+ ఇయం=కేయమ్, తవ+ ఉరసి=తవోరసి, బ్రూషే+అగ్రవర్ణం= బ్రూషేऽగ్రవర్ణం, మణేః+తాదృశః=మణేస్తాదృశః, వధూ+ ఆకృతిం = వధ్వాకృతిం, ఇతి+అపలపన్= ఇత్యపలపన్.**

**8.శ్లో. రామోనామ బభూవ, హుం, తదబలా సీతేతి, హుం, తాం పితు:**
**వాచా పఞ్చవటీ తటే నివసత: తా మాహరత్ రావణ: ।**
**కృష్ణే నేతి పురాతనీం నిజకథాం ఆకర్ణ్య మా త్రేరిత:**
**సౌమిత్రే! క్వ ధను ర్ధను ర్ధను రితి ప్రోక్తా గిర: పాన్తు వ: ॥ కృ.క.2-72.**

సం. ఇదొక విచిత్ర శ్లోకం. విష్ణుమూర్తి ధర్మ సంస్థాపన కొరకు దశావతారాలెత్తినాడు. రామావతారం తర్వాత, ఆవిష్ణుమూర్తి పునర్జన్మలో కృష్ణుడు గా అవతరించి పుట్టినాడు
ఆచిన్ని కృష్ణుని ఊయలలో ఊగిస్తూ, నిద్రపుచ్చుటకు, తల్లి యశోద శ్రీరాముని పూర్వకథను చెప్పుచుండగా, యోగనిద్రలో నున్న కృష్ణుడు, తన పూర్వజన్మ వృత్తాంతాన్ని గుర్తుకు తెచ్చుకొని "హుం" (ఊ) అని ఊకొట్టుచున్నాడన్నమాట!
యశోద-1. పూర్వం రాముడు అనే వాడుండేవాడు సుమా! కృ. ఉ. "హుం" అని ఊకొట్టగా,
య-2. అతని భార్య సీత ఉండేది. కృ. ఉ "హుం" అని మరల ఊ కొట్టగా,
య-3. పితృవాక్య పరిపాలనకై ఆ శ్రీరాముడామెతో పాటు పంచవటీ వనంలో నివసించేవాడట! ఇంతలో రావణు డనే రాక్షసుడు వచ్చి, ఆ సీతనెత్తుకొని పోయాడట! (కృష్ణుని నిద్ర పుచ్చుటకు తల్లి యశోద, వాని రామావతార పూర్వకథను ఇట్లు చెప్పుచుండ, "హుం" అంటూ వింటూ తల్లి మాటలతో ప్రేరితుడైన కృష్ణుడు, తన పూర్వకథను గుర్తుకు తెచ్చుకొని,) లక్ష్మణా! రావణాపహృతయైన సీత ను రక్షించాలి. ఎక్కడ రా, నాధనుస్సు? (విల్లు) అని, గబగబ ముమ్మారు పల్కిన శ్రీ కృష్ణుని వాక్కులు మిమ్ము రక్షించునుగాక!

**వి. తన్మయీభావం చెందిన కృష్ణుడు సీతారక్షణకై వింటిని తెమ్మన్నాడని భావన.**
వ. సీతా+ ఇతి=సీతేతి, కృష్ణేన+ ఇతి=కృష్ణేనేతి, మాత్రా= ఈరితః మాత్రేరితః, ధను:+ ఇతి=ధనురితి.

**9.శ్లో. స్వస్తి! స్వాగతం, అర్ఘ్యహం వద విభో! కిం దీయతాం? మేదినీ,**
**కా మాత్రా? మమ విక్రమ త్రయపదం, దత్తం, జలం దీయతామ్,**

**మా దేహీ త్యశనాzబ్రవీత్. హరి రయం. పాత్రం కి మస్మాత్ పరం**
**చే త్యేవం బలినా ర్సితో మఖముఖే. పాయాత్ స వో వామనః ॥**

సం ఈ సంభాషణ బలిచక్రవర్తికి, వామనావతారమెత్తిన విష్ణునికి జరిగినది. బ్రాహ్మణ బ్రహ్మచారివేషంతో, పొట్టివామనుడు, యజ్ఞం చేయుచున్న బలిచక్రవర్తి వద్దకు వెళ్ళి, మూడు అడుగుల నేల నడుగుచున్నాడు.

వా. 1. ఓ బలిచక్రవర్తి! నీకు శుభ మగుగాక! (స్వస్తి సు+అస్తి) అని ఆశీస్సు.

బలి ఉ దయచేయుడు అని కుశల ప్రశ్న పూర్వక- ఆహ్వానము (స్వాగతమ్)

వామ 2. నేను అడుగుకొనుట (యాచన) కై వచ్చినాను. (అర్థీ+అహం= అహం- అర్థీ)

బలి ఉ. అయితే, ప్రభూ! ఏం కావాలో చెప్పండి.

వా. 3. ఏమీలేదు, నాకు భూమి కావాలి, ఉ. ఎంత పరిమితి (కొలత) గలది?

వా 4. నా కాలితో కొలిస్తే మూడడుగులు మాత్రమే సుమా! ఉ. అయితే, ఇచ్చేశాను (దత్తం)

వా.5. బ్రహ్మార్పణం అంటూ, తర్పణ పూర్వకంగా దానం చేయుడు( జలం- దీయతామ్)

ఇంతలో, శుక్రాచార్యుడు( ఉశనా) వచ్చి అడ్డుపడి, రాజా! ధనం ఇవ్వవద్దు ( మాదేహి) ఇతడు సామాన్యుడు కాడు, మారువేషంలో మోసగించటానికి వచ్చిన విష్ణువు సుమా! అనగా -

బలి- ఉ గురువర్యా! ఇంతకంటే యోగ్యుడు (యోగ్యపాత్ర) మనకు ఎక్కడ నుండి దొరుకుతాడు?- అనుచున్న- బలిచక్రవర్తిచే, యజ్ఞాగ్రభాగమున (ముఖమున) సేవింపబడిన, ఆ వామనావతారము, మిమ్ము (వః) కాపాడుగాక!

**వి. 1. ఇట్లు, గుర్వాజ్ఞను కూడ ధిక్కరించి, పొట్టివాని గట్టి కోర్కెను తీర్చుటకు, తన సర్వస్వాన్ని దానం చేసిన మహా, వితరణశీలి ఆ బలి, అన్యాపదేశంగా అథఃపాతాళానికి అణగద్రొక్కబడినా, ఆబలిచక్రవర్తి, ఆనాటికి,నేటికేగాక, ఏనాటికైనా, యశస్కాయుడై, ఎంతో వితరణశీలి గా, అందరికి ఆదర్శప్రాయుడుగా కూడ నిల్చియున్నాడని గమనింపవలెను.**

**2.** ఇట్లు అడితప్పనివాడు గా అత్యంత ప్రచారం పొందిన బలి చక్రవర్తి, దేవతల బాధల కోర్వలేని త రాక్షసులను రక్షించుటకై దేవేంద్రునిపై దండెత్తెను. ప్రత్యక్షంగా ఎదుర్కొనజాలని పాకశాసనుడు పలాయనమంత్రం పఠించి, బ్రహ్మాదులతో మంతనములాడి, వంచించుటకై వామనునిబంపి, ఒక్క అడుగుతో భూమిని, రెండవ అడుగుతో ఆకాశమునాక్రమింపజేసెను. ఇక మూడవపాదాన్ని బలినెత్తిపై పెట్టించి, త్రొక్కింపబోవుచుండ, అతని తాతయగు ప్రహ్లాదుడు వచ్చి, ప్రభూ! బలి, నీతి- భక్తి- పరుడు దండనార్హుడుకాడు- అని వేడినను, వినలేదు. ఆ పాపపరిహారార్థమై, ఆ విష్ణువు అంతటివాడు కూడ చివరికి, ఆ బలి వాకిట కావలాదారుడయ్యెను.

ఇట్టి సద్ధర్మ మణచిన వామనుడు అవతారపురుషుడు డెలా ఔతాడు? అని ప్రశ్న రావచ్చు. అందుచేతనే గదా భక్తవశంకరుడగు ఆ మహావిష్ణువు, ఆ బలి ఇంటికి కావలాదారు డయ్యెను. తప్పుచేసినవారు దేవుడైనా, శిక్ష నుండి తప్పించుకొనజాలడన్నమాట!

3. స్వాగతమ్ అనే రూపం ఎట్లు సిద్ధించినదనగా :- సు+ ఆ+గమ+క్త = ఇట్లు మొదట (కృత్ ప్రత్యయం రాగా) తర్వాత, స్వాగత+అచ్(తద్ధిత ప్రత్యయం)కాగా, చివరికి "స్వాగతమ్", అను రూపం సిద్ధిస్తుంది. ఇదొక వ్యాకరణ విశేష వ్యుత్పత్తి – అని గ్రహింపవలెను.

**10.శ్లో. కృష్ణ! గోరస చౌర్యమంబ! కురుతే, కిం కృష్ణ!? మాతః! సురా -**

**పానం న ప్రకరోమి, రామ! కి మిదం ? నాహం పరస్త్రీరతః ।**

**కిం గోవిన్ద! వద తృసాహలధరః, మిథ్యేతి తాం వ్యాహరన్**

**గోపీగోపకదమ్బకం విహసయన్, ముగ్ధోముకున్దోఽవతు ॥**

**సం. యశోదా, బలరామ, కృష్ణుల సంవాదం.**

బలరాముడు: అమ్మా! మనకృష్ణుడు పాలను (గోరసం) దొంగిలిస్తున్నాడే.

యశోద· ఏరా? కృష్ణా! ( ఇది నిజమేనా) అని అడుగగా,

కృష్ణుడు. అమ్మా! (మాతః!) నేను(అన్న బలరాముని వలె) మద్యపానం చేయటంలేదు.

యశోద : ఏమిరా! బలరామా! ఇదేమి పిచ్చి పనయ్యా! (కిమిదం అని అడిగగింది)

బ.రా అమ్మా! నేను పరస్త్రీలగు 16 వేల గోపికలయందాసక్తిగల వ్యభిచారిని కాను.

యశోద: ఏమిరా గోవింద! ఈ నాగలిని ధరించిన బలరాముడిలా చెప్పుచున్నాడేమి?

కృష్ణుడు· అమ్మా! అదంతా అబద్ధం (మిథ్యా) కల్పించి చెప్పుచున్నాడమ్మా! అని చెప్పి యశోదనేకాక, తన చమత్కారసహిత- వాక్యాలతో, ఎదుట నున్న గోపికలను, గోపకులను కూడ, నవ్వింపజేసిన ముగ్ధముకుందుడు (కృష్ణుడు) అందరిని రక్షించుగాక!.

**వ్యా.వి. వదతి+అసౌ= వదత్యసౌ,మిథ్యా+ ఇతి= మిథ్యేతి,ముకున్దః+ అవతు=ముకున్దోఽవతు.**

**11.శ్లో. క స్త్వం? పీతాంబరోఽహం, కిము వదసి మృషా? చాంబరం కేన పీతమ్**

**ముగ్ధే! కంసస్య శత్రుః, శివశివ! సలిలం సస్యవైరి క్వ దృష్టమ్?**

**మల్లాస్య ధ్వంసనోఽహం? కిమితి నిజమహో లాస్య మధ్వంసి చేతి**

**వ్యాహారై ర్వల్లవానాం నిశి భవతు ముదేఽనుత్తరః శ్రీపతి ర్వః ॥**

సం. యాదవులకు కృష్ణునకు జరిగిన సంవాదం.

ప్ర.1. శ్లో. ఎవరవయ్యా! నీవు? ఉ. నేను పీతాంబరుడను, పచ్చని పట్టు బట్టకట్టిన కృష్ణుణ్ణి.

2. ఏం పెద్దమనిషివయ్యా! అన్నీ అబద్ధాలాడతావేమి? (పీత+అంబరం = అంబరం -పీతం) ఆకాశం ఎవరి చేతనైనా మింగబడుతుందా? అని (పీతం అంబరం యేన సః = పీతాంబరః, తృతీయాబహువ్రీహి సమాసం) అని అడుగగా

ఉ. ముగ్ధరాలా! నేను కంసు డనే రాక్షసుణ్ణి చంపిన శత్రువునే.

3. శివ,శివా! అని కళ్ళు, చెవులుమూసుకొని, ఇలా అబద్ధం చెప్పుతావేమయ్యా! "కంసస్య శత్రుః" అనే దాన్ని "కం, సస్య-శత్రుః" గావిడదీసి, నీరు (కం) ఎప్పుడైనా, ఎక్కడైనా, పైరులకు (సస్య) శత్రువై,నాశనం చేస్తుందని విన్నామా? కన్నామా? అనగా,

ఉ. నేను మల్లురగు (బలంగలజెట్టి)

3 చాణూర, ముష్టిక సురులను చంపినవాడినే! ( మత్+ లాస్య ధ్వంసి)

4 అదెట్లాసాధ్య పౌతుందయ్యా నీవు, నీలాస్యాన్ని (నాట్యాన్ని) ఎలానాశనం చేస్తావు? ఇట్లు, రాత్రులందు సరససల్లాపాలతో కాలక్షేపం చేస్తూ ప్రశ్నిస్తున్నయాదవులకు సమాధానం చెప్పలేక, తెల్లమొహంవేసిన, కృష్ణుడు మీకు సంతోషం కల్గించుగాక.

**వి. 1.మారుతే వేధసి బ్రధ్నే పుంసి కః, కం శిరోzమ్బునోః అ.క 3.190.**

కః (పుంలింగం) ఇది గాలికి, బ్రహ్మకు, సూర్యునికి, ఆత్మకును, స్నేదైనపుడు "కః" గా పుంలింగమునందును, శిరస్సుకు, నీరుకు నా మమైనపుడు "కం" అని నపుంసకలింగమందు ఉంటుంది.

2 కం = నీరు అను అర్థం గలది. ఇక్కడ "కం-సస్య-శత్రుః"గా భేదించిన, కంసారాతి-కృష్ణుడని అర్థం. అట్లుగాక, కం-సస్యశత్రుం = నీరు- సస్యాలకు శత్రువగుట ఎట్లుపొసగుతుంది. నీరు సస్యాలను పెంచుతుందిగాని నాశనం చేయదు గదా! ఈ చమత్కారానికి ఆధారం పదచ్ఛేదం సుమా!

4. మల్లాస్యధ్వంసి - అనే పదాన్ని, 1. మల్ల+ అస్య-ధ్వంసి, (=మల్లుర- ముఖాలను నాశనం చేసినవాడు) అని, 2. మత్+ లాస్య- ధ్వంసి, (=నాయొక్క - లాస్యనాట్యాన్ని - నాశనం చేసినవాడు) అనుశ్లిష్టార్థాలు కూడ, పదవిభాగమాహాత్మ్యం వల్లనే వచ్చిన వని గమనించాలి. 3. చాణూరుడు, ముష్టికుడు అనువారలు కంసుని ఆస్థానము నందలి మల్లురు).

**12.శ్లో. ఓష్ఠం ముంచ హరే! బిభేమి భవతా పానైర్హతా పూతనా,**

**కంఠాశ్లేష మముం జహీహి, దళితా వాలింగనే నార్జునౌ,**

**మా దేహీ చ్ఛురితం , హిరణ్యకశిపుః నీతో నఖైః పంచతాం**

**ఇత్థం వారితరాత్రి కేళ రవతాత్ లక్ష్మ్యాప హాసాద్ధరిః ॥కృ.క. 271**

సం. రాత్రి సంభోగసమయమున, లక్ష్మి - లేక - రుక్మిణీ కృష్ణుల సంవాదము.

ప్ర 1 కృష్ణా! పెదవి నింకా గట్టిగా నొక్కక విడువుము. ఎందుకని? అంటావేమో ?

అమ్మో! నీచేత రెండు గుక్కల పాలు పానం చేయటంతోనే, ఆ పూతన అనే రాక్షసిచంపబడినది గ( అందుచే భయపడుచున్నాను.

2. ఈ గాఢ కంఠా లింగనాన్ని కూడా విడిచిపెట్టు బాబూ! ఏలయన్న - నీ కౌగిలింతలో రెండు మద్దిచెట్ విరిగిపడిపోయినవి గదా ! ఇక, ఈ ఆలింగనంతో కూడ నాకేమి చెట్ట (కీడు) చేకూరుతుందో అ భయంవేస్తుంది.

3. ఇక నఖక్షతం (ఛురితం) కూడ చేయవద్దు బాబూ! నీ గోళ్లతో (నఖ) హిరణ్యకశివుడు చీల్చబడి, చచ్చినాడు గదా ! కనుక నీనఖక్షతాలతో నాకేమి కల్గునో అని భయం.

ఇట్లు లక్ష్మి (లేక రుక్మిణి) తో, రాత్రి రతి క్రీడా సమయంలో నవ్వుతూ, నివారింపబడిన కృష్ణుడు రక్షించుగాక!

**వి.1. అపహాసాత్ + హరిః, 2. దళితౌ + ఆలింగనేన – అను పదవిభాగాలను, సంధులను కూడ సరిగా గమనింపవలెను.**

## ఇక, శివ సంబద్ధ సంవాదాలు మరికొన్ని.

**13.శ్లో. క స్త్వం? శూలీ, మృగయ భిషజం? నీలకంఠః ప్రియేஉహమ్,**
**కేకా మేకాం కురు? పశుపతిః, నైవ దృశ్యే విషాణే? ।**
**స్థాణుః ముగ్ధే !? న వదతి తరుః, జీవితేశః శివాయాః,**
**గచ్ఛాటవ్యాం , ఇతి హతవచాః పాతు వః చంద్రచూడః**

సం. పార్వతీ పరమేశ్వరుల సంవాదము.

పార్వతి - ప్రశ్న 1. ఎవరవు నీవు? శివుని ప్రత్యుత్తరం : నేను త్రిశూలధారినైన (శూలీ) శివుడను,
2. పార్వతి, ఈ శూలీ శబ్దానికి శూలం అస్య అస్తీతి = శూలీ= కడుపునొప్పిగలవాడు, అని అర్థంచేసుకొని, శూల రోగం గలవాడవు ఇక్కడకు ఎందుకు వచ్చావు? వైద్యుని వెదుక్కొంటూ వెళ్ళు అనగా-
ఉ. ప్రేయసీ! నేను నీలకంఠుడనే! (నానా! శివుడు, నెమలి, ..)
3 నెమలివైనచో ఒక అరుపు (కేక) అరువు. (కేకా వాణీమయూరస్య = నెమలి యొక్క కూతను కేకా అంటారు - అని అమరకోశ ప్రమాణము)
ఉ.నేను నందీశ్వరుడను (నానా. శివుడను లేక, పశువులకు, గోవులకు ....పతిని)
4 అయితే, పశువులకు కొమ్ములుంటాయి అని నీకు కన్పడటం లేదే!
ఉ. ఓసీ మూర్ఖురాలా! నేను స్థాణువును (నానా. శివుడు, కదలని చెట్టు,మొద్దు లు...)
5. చెట్టు, లేక మొద్దు - అయితే, అవి మాట్లాడవుగదా! నీ వెట్లామాట్లాడుచున్నావు?
ఉ. నేను పార్వతికి ప్రాణేశ్వరుడను. (శివా భవానీ రుద్రాణీ . అని పార్వతికి పర్యాయపదాలు కాగా, "శివా" శబ్దానికి స్త్రియాం శివా భూరిమాయు, గోమాయు, మృగ ధూర్తకాః - ఇవన్నీ నక్కకు పర్యాయపదాలు) కనుక శివా = నక్క
6 నక్కవైతే అడవిలో తిరగాలి అక్కడ ఉండక, ఇక్కడికి ఎందుకు వచ్చావు. పో - అడవికి - అన్న పార్వతి ప్రశ్నలకు జవాబివ్వజాలని చంద్రశేఖరుడు మిమ్ములను రక్షించుగాక.
**వి. పద్యం లోని శూలీ, నీలకంఠ, పశుపతి, స్థాణు, శివా– అనే పదాలు నానార్థాలతో చమత్కారచందనాన్ని చిందించిన వని తెలియదగును.**

**14.శ్లో. మౌలౌ కిం ను? మహేశ! మానిని! జలం, కిం వక్త్రం? అంభోరుహం.**
**కిం నీలాలక వేణికా? మధుకరీ, కింభ్రూలతా? వీచికా,**
**కిం నేత్రే? శఫరౌ, కిము స్తనయుగం? ప్రేంఖత్ రథాంగద్వయం**
**నాశంకా మితి వంచయన్ గిరిసుతాం గంగాధరః పాతువః ॥**

సం. పార్వతీపరమేశ్వరసంవాదము.

పార్వతి ప్రశ్న. 1 పరమేశా! నీతలపై నున్న దెవరు?
శివుని ఉత్తరం అభిమానవతి! (శ్లిష్ట వక్రోక్తితో) నీరు (జలం) సుమా!(గంగ)
2 ఏటి ముఖంలాగా కూడి అక్కడ కన్పడుతోంది! అదేమిటే?

ఉ ఆ నీటిలో మొలచిన కమలము (అంభోరుహము) సుమా!
3. అదేమిటండీ: నల్లని వెంట్రుకలతో జడమాదిరిగా కూడ కన్పడుతోంటే?
ఉ. ఔను, అది ఆ పద్మాలలోని, తేనె నాస్వాదింపవచ్చిన తుమ్మెదలగుంపు.
4. అయితే, తీగలవలె కనుబొమ్మలు కూడ కన్పడు చున్నాయేమిటి?
ఉ ఏమీలేదు. ఆ నీటిలోని తరంగాలు (అలలు) సుమా!
5. రెండు కళ్లు కూడ కన్పడుతూ ఉంటే, వాటినేమిటి? దాస్తారు?
ఉ అబ్బే! అవి ఆ నీళ్ళలోని చేపలుసుమా !
6. గుండ్రంగా రెండు కుచాలు(స్తనాలు) కూడ ఉన్నాయండీ?
ఉ ఔను, ఆ జలంలో తిరుగుచున్న చక్రవాకపక్షులజంట.

ఇలా, అసూయతో అనుమానం పడిన, ఆ అంబకు (పార్వతికి) నర్మ గర్భంగా, ఆలంకారిక సంప్రదాయాను సారంగా, వక్రోక్తులతో సమాధానమిచ్చి, సరిపెట్టిన ఆగంగాధరుడు ( ఈశ్వరుడు) మనలనందరిని రక్షించుగాక!

**వి. కవులకు కొన్ని సమయాలు ( ఆచారాలు, సంప్రదాయాలు) ఉన్నాయి. వానిలో కొన్నిలోక విరుద్ధంగా కూడ ఉండవచ్చును. అవి, ఇక్కడ అభేదాధ్యవసాయంతో అభివర్ణింపబడినవని గమనించాలి.**

**15. శ్లో. ధన్యా కేయం స్థితా తే శిరసి? శశికలా, కిం ను నా మైత దస్యాః**
**నామై వాస్యా స్తదేతత్, పరిచిత మపి తే విస్మృతం కస్య హేతోః?**
**నారీం పృచ్ఛామి నేన్దుం? కథయ తు విజయా, న ప్రమాణం యదీన్దుః**
**దేవ్యాః నిహ్నోతు మిచ్ఛో :- ఇతి సురసరితం శాఠ్య మవ్యా ద్విభో ర్వః ॥**

సం. ఇది విశాఖదత్తుని ముద్రారాక్షసనాటకం యొక్క నాందిశ్లోకం, పార్వతీ పరమేశ్వర సంవాదరూపం. నాటకం మొదలగు రూపకాలకు మొదట చెప్పబడు ప్రార్థనారూపపద్యం "నాందీ" అనబడుతుంది.

శివుని జటాజూటమున విలీనమైయున్న గంగను గాంచి, ఈర్ష్యపడిన పార్వతి, శివునిట్లు ప్రశ్నిస్తోంది.
పార్వతి ప్రశ్న. 1. పరమప్రేయసి నగు నేను నీ (శంభుని) వామార్ధభాగం లో అర్ధాంగిగా నేను ఉండగా,) ప్రభూ! నా భర్తవగుమీ (శివుని)ఉత్తమాంగాన్ని (శిరస్సును) అధిష్ఠించియున్న, ధన్యురాలు ఎవరు? అని అసూయతో పార్వతి ఎత్తిపొడుపు ప్రశ్న?
శివుని ఉత్తరం. ( తన నెత్తినెక్కిన గంగను కప్పి పుచ్చాలను కొన్న శివుడు) శశికలా (చంద్రలేఖ) అని, శః స్త్రీలింగంతో, వ్యాజోక్తితో, ధ్వనింపజేస్తూ సమాధానమిచ్చినాడు.
పా. ప్ర. అయితే, ఈవిడ పేరేమిటి?
శివ. ఉ. దాని పేరూ అదే. నీకు తెలుసు గదా! ఎందుకని మరిచిపోయావు? ( శివుని మోసాన్ని గుర్తించిన పార్వతి) నాథా! నేనడిగేది ఆ చంద్రరేఖను గురించికాదు. మీ జటాజూటం తర్గతమైన, ఆ అపరిచిత యువతి (నారి) ని గురించండి;
ఉ. (నన్నడిగిన విజాతియ "ఇన్దు" ప్రధానకర్మకమైన ప్రత్యుత్తరం నీకు ప్రమాణంకాకపోతే, సజాతీయత

ననుసరించి, నీకు విశ్వాసపాత్రురాలైన నీ సఖి ఆ విజయనే అడుగుము.

ఇట్లు, వాక్చింతతో తన తలపైనున్న గంగాదేవిని కప్పిపుచ్చుటకు ప్రయత్నించిన ఆ పరమేశ్వరుని ఛలోక్తి మనలను రక్షించుగాక! అని కవిభావన.

వి.1. ఈ వక్రోక్తితో వక్ష్యమాణమగునాటకీయ వస్తువు వ్యంజితమైనది. ఈ నాందీ పద్యంలో వ్యంజింపబడిన స్వారస్యాతిశయాలెన్నో ఉన్నాయి. దయయుంచి రెండు,మూడింటిని అవధరింపుడి.

2. పరమప్రియను, అర్థాంగిని - అగు నే నుండగా, నా భర్త ఉత్త మాంగాన్ని, అధిష్ఠించటానికి, ఈమె ఎవతె?

3. "ధన్యా యోషిత్ ప్రలోభినీ" అనునిఘంటువచనాన్ని అనుసరించి, ప్రలోభన శీల యగు దానికి (గంగకు) నీ వెట్లు వశంవదుడవైనావు - అని ఈ "ధన్యా" శబ్దం అధన్యా అనే అర్థాన్ని కూడ వ్యక్తీకరిస్తోంది అనవచ్చు.

4. భర్తనెత్తినెక్కి పెత్తనం చేసేది పుణ్యస్త్రీ గాని, పతివ్రత గాని ఎలా ఔతుంది? అట్టి దానికి శివుడు ఎట్లా వశం వదుడైనాడు ? అను ఈర్ష్య కూడ వ్యక్తమౌతోంది.

5. నాంది శ్లోకంలో "చంద్ర నామం చెప్పాలి" అను శాసనాన్ని అనుసరించి, అమృత బీజము, ఆయుః ప్రదమువగు ఇన్దు శబ్దం, ఈ నాందీ శ్లోకంలో చెప్పబడిందని కూడ గ్రహింపమనవి....

5. వ్యా.వి. నేన్దుం = న+ ఇన్దుః, యదీన్దుః= యది+ ఇన్దుః - లుగా విడదీసుకోవాలి.

**16.శ్లో. అమ్బా కుప్యతి తాత! మూర్ధ్ని విధృతా గంగేయ ముత్సృజ్యతామ్**

**విద్వన్! షణ్ముఖ! కా గతి ర్మమ చిరం మూర్ధ్ని స్థితాయాః వద ।**

**కోపావేశవశా దశేషవదనైః ప్రత్యుత్తరం దత్తవాన్**

**అంభోధి, ర్జలధిః పయోధి, రుదధి ర్వారాంనిధి ర్వారిధిః ॥**

సం. కుమారస్వామికి, అతని తండ్రి శివునికి జరిగిన సంభాషణ.

కుమారుడు. ప్ర 1 నాన్నా (తాత!) అమ్మ కోప్పడుతోంది. నీతలనెక్కి పెత్తనం చేస్తున్న ఆగంగమ్మను వదిలించుకోరాదా?

శి. ఉ. ఒరే! ఆరుముఖాలుగల కుమారస్వామీ! (షణ్ముఖ!) నన్నే నమ్మి, ఇంత కాలంగా నా తలపై నున్న గంగమ్మను విడిచిపెట్టితే, ఇక దాని గతి ఏమౌతుందో, నీవు పండితుడవు గదా! కొంచెం ఆలోచించి, నీవే చెప్పు. - అనగా, ఇంతలో కోపం వచ్చిన ఆర్ముగం (షణ్ముఖుడు) తన అన్ని (6) ముఖాలతో, ఒక్కసారిగా, "అంభోధిః, జలధిః, పయోధిః, ఉదధిః, వారాంనిధిః, వారిధిః", (అను ఈ ఆరు పదాలకు సముద్ర మనియే అర్థం. అందుచేత) నదులకు భర్తయైన సముద్రుడు ఉండనే ఉన్నాడు గదా! అక్కడికే వెళ్లలుందిలే, కనుక, పరమేశా! గంగ విడుము - అని ఆరుముఖాలతో, ఒక్కసారిగా, గుహుండు ఉగ్రోదగ్రుడై హెచ్చరించాడని భావం.

వి. గంగా + ఇయం = గంగేయమ్.

**17.శ్లో. మాతః! తాతజటాసుకిం? సురసరిత్, కిం శేఖరే? చన్ద్రమాః,**

**కింభా(ఫా) లే? హుతభుక్, ఉరత్స్యురసికిం? నాగాధిపః, కిం టకటే?**

**కృత్తిః, కిం జఘన ద్వయాన్తరగతం య ద్దీర్ఘ మాలంబతే?**

**శ్రుత్వా పుత్రవచోzమ్బికా స్మితముఖీ లజ్జావతీ పాతు వః ॥**

సం కుమారస్వామికి పార్వతికి జరిగిన సంభాషణ

కుమారస్వామి ప్రశ్న 1. అమ్మా! నాన్నగారి జడలలో నున్నది ఏమిటది? అని అమాయిక ప్రశ్న

పార్వతి ఉ. అది దేవనది "గంగ" రా

ప్ర. 2. మరి, నెత్తిమీద కూడా ఉన్నదే? అదేమిటి? ఉ చంద్రుడు రా!

3. అయితే నొసటనున్న దేంటి? ఉ అగ్ని

4. బొమ్మున వ్రేలాడేది ఏమిటి? ఉ. పాప(పాముల)రేడు.

5. మొలమీద ఉన్న దేమిటి? ఉ అది ఏనుగుచర్మం రా!

6. మరి పిరుదులకు ముందు రెండుకాళ్ళసందున పొడుగ్గా వ్రేలాడుతోంది. అదేమిటి? - అను కుమారుని అమాయికపు మాటలకు చిరునవ్వు నవ్వి, సిగ్గుతో తల వంచుకొన్న పార్వతి మిమ్ము రక్షించుగాక!

**వి. శివుడు దిగంబరుడు. గుహుడు కుర్రవాడు. అవయవాలన్నీ స్పష్టంగా కన్పడు చుండగా, అమాయికుడగు కుమారుడు అడగటం, అంతతప్పుగా భావింపరాదు. కుర్ర తనం కుసుమించినదనుకోవాలి.**

**18.శ్లో. తాతం తత్తాత తాతం కథయ హర! కులేzలం కృతే సంప్రదానే**

**తచ్ఛ్రుత్వా చంద్రమౌళిః నతవదనకజో జాతలజ్జో బభూవ ।**

**బ్రహ్మావాదీ త్తదానీం శృణుత హరకులం వేద కంఠో్గ్రకంఠ**

**శ్రీ కంఠా శ్శీలకంఠః ప్రహసితవదనః పాతు వ శ్చంద్ర చూడః ॥**

సం. సంప్రదాన (కన్యాదాన) సమయంలో జరిగిన సంభాషణ.

ప్ర.1. (పెండ్లికి ముందు ప్రదాన(నిశ్చితార్థం)సమయంలో, అన్ని విషయాలు అనుభవంలోకి తెచ్చుకొంటారు. కనుక, అప్పుడు ఒక పెండ్లి పెద్ద శంకరునిట్లా అడిగాడట!)

శంకరా! మీనంశప్రసిద్ధులైన, మీ తండ్రిని (తాతం) మీతండ్రి తండ్రిని, తత్+తాత=(పితామహుని), అతని తండ్రిని అనగా మీ ముత్తాతను గూర్చి తెలుపుమని అడుగగా, శివుడు సమాధానం చెప్పలేక, సిగ్గుపడిన ముఖ పద్మం కలవాడై, తలదించుకొన్నాడట! అప్పుడు, ఆ ప్రశ్నలన్నిటికి బ్రహ్మదేవుడిలా సమాధానం చెప్పినాడట. పెద్దలారా! ఈ హరుని యొక్క కులాన్ని గూర్చి వినండి. శ్లోకంలోని "వేదకంఠోగ్రకంఠ శ్రీకంఠాత"ఇదొక సమస్తపదం (సమాసం) తండ్రి, తాత, ముత్తాతలు లేకపోవడం వలన, ఇతడు వేదకంఠా...ది వాచ్యుడు. ఆయా ఆత్మస్వరూపుడుగా ఉన్నాడని గ్రహించండి - అని బ్రహ్మ వివరించి చెప్పగా, అప్పుడు సంతోషంతో నవ్వుమొగం పెట్టిన చంద్రశేఖరుడు మిమ్ములను రక్షించుగాక!

**వి. తాతం=తండ్రిని, (సంస్కృతంలో, తాత అనగా తండ్రి. తెలుగులో వలె తండ్రి లేక తల్లి తండ్రి కాదు). తత్-తాత తాతం= ఆ తండ్రి తండ్రి= పితా లేక మాతా మహుడు, ఆ పితామహుని తండ్రి ప్రపితామహుడు (ముత్తాత) అని తెలియవలెను.**

**19.శ్లో. హే హేరమ్మ!? కి మంబ! రోదిషి కథం? కర్ణౌ లురత్యగ్నిభూః**

**కిం తే స్కన్ద! విచేష్టితం? మమ పురా సంఖ్యా కృతా చక్షుషామ్ ।**

**నైతత్ తే  ప్యుచితం గజాస్య! చరితం, నాసాం మమీతేzమ్మ! మే.**

**తా వేవం సహసా విలోక్య, హసితవ్య గ్రా శివా పాతు వః ॥**

సం. పార్వతికి, ఆమె తనయులకు జరిగిన సంభాషణ

పార్వతి ప్రశ్న1. ఓ వినాయకా! (హేరంబా!) వినాయకుని ఉత్తరం - ఏమిటమ్మా!

2 ఏమిస్తున్నావెందుకురా? ఉ. నా (ఏనుగు) చెవులను, ఈ కుమారస్వామి (అగ్ని భూ) గిర, బా ఫొట్టుమన్నాడమ్మా!

3 ఓరీ కుమారా! ఏమిటి వెతుకుతున్నావు? ఉ. వాడేనమ్మా ముందుగా నా కళ్ళన్నీ లెక్కిస్తున్నాడు.

4 గజవదనా! ఈ నడక నీకు మాత్రం తగియున్నదంటావా? ఉ. వాడు నా ముక్కు (నాసాం) కూడ కొలుస్తున్నాడమ్మా? - అని, ఇట్లు కొట్లాడుకొనుచున్న గణేశ- కుమారుల సంభాషణను హఠాత్తుగా విని, నవ్వుకొన్న పార్వతీదేవి, మమ్ము రక్షించుగాక!

వ్యా.వి.1. అరతి+అగ్నిభూః=అ రత్యగ్నిభూః, 2.న+ ఏతత్+తే+అపి+ ఉచితం=నైతత్తేzప్యుచితం. 3. మిమీతే+ అమ్మ! = మీమీతేమ్మ! 4. తావేవం= తౌ+ ఏవమ్,

**౨౦.శ్లో  స్వేద స్తే కథ మీ దృశః? ప్రియతమే!, త్వన్నేత్రవహ్నే ర్విభో!**

**కస్మా ద్వేపి త మేత దిందు వదనే? భోగీంద్రభీతే ర్మమ।**

**రోమాంచః కథ మేష దేవి!? భగవద్గంగాంభసాం శీకరైః**

**ఇత్థం భర్తరి భావగోపన పరా, గౌరీ చిరం పాతు వః ॥**

సం. పరమేశ్వర పార్వతీ సంవాదం.

(శృంగారభావంతో సింగారించియున్న పార్వతిని గూర్చి)

శివుని ప్రశ్న 1 ప్రాణప్రియా! ఏమిటీ? చెమట! నీకింతగా పట్టింది?

పార్వతి. ఉ. ప్రభూ! నీ మూడవ నిప్పు కంటి వేడిచే ( ఇంత చెమట పట్టింది)

2. ఓ చంద్రముఖీ! నీశరీరం కంపిస్తోంది ఎందువలన?

ఉ. నీవు ధరించిన పాపరేడు (పాములరాజు) భయంతో (వణుకుతోంది).

3. దేవీ! ఏమిటీ రోమహర్షం (గగుర్పాటు)?

ఉ. నీ తలపై నున్న గంగా భవాని యొక్క, నీటి తుంపరలు పడుటచే

- ఇట్లు, తనకు కలిగిన శృంగార హావభావాది విలాసాలను సూటిగా చెల్పక, అన్యాపదేశంగా అపలపించి, మరుగుపరచిన పార్వతి, చిరకాలం, మనలను రక్షించుగాక!

ఇంత వరకు హరహరాది- దేవుల దప్పొడుపులను తెలుసుకొన్నాము. . ఇక, వార దేవరుల దప్పరకాలలోని, కొన్ని దేవరహస్యాలను కూడ, తెరిపారచూడండి.

## ఇక, లక్ష్మీ పార్వతుల సంవాదం.

**౨౧.శ్లో.  భిక్షార్థీ స క్వ యాతః? సుతను! బలిమఖే, తాండవం క్వాద్య భద్రే!**

**మన్యే బృందావనాన్తే, క్వ ను స మృగశిశుః? నైవ జానే వరాహమ్ ।**

**బాలే ! కచ్చి న్న దృష్టో జరఠవృషపతిః? గోప ఏ వాస్య వేత్తా**

**లీలాసంలాప ఇత్థం జలనిధి హిమవ త్కన్యయోః త్రాయతాం వః ||**

సం. లక్ష్మీ పార్వతుల సంభాషణము.

**లక్ష్మి**ప్రశ్న - 1 అందమైన శరీరం గల ఓ పార్వతీ! ఆ అడుక్కు-తినే బిచ్చగాడు (నీమగడు) ఎక్క-డ? **ఉన్నా**డు?

పార్వతి ప్రత్యుత్తరం - తన్వీ! బలిచక్రవర్తి యజ్ఞశాలకు (నీభర్తవామన రూపంలో మూడడుగులు అడుక్కో-టానికి వెళ్లినట్లుగానే), వెళ్లి ఉంటాడు.

2. భద్రే! (నీభర్త) తాండవ నాట్యం ఎక్క-డ చేస్తున్నాడు?

ఉ. బహుశః, బృందావన ప్రాంతంలో (బ్రందావనిలో కృష్ణలీలలు ప్రసిద్ధాలు).

3. ఆనందివాహను( ఎద్దునెక్కే-డివాడు)డెక్క-డ? ఉ. ఆ వరాహం (పంది) సంగతి నాకేం తెలుసు?

4. అమ్మాయి! ఆముసలి ఎద్దు(నంది)నెక్కే-వాడు ఎక్క-డన్నా కన్పడ్డాడా?

ఉ. ఏమో! ఆ సంగతి ఆ గొడ్లకాపరి (గోపాలుడు) కే తెలియాలి, వానినే అడుగు.

- ఇలా లక్ష్మీపార్వతు లిరువురూ, విలాసంగా, శ్లేషతో, వ్యంగ్యంగా, వక్రోక్తులతో, ఒకరి నొకరు ఎత్తిపొడుచుకొంటూ సంభాషిస్తున్నవారు మనలను రక్షింతురుగాక!

**వి. 1. పద్యంలోని "భిక్షార్థీ" మొ. పదాలను మార్చి, వాని పర్యాయపదాలను వాడినా, అర్థంలో మార్పురాదు గనుక, ఇది అర్థశ్లేషమూలక వక్రోక్తికి ఉదా. అగుచున్నది.**

**2. శబ్ద పరివృత్తిని (మార్పును) సహింపనిచో, అది శబ్దశ్లేషమూలకమౌంతుంది.**

**3. ''సుతను '' పదాలు పాదం మధ్యలో నుండుట వలన దేహళీదత్తదీపన్యాయం (గడపమధ్యలో నున్న దీపం ఇరువైపులకు కాంతి నిచ్చినట్లు) గా, పూర్వపరముల రెండింటికి అన్వయింపవచ్చును.**

**4. భిక్షుః క్వాస్తి బలేర్మఖే... అనే పద్యంలోని సంవాదం దీనితోనే గూఢార్థం అగుటచే, దానిని మరల వ్రాయలేదని మనవి.**

**22.-శ్లో. హే గంగా ధరపత్ని! చక్రివధు! కిం, కుత్రా స్య సా నర్తకః?,**
**మన్యే వృన్దారణ్యభువి, క్వ సర్పకుతుకీ?, స్యాత్ కాళియస్య హ్రదే, ।**
**భిక్షుః కుత్ర గతోఽస్తి? యజ్ఞసదనే, క్వా సావిషాదీ, బకి**
**క్రోడే స్యా, దితి పద్మజాం విజయినో వాగ్భంగయః పాన్తు వః ||**

సం. లక్ష్మీ పార్వతుల సంవాదము.

లక్ష్మిప్రశ్న 1. ఓపార్వతీ! (గంగాధర పత్నీ! 1.గంగను ధరించిన శివుని భార్య, 2. కావడితో నీళ్ళు మా సడువానీ పత్నీ - అన ఎత్తిపొడుపు కూడ వ్యంగ్యము.)

పార్వతి ఉ. ఏమిటి లక్ష్మీ! (చక్రివధుః = 1 సుదర్శన చక్రధారియగు విష్ణుని భార్య, లేక కుండలు చేయునపుడు చక్రాన్ని తిప్పు, కుమ్మరివాని భార్య అని తిరిగి ఎత్తిపొడుపు).

ప్ర.2. ఈ ఆటకాడు (నటుడు) ఎక్క-డ? ఉ. బృందావనంలో డాన్సుచేస్తూ ఉంటాడు.

3. పాములంటే స్పందించే నీ మగడు ఎక్క-డ?

ఉ. సర్పరాజగు కాళింగుని మడుగులో ఉండవచ్చు.

4 అడుక్కు తినే ఆ సన్యాసి ఎక్కడకు వెళ్లాడు?

ఉ. బహుశ, బలియజ్ఞశాలకు అడుక్కోటానికి వెళ్లి ఉంటాడు.

5 ఆ ఏడ్పుగొట్టువాడు ( విషాదీ = 1 విషమును మ్రింగినవాడు, విషాదం ( ఏడుపు) తో ఉండేవాడు.) ఎక్కడ ఉన్నాడే?

ఉ. విషక్షీరము నిచ్చిన పూతన ఒళ్లో దాగి ఉండి ఉంటాడు.

అని లక్ష్మిని (పద్మ జాం) నోరుమూయించి, విజయం సాధించిన పార్వతి యొక్క సోల్లుంఠన వచనములు ( ఎత్తిపొడుపుమాటలు,) మిమ్ము రక్షించుగాక!

**23.శ్లో. లోలే! బ్రూహి క పాలి కామిని!, పితా క స్తే? పతిః పాథసాం.**
**కః ప్రత్యేతి జలా దపత్యజననం? ప్రత్యేతి యః ప్రస్తరాత్, ।**
**ఇత్థం పర్వత సింధురాజ సుతయోః ఆకర్ణ్య వాక్చాతురీం**
**సంస్మేరస్య హరేః, హరస్య చ ముదో నిఘ్నంతు విఘ్నం తు వః ॥**

సం. పూర్వం, లక్ష్మి ఎన్నోసార్లు ఎత్తిపొడవగా, నేను మాత్రం తక్కువ తిన్నానా? అంటూ, ఈసారి, పార్వతి ఆ లక్ష్మిని ఇలా ఎత్తిపొడుస్తోంది

పార్వతి ప్రశ్న 1. ఓ చపలచిత్తురాలా! ఉ. పుర్రెలు ధరించిన వాని పెళ్ళామా! ఏమిటో చెప్పు.

2 నీ తండ్రి ఎవరు? ఉ. జలాధిపతియైన సముద్రుడు

3. (సముద్రపు) నీటిలో నుండి పిల్లలు పుట్టారంటే ఎవరు నమ్ముతారు?

ఉ. నీవు పర్వతరాజుకు పుట్టిన సంగతి నమ్మినట్లే, నేను సముద్రానికి పుట్టానని నమ్ము.

- ఇట్లు, తమ ఎదుటనే, చమత్కారాలను ప్రదర్శిస్తూ చేసుకొన్న దెప్పిపొడుపులను విని, బొప్పికట్టిన, హరిహరుల (విష్ణు- శివుల) ఆనందములు (ముదః) మన విఘ్నములను పోగొట్టుగాక!

వి. బ్రూహి అనే పదం ఆరెండు ప్రశ్నలకు మధ్యలోనుండుటచే, దేహళీ దత్త దీపన్యాయం (గడపలోని దీపంవలె) తో,పై రెండు ప్రశ్నలకు అన్వయిస్తుంది.

**24.శ్లో కాళింది! బ్రూహి కుంభోద్భవ! జలధి రహం, నామ గృహ్ణాసి కస్మాత్?**
**శత్రో ర్మే? నర్మదాzహం త్వ మపి కథ మహో మత్సపత్న్యా శ్చ నామ ।**
**మాలిన్యం బ్రూహి కింతే? ప్రవిరల విగలత్ కజ్జలై ర్మాలవీనాం**
**నేత్రాంభోభిః, కిమాసాం సమజని? కుపితః గుర్జరాజా మహీశః ॥**

సం . నర్మదా సముద్రుల సంవాదం.

నర్మదానదని చూచిన సముద్రుని ప్రశ్న 1. యమునానది!. దీనికి నర్మద ఉ. కుండలో పుట్టిన అగస్త్యుడా! (సముద్రుడా) చెప్పు.

అగస్త్యుడంటావేమిటి?

2.నేను సముద్రుడనే! నీవుమాత్రం నా శత్రువు అగస్త్యుని పేరు చెప్పి, బాధింపలేదా?

3.నేను "నర్మద"నైతే, నీవుమాత్రం నాసవతియగు "యమున" పేరు చెప్పలేదా?

4.అయితే, మాలిన్యం (నల్లదనం) మురికి, నీరు ఎక్కడ నుండి వచ్చింది?

ఉ. ఎడ తెగకుండా జాలువారుతున్న, మాలవ దేశ స్త్రీల యొక్క కన్నీటితో కలియుట వలన (నానీరు కూడ నల్లబడినది).

5. మాలవ దేశీయులకు ఏమి జరిగింది?

ఉ. గుర్జరదేశ ప్రభువు కోపగించినాడు.

వి. 1.గుర్జర దేశ ప్రభువుతో పోరాటం వలన, మాలవదేశీయులెందరోమరణింపగా, వారి భార్యలు అవినాభావంగా ఏడ్చుటవలన,వారి నల్లని కాటుక కన్నీరు నాతో కలిసి ప్రవహించి, వచ్చినదని భావం.

2. గుర్జర ప్రభువు కోపగించాడనటం వలన, అతనిచే చంపబడిన మాలవ దేశీయుల మరణం, వారి భార్యల రోదనలు, వారి కన్నీటి కాల్వలు మొ॥నవి. వాచ్యంగా చెప్పక, వ్యంగ్యంగా ఆగుర్జర మహారాజ ప్రశంస జరిగినట్లయినది. శ్లోకంలో "కి మాసాం సుజని" = మాలవ స్త్రీల రోదనకు కారణమేమి? ఒక్కడ, వారి ప్రియులు చనిపోయినారనే సంగతి వాచ్యంగా చెప్పబడక, "కుపితః కుంతల క్షోణిపాలః" (పాఠాంతరం)= కుంతల మహారాజు కోపగించినాడు- అనేది కారణంగా చెప్పాడు. కనుక, ఇది కారణ నిబంధనా అను అప్రస్తుతాలంకార భేదానికి ఉదాహరణ మౌతుందని కూడ, అప్పయ్యదీక్షితుల అభిప్రాయం. మాలవదేశం జయింపబడిందా? అని అడిగినపుడు మాలవాధీశ మరణానంతరం జరిగిన.... రేః నర్మదా సాగర సంభాషణ రూప ప్రశ్నోత్తరరూప కార్యం కూడ చెప్పబడినదౌతుంది. ఇంకా శబ్దపరిష్కృత్తిని సహింపదు గనుక, కార్యనిబంధనా అను శాబ్దీ అప్రస్తుత ప్రశంసాభేదంగా కూడ అవుతుందని తెలియదగినది. ఇంకా సర్వవేద సారమగు "భగవద్గీత" లోని శ్రీకృష్ణార్జునసంవాదాలు రెండింటిని సావధానంగా సంభావించండి

**25. (1) అర్జున ఉవాచ:-**

**శ్లో. స్థిత ప్రజ్ఞస్య కా భాషా? సమాధి స్థస్య కేశవ !?**

**స్థితధీః కిం ప్రభాషేత? కి మాసీత? వ్రజేత కిమ్? భ.గీత. అ. 2 - శ్లో 54.**

అర్జును డిట్లు ప్రశ్నించుచున్నాడు హే (ఓ)కేశవ! ఆత్మస్వరూపంలో సమాధిని సంలగ్నం నిశ్చలబుద్ధిలో నుండు స్థిత ప్రజ్ఞుని యొక్క లక్షణ మెట్టిది? అట్టి స్థిరబద్ధిగల పురుషుడె మాట్లాడు ను? ఎలా ఉంటాడు? ఎలా నడుచుకొంటాడు? - ఈ విషయాలు కొంచెం వివర చెప్పు.

శ్రీ భగవానువాచ :- శ్రీ కృష్ణుడిట్లు అర్జునుని ప్రశ్నకు జవాబిచ్చుచున్నాడు.

**26 శ్లో. ప్రజహాతి యదా కామాన్, సర్వాన్ పార్థ! మనోగతాన్ ।**

**ఆత్మ న్యే వాత్మనా తుష్టః "స్థిత ప్రజ్ఞ" స్తదోచ్యతే॥ భ.గీ. అ. 2 శ్లో .55**

అర్జునా! మానవుడు తనమనస్సులో పుట్టిన కోరికల నన్నింటిని విడిచిపెట్టి, తన ఆత్మ తానే ఎప్పుడు సంతోషమును పొందుచున్నాడో, అప్పుడే అతడు ఈ చెప్పిన లక్షణాలతో నిండిన వాడై స్థిత ప్రజ్ఞుడు గా చెప్పబడతాడు సుమా!

**(2) అర్జున ఉవాచ :- అర్జును డిట్లు ప్రశ్నిస్తున్నాడు**

**27. శ్లో. సన్న్యాసస్య మహాబాహో! తత్త్వ మిచ్ఛామి వేదితుమ్? ।**

**త్యాగస్య చ హృషీకేశ! పృథక్ కేశి నిషూదన!? ॥భ.గీత. అ. 18॥**

హే మహాబాహూ! హృషీకేశ! కేశినీ షూదన! ( ఈ పదాలు కృష్ణునికి విశేషణపదాలు, సంబోధనలు) కృష్ణా! నేను సన్న్యాసము యొక్కయు, త్యాగము యొక్కయు, సత్యస్వరూపము(తత్త్వం) ను తెలుసుకొనగోరుచున్నాను. కనుక, దయుంచి, వాని భేదాన్ని , విడివిడిగా వివరించి చెప్పుము.

(శ్రీ) భగవాను వాచ: భగవత్స్వరూపుడగు కృష్ణుడిట్లు ప్రత్యుత్తరించెను.

**28. శ్లో. కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయోవిదుః ।**

**సర్వ కర్మఫలత్యాగం ప్రాహుః త్యాగం విచక్షణాః ॥ భ.గీ.త. అ 8-శ్లో॥**

అర్జునా! కోర్కెలతో కూడిన కర్మలను విడిచిపెట్టుటయే సన్న్యాస మనియు, అట్లే, అనుస్తకర్మలు చేయగా లభించిన ఫలమును పరిత్యజించుటయే ''త్యాగ'' మనియు, పండితులు చెప్పుచున్నారు.

వి. ప్రశ్నోత్తరాలు రెండూ, ఒకే శ్లోకంలో ఉండక, ప్రశ్న ఒక శ్లోకంలో, ఉత్తరం మరొక శ్లోకంలో ఉన్నది.

## కవి పండిత భోజరాజసంవాదాలు.

**29.శ్లో స్వర్గాత్ గోపాల! కుత్ర వ్రజసి? సురమునే! భూతలే కామధేనోః**

**వత్సస్యానేతుకామః తృణచయమధునా, ముగ్ధ! దుగ్ధం న తస్యాః ।**

**శ్రుత్వా శ్రీ భోజరాజ ప్రచురవితరణం వ్రీడశుష్కస్తనీ సా,**

**వ్యర్థో హి,స్యాత్ ప్రయాసః, త దపి తదరిభి శ్చర్వితం సర్వ ముర్వ్యామ్ ॥**

సం: నారద గోపాలుర సంవాదము.

నారద ప్రశ్న 1. ఓయీ! గోప కుమార! స్వర్గం నుండి ఎక్కడికయ్యా వెళ్ళుచున్నావు?

గోపాలుని ఉత్తరం: దేవర్షీ ! కామధేనువుకు దూడకు గడ్డి తెచ్చుటకై భూలోకానికి వెళ్ళుచున్నాను.

2. మూర్ఖుడా! ఆ కామధేనువు అసలు పాలివ్వడంలేదయ్యా! అంతేకాక, అది ఆ భోజమహారాజు యొక్క ప్రస్తుత దాన గుణాన్ని విని, సిగ్గుచెందడంతో, దానిపాలన్నీ ఎండిపోయి, ఎట్టిపోయిందయ్యా, కనుక, నీవు ప్రయాసపడి వెళ్లడం అనవసరం సుమా!

3. ఎక్కడన్నా వెదికితే ఏ కొంచెమైనా పచ్చగడ్డి దొరక్కపోతుందా? అని,

ఉ ఎక్కడైనా, ఏ కొంచెమైనా, పచ్చగడ్డి మిగిలి ఉంటే, తిండి లేక మలనుల నూడుచున్న ఆ భోజుని శత్రువులు, దాన్ని కూడ, మేసివేశారు సుమా.

కనుక, ఏకొంచెం గడ్డి కూడభూలోకంలో దొరకదు. వ్యర్థంగా దివినుండి భువికి దిగి, దిగులుపడవద్దు. అని నారదుని సలహా,

వి. ఈ సంవాదం అతిశయోక్తిగా ఉన్నా, ఈ భోజమహారాజు యొక్క యశశ్చంద్రికా విస్తార మట్టిది.

**30. శ్లో. భిక్షో! మాంస నిషేవణం కి ముచితం? కిం తేన మద్యం వినా,**

**మద్యం చాపి తవప్రియం? ప్రియ మహో వారాంగనాభి స్సహ. ।**

**వేశ్యాద్రవ్యరుచిః! కుత స్తవ ధనం? ద్యూతేన చౌర్యేణ వా.**

**చౌర్య, ద్యూత పరిగ్రహోఽపి భవతః? భ్ర(వ)ష్టస్య కా వా గతిః ॥**

సం ఒక యాచకునితో సంభాషణ

ప్ర 1 ఓయీ! బిచ్చగాడా! నీవు మాంసరుచికి మరిగటం మంచిదనంటావా?

ఉ దానితో పాటు మత్తుపానీయం కూడ లేకపోతే, ఒక్క మాంసంతో పని ఔతుందా?

ప్ర.2. అయ్యో! మత్తుపదార్థం కూడ నీకిష్టమా?

ప్ర. దానితో పాటు వేశ్యాసంగమం కూడ ఇష్టమే.

3 అయితే, భోగం వారి కివ్వటానికి నీకు డబ్బెక్కడిదయ్యా?

ఉ జూదమాడిగాని, దొంగతనం చేసిగాని సంపాదించి ఇస్తానండీ

4 ఇవన్నీ చాలక, దొంగతనం, జూదం కూడ ఆడతావా ?

ఉ భ్రష్టుడై - ఇలా క్రిందికి దిగజారిపోయిన వానికి మరొక గతి ఏమున్నదండీ!

**వి. భ్రష్టుడు ఎంతకైనా దిగజారి, ఎన్ని నీచకార్యాలైనా చేస్తాడనిభావం.**

**31. శ్లో. సర్వస్య ద్వే? సుమతికుమతీ,సంపదాపత్తి హేతూ**

**వృద్ధో యూనా? సహ పరిచయాత్ త్యజ్యతే కామినీభి: ।**

**ఏకోగోత్రే? ప్రచలతి పుమాన యః కుటుంబం బిభర్తి**

**స్త్రీ పుంవచ్ఛ? ప్రభవతి గృహే తద్ధి గేహం వినష్టమ్ ॥**

సం బ్రహ్మరాక్షసునకు కాళిదాసునకు జరిగిన సంవాదం.

భోజమహారాజొక సుందర సభా భవన నిర్మాణాన్ని చేయిస్తున్నాడు అది పూర్తికాక మునుపే, దానిలో నొక బ్రహ్మరాక్షసుడు ప్రవేశించి, రాత్రులందు అక్కడ తల దాచుకొనుచుండువారికి కొన్ని ప్రశ్నలందించి, సమాధానం చెప్పనందున, వారిని నిర్దాక్షిణ్యంగా భక్షిస్తున్నాడు. రాజెన్నో మంత్ర, తంత్రాలతో మాన్పింప ప్రయత్నించాడుగాని, సాధ్యం కావటంలేదు. చేయునదిలేక, చివరకి తన్నివారణకై కాళిదాసు నర్థించగ, అతడు ఆ రాత్రియే వెళ్ళి, సభాగృహమున నుండగా, యథ ప్రకారం బ్రహ్మరాక్షసుడు వచ్చి, యామానికి (జాము) ఒక ప్రశ్న చొప్పున వ్యాకరణశాస్త్ర సంబద్ధమైన నాలుగు ప్రశ్నలీయగా, కాళిదాసు సద్యః స్ఫూర్తితో వెంటనే సమాధానమీయడంతో, సంతసించిన బ్రహ్మరాక్షసుడా కవికి కొన్ని వరాలిచ్చి సభాగృహమును వదలి తరలిపోయాడట! ఆ వివరాలేవనగా,

బ్రహ్మరాక్షసుని 1వ ప్రశ్న. అందరికీ రెండు ఉంటాయి. అవి ఏవి?

కాళిదాసు సమాధానం - సర్వులకు మంచిబుద్ధి, 2 చెడుబుద్ధి అనేవి రెండూ ఉంటూ, అవి సంపదలకు, ఆపదలకు, కూడ ఆలవాలాలై ఉంటాయి.

2. వృద్ధుడు యువకునితో - అను రెండవ ప్రశ్న

ఉ కాముకులగు స్త్రీలు యువకునితో (యూనా) ప్రత్యేక సంబంధమేర్పడినంతనే, ముసలివానిని ముందుకు లాగి, వదిలి పెట్టి వెళ్ళి పోతూ ఉంటారు

3. ఒకడు గోత్రమునందు - అనునది ఆ వ్యాకరణ శాస్త్ర సంబద్ధ ప్రశ్నలలో మూడవది.

ఉ కుటుంబ భారమును భరించు పురుషుడొక్కడే, ఆ వంశమును చక్కగా ముందుకు నడుపుకొని పోవుచుండును.

4. స్త్రీ పురుషుని వలె - అనునది ఆఖరి నాల్గవప్రశ్న

వి. అనగా - ఆడుది ఏ ఇంటిలో పురుషుని వలె, మించి అధికారం చలాయిస్తుందో, ఆ యిల్లు పూర్తిగా నాశనమై పోతుందని భావం.

**వి. మొత్తం మీద, ఏ రాజకీయాధికారుల ప్రభావంగాని, మంత్రతంత్ర ప్రభావం గాని పనిచేయని చోట, కాళిదాసు యొక్క ప్రతిభా ప్రభావం సద్యఃస్ఫూర్తి, చక్కగా, సమంజసంగా పనిచేసి, సభాగృహ ప్రవేశానికి సదవకాశాన్ని సమకూర్చినదన్నమాట.**

2 సాహిత్య ప్రతిభా ప్రాభవాల ప్రభావం అట్టిది!

**32. ఆపదర్థే ధనం రక్షేత్, శ్రీమతా మాపదః కుతః?**
**సా చే దపగతా లక్ష్మీః? సంచితార్థోzపి నశ్యతి ॥**

సం. భోజమహారాజు కవి పండితులకు అక్షర లక్షలు దానం చేయుండంతో, ఖజానా కాస్త ఖాళీ అయిపోయిందట. ఆ సంగతి స్వయంగా చెప్పలేని మంత్రి, రాజుగారి గది గోడపై, ఒక్కొక్క పద్యపాదంతో ప్రశ్నలు వ్రాయగా, దానికి రాజ సమాధానాలు. ఈ సంవాదం రహస్యంగా ముఖాముఖీగా జరిగినది గాక, గోడమీద వ్రాతలతో గోప్యంగా జరిగిపోయింది.

మంత్రివ్రాత ప్రశ్న 1 ఆపదలు రావచ్చు గనుక, అవి వచ్చినప్పుడు ఆదుకోవడానికి ధనాన్ని ముందుగా, జాగ్రత్తగా దాచి, రక్షించుకోవాలి

భోజుని వ్రాతతో సమాధానం : శ్రీమంతులగు అదృష్టవంతులకు అసలు ఆపదలు ఎక్కడనుండి వస్తాయి? రావు భావం.

2 లక్ష్మీ చపలచిత్త ఎల్లకాలం సంపదలన్నీ ఒకే చోట స్థిరంగా ఉంటాయని, నమ్మకం ఏముంది? దురదృష్టవశాత్తు దూరంగా పోవచ్చు అప్పుడు, అలా దాచుకొన్న ధనమే రక్షిస్తుంది అని మంత్రి 3 వపాదంతో తెల్పగా)

రాజు వి. అంత దురదృష్టమే, దాకి ముంచుకు వస్తే, అంతకుముందు సంపాదించి, దాచి, కూడ బెట్టిన ధనం కూడ, ఒక్కసారిగా అదృశ్యం కావచ్చు (అని భోజుని సమాధానం)

**వి. 1. భోజుని ధర్మబుద్ధి విద్యాభిమానం అట్టిది. రేపు అను దానిని ఆలోచింపక, ఒక చేతితో చేసినదానం రెండవ చేతికి కూడ తెలియకుండా, బీదసాదలకు, కవి పండితులకు దానం చేసి, యశః కాయుడై నేటికి నిల్చియున్నాడు.**

వి. 2. దాన మహిమ అంత గొప్పదని భావం.

**33. శ్లో. భోజనం దేహి రాజేంద్ర! ఘృతసూప సమన్వితమ్ ।**
**మాహిషం చ నరచ్చన్ద్ర చన్ద్రికా ధవలం దధి ॥**

సం. కవి పండిత కల్పతరువని విని, భోజుని దగ్గరకు కాశ్మీర ఛాందస పండితులు నల్గురు వచ్చి, అతడు కవి పండితులకు తప్ప, ఛాందసుల కేమీ, ఈయడని తెలుసుకొని, కాళికాలయంలో కూర్చొని, కవిత్వం వ్రాయప్రారంభించారట. ఎంతో మొత్తుకోగా, ఒకరికొకపాదం, మరొకరికి మరొకపాదం స్ఫురించగా, తక్కినవారికేమి తోచలేదు. అంత ఆ కాళికాలయానికి వచ్చిన, కాళిదాసుని ప్రార్థించి, మిగిలిన

రెండుపాదాలు పూరింపజేసికొని, వానిని కంఠస్థం చేసుకొని, వెళ్లి, రాజుగారి వద్ద చదివారట. ఒకడు 1వ పాదంతో - రాజా! భోజనం పెట్టించు అనగా, మరొకడు రెండవపాదంతో, ఆభోజనంలోనికి పప్పు, నెయ్యి కూడ ఉండాలని, తర్వాత మిగిలిన రెండు పాదాలను 3,4వ వారు కూడ చదివి పూర్తిచేశారట.

రాజు వారి ముఖ కవళికలు బట్టి, చివరి రెండు పాదాలు కాళిదాస మహాకవివి అని, ఇట్టే తెలుసుకొని ఆ చివరి రెండుపాదాలకే ఈ ధనం దానం చేస్తున్నాను. ఈ ధనం తీసుకుని, ఇక మొదటి పాదాలవంటి మొద్దు కవిత్వాన్ని ఎప్పుడూ చెప్పకూడదని కట్టడి చేసి, వారిని పంపించాడట!

3,4 పాదాల అర్థం- రాజా! ఆ భోజనం లోకి శరత్కాల చంద్రుని వెన్నెల వలె మిక్కిలి తెల్లగా నున్న గడ్డకట్టిన ( ముర్రా జాతి) గేదె పెరుగును కూడ సమకూర్చండి

షరా :- బ్రాహ్మణో భోజన ప్రియః (బ్రాహ్మణునికి భోజన మంటే ఎక్కడ లేని ప్రేమకదా!)కాని, అందరూ, అలా ఉండకపోవచ్చు. అందుచేత, మరొక బ్రాహ్మణపండితుడు, దాని పదచ్ఛేదం నూర్చి, భో= ఓ పెద్దమనిషీ ( దాని అసలు అర్థం ఇది) బ్రాహ్మణః - జనప్రియః = బాపనయ్య - లోకులకు అనుకూలము ప్రియమునైన సంభాషణ చేస్తాడు. అందుకనే జనులకు ఇష్టుడౌతాడు. అని ఇదే అసలైన భావ మని చెప్పి, తన పాండిత్యంతో వ్యక్తీకరించాడట.

**34. శ్లో. చేతో హరా యువతయః సుహృదోఽను కూలాః**

**సద్బాంధవాః ప్రణయగర్భగిర శ్చ భృత్యాః ।**

**గర్జన్తి దంతి నివహా స్తరలా స్తురంగాః**

**సంమీలనే నయనయో ర్న హి కించి దస్తి ॥**

సం. భోజరాజు నిద్రించినాడు గదా ! అని ఒక పండితచోరు డొకరాత్రి కోశ గృహంలో ప్రవేశించి, వజ్ర,వైదూర్య, మరకత, మాణిక్యాదుల నెన్నిటినో మూట గట్టుకొని పోబోవుచుండ, ఇంతలో, వాని మనసులో నొక భావం తళుక్కున మెరిసిందట!

అయ్యో! పూర్వజన్మలో ఎన్నో తప్పుడు పనులు చేయబట్టేకదా, ఈ జన్మలో చాలమంది, వికలాంగులు, కుష్ఠరోగులు, గ్రుడ్డి-కుంటి-వారు , దరిద్రులై బాధపడుచున్నారు. నేను కూడ, పూర్వ జన్మ పాపం వలననే, దరిద్రుడనైనాను. ఇంకా, ఈ జన్మలో కూడ తప్పులు చేసి, పాపం మూటకట్టుకొనవలసిందేనా? అంటూ విచారిస్తున్నాడట. ఇంతలో మేల్కాంచిన రాజు, తన సుఖసంపదలను, అష్టైశ్వర్యాల నాలోచనలకు తెచ్చుకొని, పై పద్యంలోని మూడు పాదాలను ఆశువుగా చదివి, నాల్గవ పాదం కోసం తడబడుచుండ, ఆ పండిత చోరుడు దానిని పూరింప, రాజు సంతసించి ఆపండిత చోరునికి కూడ, పసదన మిచ్చి పంపినాడట! భోజుని ఔదార్య, దాతృత్వాలట్టివి.

పద్య భావం - మనస్సునెంతగానో ఆకర్షించు మత్తకాశినులున్నారు. అనుకూలురగు మిత్రులు, మంచిబంధువులు, చెప్పినంతనే ప్రేమతో పనులు చేస్తూ, చాటూక్తులు పల్కే సేవకులున్నారు. ఏనుగులు, గుఱ్ఱాలు ఒకప్రక్క గర్జిస్తున్నాయి. ఇలా అష్టైశ్వర్యాలతో అన్ని సుఖాలను అనుభవిస్తున్నా- అవి కట్టెదుట కన్పడుతున్నా, కన్నుమూయగానే ఇవేవీ కంటికి కన్పడవు సుమా!.

వి. అనగా భౌతికములైన సుఖాలన్నీ క్షణభంగురాలని, శాశ్వతాలు కావనీ భావం.

35. శ్లో. పరిపతతి పయోనిధౌ పతంగః
సరసిరుహా ముదరేషు మత్త భృంగః ।
ఉపవన తరుకోటరే విహంగః
యువతి జనేషు శనై శ్శనై రనంగః ॥

సం. భోజమహారాజొక సంధ్యాసమయంలో సంతోషిస్తూ పైపద్యంలోని మొదటిపాదం, ఆశువుగా స్మరింపగా, ప్రక్కనున్న పండితులు, మిగతా పాదాలను, సమయ, సందర్భాలకనుకూలంగా సమన్వయించి, పూరించి, సంతోషపెట్టినారు

పద్యభావం - 1 సాయం సమయమున సూర్యుడు సముద్రములో పడి మునుగుచున్నాడు
2 మదించిన మధుపములు (తుమ్మెదలు) పద్మాలలో ప్రవేశించుచున్నవి. (బాణకవి పూరణ)
3. ఉద్యానవన, వృక్షాల తొర్రలలో పక్షులు దూరుచున్నవి. (మహేశ్వర కవి పూరణ)
4. యువతుల హృదయాలలో మన్మథుడు మెల్లమెల్లగా ప్రవేశిస్తున్నాడు సుమా! అని కాళిదాసకవి పూరణ.

**వి. 1. ఇదొక సంభాషణ కాని సంభాషణ. సంధ్యాసమయ మెట్లున్నది? అని, "సంవాద" రూపంలో ఒకరు ప్రశ్నింపకుండానే, కవులు తమంతటాముగా, అలవోకగా, ఆలపించి, పద్యపూరణ చేయడం చమత్కృతివిచిత్రం గా కన్పిస్తోంది కదా!**
**2. భోజప్రబంధంలోని, ఇట్టి మరికొన్ని శ్లోకాలను కూడ మన్నించండి.**

36. శ్లో. అరుణకిరణ జాలై రంత లిక్షే గతర్క్షే
చలతి శిశిరవాతే మన్ద మన్దం ప్రభాతే ।
యువతి జన కదమ్బే నాథ ముక్తోష్ఠబిమ్బే
చరమ గిరి నితమ్బే చంద్ర బింబం లలమ్బే ॥

సం. ఒకనాడు భోజదేవుడు, చంచచ్చంద్రకరానన్ద సంచోహ పరికందలమైన ప్రాతః కాలంలో షికారు చేసి, సభామంటపమును కరుదెంచి, "చరమగిరి నితమ్బే చన్ద్రబిమ్బంలలమ్బే" - అను సమస్యనిచ్చి, పూరింపుడని, కవీశ్వరులనర్థింప, భవభూతి మొదటిపాదాన్ని, దండికవి రెండవపాదాన్ని, మూడవ పాదాన్ని కాళిదాస మహాకవి పైవిధంగా పూరించారని భోజప్రబంధ - ఉవాచ

**వి. ఇక్కడ చారిత్రక కాలం కంటే, చమత్కారానికే ప్రాధాన్యమని గమనింపవలెను.**

**దాని భావ మేమనగా- 1. ప్రాతః కాలమున, ఎర్రని కిరణ సమూహము, సందడింప ఆకాశమునుండి నక్షత్రాలు (ఋక్షు) అదృశ్యాలైనవట.**
**2. ఆ ప్రభాతమున చల్లని పిల్లగాలులు మన్ద మన్దం గా వీవసాగినవట!**
**3. నాయకుల అధరచుంబనం నుండి యువతి సమూహం విడివడిందట !**
**4. అట్టిసమయమున అస్తా చల శిఖరమునుండి చంద్రబింబము వ్రేలాడు చుండెను- అని భోజుని సమస్య. (పూరింపబడినది)**

**వి.1. భోజుడిచ్చిన సంవాదాన్ని కవిత్రయం కమనీయంగా పూరించడం, సంతోషదాయకం.**
**2. ఇక్కడ, చారిత్రక కాలంకంటే, చమత్కార ప్రాధాన్యం ఎక్కువని గమనించాలి.**

3. వ్యా.వి. గత + ఋషే = గతర్షె

**37.శ్లో.అంకం కేఽపి శశంకిరే జలనిధే. పంకం పరే మేనిరే**

**సారంగం కతి చిచ్చ సంజగదిరే భూచ్చాయ మైచ్చన్ పరే ।**

**ఇన్దౌ యద్దళితేన్ద్ర నీలశకల న్యాసం దరీ దృశ్యతే**

**త చ్ఛాంద్రం నిశి పీత మంధతమసం కుక్షిస్థ మాచక్ష్మహే ॥**

సం. ఒకనాడు భోజమహారాజు చంద్రుని మధ్యయందున్న, మచ్చను చూచి ప్రశ్నించి, ఈ విషయంలో మీ అభిప్రాయం చెప్పండి- అని కాళిదాసుతో సంభాషింపగా, అతడు ఉత్తరార్థాన్ని రమ్యంగా ప్రారంభించి, రామణీయక వైచిత్ర్యాన్నిట్లు వెల్లడించాడట

భావం :- చంద్రుని మధ్యలో నల్లగా నున్న దానిని చూచి, కొందరు మచ్చ అని చెప్పగా, మరి కొందరు, అది సముద్రములోని బురద - అని , లేదీ అని కూడా వివరింపగా, అలాకాదు, భూమి పరిభ్రమించే సమయంలో, చంద్రునిపై భూమినీడ పడి, నల్లగా కన్పడుతోంది సుమా! అని భోజుడు వివరింపగా, కాళిదాసు అలా కాదు, మరేమిటంటే- ఆచంద్రునిలో పొదిగబడిన నల్లని ఇంద్రనీలమణిఖండం మాదిరిగా కన్పడేది - పాపం ! చంద్రుడు రాత్రంతా ఎండి ఉన్న అంధకారాన్ని అంతా ఆహరింపగా, అదంతా, అతని పొట్టలో చేరి, నల్లగా కన్పడుతోంది - అనే తన అభిప్రాయాన్ని, చల్లగా వెల్లడించినాడట.

షరా . ఇంత వరకు కవిజన కల్ప వృక్షమగు భోజుని సభాపండితుల సంవాదాలను కొన్ని గమనించాము

సత్కావియై, కవిపండితులకు లక్షలక్షలు దానంచేస్తూ సరస్వతీకంఠాభరణ మను సాహిత్యశాస్త్ర గ్రంథాన్ని వ్రాసిన, ఆ భోజదేవుని ఉక్తి, ప్రత్యుక్తి మద్వాక్యాలను, వదలుకొంటే, ఆ మహనీయునికెంతో ద్రోహంచేసిన వారమైతాము. అతని కంటే, అన్ని విధాలుగా ప్రపంచీకరించినవారు అరుదు. విస్తరభీతి, తన బిభీషికతో భయపెడుతున్నా , శ్రమయనుకొనక, వాని నొకసారి పరిశీలించి, కృతజ్ఞతాంజలి ఘటించటం, మన పాఠకుని మహాధర్మం.

## భోజదేవుని ఉక్తి-ప్రత్యుక్తిమత్ - వాకోవాక్య రూపసంవాద సాహిత్యమ్.

**38.శ్లో. ఉక్తి ప్రత్యుక్తిమ ద్వాక్యం వాకోవాక్యం విదుర్బుధాః,**

**ద్వయో ర్వక్త్రో స్త దిచ్ఛన్తి బహూనా మపి సంగమే ॥**

**39.శ్లో. ఋజూక్తి రథ వక్రోక్తిః వైయాత్యోయక్తి స్తథైవచ,**

**గూఢ ప్రశ్నోత్తరోక్తీచ చిత్రోక్తి శ్చేతి తద్విధా ॥ స.కం. 2, 131,132.**

ఉక్తి - ప్రత్యుక్తుల (ప్రశ్నోత్తరముల) తో గూడిన దానిని వాకోవాక్య మంటారు. చుట్టూ అనేకులు పరివేష్టించి ఉన్ననూ, ఇద్దరు వక్తల మధ్య జరిగిన సంవాదమే అభీష్టమైనది.

ఇది ఋజూక్తి, వక్రోక్తి, వైయాత్యోక్తి, గూఢోక్తి, ప్రశ్నోత్తరోక్తి, చిత్రోక్తి - అను నామములతో ఆరువిధాలుగా భిన్నమైనది వానిలో ఋజూక్తి గ్రామ్యా, ఉపనాగరికా - భేదంతో రెండువిధాలు ఉపనాగరికకు ఒక ఉదాహరణము

**40.శ్లో. బాలే!, నాథ!, విముంచ మానిని ! రుషం, రోషాన్మయాకిం కృతమ్!**

**ఖేదో స్మాసు,న మే పరాధ్యతి భవాన్?, సర్వే పరాధామయి।**

**త త్కిం రోదిషి గద్గదేన వచసా?, కస్యాగ్రతో రుద్యతే?**

**నన్వే తన్మమ, కా తవాస్మి? దయితే, నాస్మీత్యతోరుద్యతే ॥ సం.కం.2-347.**

ఈ అమరుక శతక శ్లో ప్రియా ప్రియుల వార్తాలాపమును గమనించండి

కోపగించిన ప్రియురాలితో నాయకుని ఉక్తి - 1. బాలా! ఉ. ఏమి నాథ!?

2. అభిమానవతీ! నీకోపాన్ని కొంచెం తగ్గించుకో ఉ. నేను కోపగించి, ఏమిచేశానండీ!

3. నాకు దుఃఖాన్ని కల్గించావు ఉ. సరే! నీవు నాకేమి అపకారం చేయలేదా?

సరే, అన్ని అపరాధాలు నేనే చేశానులే

4. అయితే, గద్గదకంఠంతో ఏడుస్తున్నావెందుకు?

ఉ. ఎవరి ఎదుట ఏడుస్తున్నాను!

5. అరే, ఇంకెవరి దగ్గర? నాదగ్గరే ఏడుస్తున్నావుగా,

ఉ. నేను నీకేమవుతానని?

6. నీవు నా ప్రేయసివి కదా! ఉ. అలాంటి దాన్ని కాలేకపోయాననే నా ఏడుపు.

**వి. 1. ఇక్కడ కాకుసర్వంతో అన్వయిస్తే, శృంగారార్థం,పోయి రౌద్రరసరూపాన్ని ధరిస్తే, విషమిస్తుంది, కాని, ఇక్కడ స్పష్టంగా, అభిధేయార్థాన్ని స్వీకరించడంతో, ఈ అసంగతి దూరమై ఋజూక్తి స్థిరపడుతుంది.**

**2.** వక్రోక్తి కూడా నిర్వ్యూఢా, అనిర్వ్యూఢా, అని రెండు విధాలు.

నిర్వ్యూఢకు ఉదా:

**41-శ్లో. కిం గౌరి మాం ప్రతి రుషా,? నను గౌరహం కిం**

**కుప్యామి కాం ప్రతి. మయీ త్యనుమానతోZహమ్।**

**జానామి, సత్య-మ నుమానత ఏవ స త్వ -**

**మిత్థం గిరో గిరి భువః కుటిలా జయన్తి ॥ స.కం. 348**

ప్ర 1. ఓ గౌరీ! నామీద నీకు అంత కోపమెందుకు? ఉ. నేను ఆవు (గౌః)నా?

బాగానే ఉంది నేను ఏస్త్రీపై కోపగించాను? ఉ. నామీదనే కోపగించావని అనుమానించి, వక్కాగా తెలుసుకొన్నాను.

2. అయితే, నేను కూడ , నీవు నాకంటే ( ఉమా) భిన్నురాలగు మరొక స్త్రీకి లొంగిపోయావని, నిజంగానే తెలుసుకున్నాను..

- ఇట్టి పార్వతి యుక్కు వాక్కు సర్వోత్కృష్టమైయుండుగాక।

వి. ఈ శ్లోకంలో మొదటినుండి చివరివాక్యం పూర్తియగువరకు, ''వక్రోక్తి''లో ఒకే క్రమము నిర్వహింపబడింది కనుక, ఇది నిర్వ్యూఢా వక్రోక్తి అను వాకోవాక్యమునకు ఉదాహరణమగుచున్నది.

అనిర్వ్యూఢా వక్రోక్తికి ఉదాహరణము

**42.శ్లో. కేయం మూర్ఖాంధకారే! తిమిరమిహ కుతః? సుభ్రు! కాంతేందు యుక్తే**

**కాన్తా ష్యత్రైవ కామిన్! నను భవతి మయా పృష్ట మేతావదేవ।**

**నాహం ధ్వస్యం కరోమి? ష్వపసయ శిరసః తూర్ణ మేనా మిదానీం**

**ఏవం ప్రోక్తో భవాన్యా ప్రతివచన జడః పాతువో మన్మథారిః ॥ స 349.**

సం. పార్వతీ పరమేశ్వర సంవాదము.

ప్ర 1 అంధకాసుర శత్రువగు ( అన్ధకారే అయిన, ) ఓ శివా! నీ నెత్తిపై కూర్చున్న దెవరు?

ఉ. ఓ సుభ్రూ! ఏమిటి అలా అంటావు? నా తలపై శుభ్ర చంద్రరేఖా కాంతి కారణంగా చీకటి( అంధకారం) ఎక్కడ నుండి వస్తుంది?

2. ఓ కాముక! నీ ప్రియురాలు కూడ ఇక్కడే ఉన్నది. కనుకనే,నే నీ విధంగా అడుగుతున్నాను. నాకు నీతో పోరెందుకు? నీ నెత్తిమీద నుండి దానిని వెంటనే తీసి వేయరాదా? అని పార్వతి పల్కగా, ప్రత్యుత్తరింపలేక మిన్నకున్న శివుడు మిమ్ము నుమ్ము రక్షించుగాక!

**వి. 1. ఇక్కడ ఒక నిర్దిష్టక్రమము నిర్వహింపబడనందున, ఇది అనిర్వ్యూఢా వక్రోక్తి,కి ఉదా. అయినది. అంతేకాక, ఈ నిర్వ్యూఢా, అనిర్వ్యూఢా లను రెండు వక్రోక్తి వాకోవాక్యములందును, శ్లేషవక్రోక్తి కూడ ఉన్నదని మరువరాదు.**

**2.'' కిం గౌరి మాం'' పద్యంలో ఉక్తి ప్రత్యుక్తుల క్రమం, ప్రతి- వాక్యంలోనూ, ప్రతి పాదంలోనూ ఉండటం వలన, అది నిర్వ్యూఢా. రెండవ కేయం మూర్ధ్న్యంధకారే.... పద్యంలో ఒక క్రమపద్ధతి లేదు. అంతేకాక, 2,3 చరణాలలో కేవలం పార్వతి యొక్క ఉక్తి మాత్రమే ఉండగా, శివుని ప్రత్యుక్తి లేనందున అది అనిర్వ్యూఢా అయినది.**

**3. పైరెండు ఉదా. లోనూ శ్లేషనాశ్రయించటం జరిగింది. మొదటి దానిలోని ''గౌరిమాం, అనుమానతః'', అను రెండు పదాలలోనూ, రెండవదానిలో ''అంధకారే- కాన్తా '' అనుపదాలలోనుశ్లేష ఉన్నది. 1. గౌరిమాం రూపాన్ని 1. గౌః + ఇమాం ( ఆవు - దీనిని )గాను 2. గౌరి! మాం ( = ఓ గౌరీ నన్ను) గాను విడదీయుట వలన అర్థంకూడ మారిపోతుంది. అల్లే 2వ పద్యంలోని అన్ధకారే పదాన్ని, అన్ధక+అరే (= అంధకాసురశత్రువైన శివ పరంగాను, 2. అంధకారే (=చీకట్లో) అను భిన్న అర్థాలకు కారణం శ్లేషయే 2. మరియు, అనుమానతః పదాన్ని 1 అన్+ ఉమా-నతః ( = ఉమకు భిన్నమైన దానికి - తలవంచుట (నతః) -గాను 2 అనుమానతః = సందేహ, ఊహ-వలన అనే రెండర్థాలు - కనుక, ఇవన్నీ శ్లేష మూలకాలే సుమా!**

3.స్వైయాత్మోక్తి - ''స్వాభావికీ , నైమిక్తికీ'' అని ద్వివిధం స్వాభావికీ- కి ఉదా--

**43.శ్లో. నాదేయం కిమిదం జలం ఘటగతం, నాదెయ మే పోష్యతే**

**సత్యం నామ పిబామి కశ్యపత్రుషః పితేన నామ్నా భవనే ।**

**కిం వర్ణా అపి సంతి నామ్నిరహితం కిం త్రై రలం త్వం కుతః ?**

**యస్మా దేవ భవాన్ భగిన్యసి తత స్తనైవ మాం బాధసే ॥ స.కం. 2. 350.**

సం. ఇది యొక బాటసారికి, చలివేంద్రం దగ్గర మంచి నీరు పోయు స్వైరిణి (= కులట, జారిణి) కి జరిగిన సంభాషణ

బాటసారిప్రశ్న 1. ఓ ప్రపాపాలికా! (సాభిప్రాయంగా) ఈకుండలోని నీరు గ్రహింపదగినదేనా?

వి. (న-ఒదేయం, దేయం = దాతుం యోగ్యం = ఇవ్వదగినది, (న-దేయం =) అదేయం = ఇవ్వ (గ్రహింప)దగనిది. న + అదేయం = గ్రహించుటకు తగనిది - కానిది = అనగా (తప్పక) గ్రహింపదగినది- అని పర్యవసితార్థము)

ప్రహేపాలికా ప్రత్యుత్తరం - గ్రహింపదగినదే (నాదేయం). లేక న+ ఒదేయం = గ్రహింపదగినది కానిది కాదు. = అనగా తప్పక గ్రహింపదగినదే అని చెప్పుచున్నానుగదా!

2. అయితే, నే నీ నీరు తప్పకుండా త్రాగుతాను. మంచిదే, ఎంత మంది దప్పిక గొన్నవారి దాహం శాంతించింది? లేక పీత అనే పేరుతోనే ఎందరి దప్పిక తీరిపోయింది.

ఉ. ఏమండీ (పీత) నామం (పేరు)లో వర్ణాలు (రంగులు) కూడా ఉంటాయా? ( ఇక్కడ ''పీత'' అనగా పసుపుపచ్చ (ఎల్లో) రంగు అనే అర్థాన్ని గ్రహించాలి.

3. అసలు, అవి (వర్ణాలు) లేకుండా ఏపేరు తయారౌతుంది?

ఉ సరే, బాగానే ఉంది. అసలు నీవు ఎక్కడి నుండి వచ్చావో కొంచెం చెప్పరాదా?

4 నీవు ఎక్కడినుండి వచ్చావో? (నేనూ అక్కడి నుండియే)

అయితే, నీవు నాకు సోదరి వన్నమాట. అయితే ఏం, ఇందుకనే నన్ను అడ్డగించి బాధిస్తున్నావన్నమాట!

వి. నైయాత్య మనగా, సాహసము, లేక సిగ్గులేకపోవుట ... ఈ భావాలు కొందరిలో నైజంగానే ఉంటాయి. కొందరిలో కారణాంతరాలతో వచ్చి, ప్రస్ఫుటమౌతాయి. పై శ్లోకంలో, ఒక ప్రహేపాలిక ఒక కొత్తబాటసారితో మాట్లాడుతోంది. ఏ కులీన స్త్రీ కూడ, ఒక అపరిచిత వ్యక్తితో, ఇలా తెగించి, హావభావ పూర్వకంగా శృంగారభావాలు ప్రదర్శిస్తూ మాట్లాడదు అవన్నీ కులటకు జన్మతః సిద్ధిస్తాయి. అందుచే ఇక్కడ స్వాభావికీ నైయాత్యోక్తికి ఉదాహరణమైనది.

నైమిత్తికీ నైయాత్యోక్తికి ఉదాహరణము.

**44.శ్లో. కుశలం రాధే! సుఖితో 2సి కంస!, కంసః క్వను? క్వసా రాధా?,**

**ఇతిపౌరీప్రతివచనైః విలక్షహాసో హరి ర్జయతి ॥ స.కం. 351**

సం. రాధాకృష్ణుల సంవాదం. ఇక్కడ గోత్రస్ఖలనం(పేరుజారి, ఒకరిని, మరియొకరిపేరుతో పిల్చుట) అనగా సత్యభామను రాధ పేరుతో పిల్చుట.

కృష్ణుని ప్రశ్న 1 రాధా ! సుఖంగా ఉన్నావా?

రాధ ప్రత్యుక్తి . అవును, కంసా! సుఖంగానే ఉన్నాను.

కృ.ప్ర.2 ఆదేమిటి కంసుడెక్కడ ఉన్నాడు? ఉ. ఐతే రాధమాత్రం ఎక్కడ ఉన్నది?

ఇట్టి చమత్కార ప్రత్యుక్తుల ద్వారా సిగ్గుపడే, నవ్వుచున్న కృష్ణుడు సర్వోత్కృష్టుడై ఉన్నాడు.

వి. ఇక్కడ పేరు మార్చిడి (గోత్రస్ఖలనం)తో, సవతిని, శత్రువును పిలుచుట కారణం (నిమిత్తం)గా, హాస పూర్వక - ప్రత్యుత్తరం ఇవ్వబడింది. కనుక, ఇది నైమిత్తికీ నైయాత్యోక్తి వాకోవాక్యమునకు ఉదాహరణము.

ఎట్లనగా, మొదట కృష్ణుడు ఒకసమయంలో, ఒక సుందరిని లేక సత్యభామను, ఆమె యొక్క అసలు పేరుతో పిలువక, రాధా అని పిలిచినాడు ఆమె అసలు పేరు రాధ కాదు రాధ కానిదానిని రాధానామం

(సవితి పేరు) తో పిలవడంతో ఆమెకు కోపం వచ్చి, ఆమె కూడా కృష్ణుడితో, అతని శత్రువగు కంస నామంతో పిలిచింది. గోత్రస్ఖలనం వలననే ఇలా జరిగిందన్న మాట మరువరాదు.

4 గూఢోక్తి - ముఖ్యా, గౌణీ - అనే పేరులతో రెండు విధాలు కాగా, ముఖ్యా ఉదా.-

**45.శ్లో కేశవ! యమునా తీరే వ్యాపృతవా నుషిసి హంసికాం కోఽద్య ।**
**కాంతి విరహ భయాతుర హృదయః ప్రాయః ప్రియే ఽహం సః ॥ 2- 352**

ప్ర 1 కేశవా! యమునా తీరమున నేటి ఉదయం హంసికను పిలిచినది ఎవరు?

ఉ. ప్రియా, తన ప్రేయసి విరహంతో, బహుశః చంచలచిత్తయగు ఏ హంసయో లేకనేనో పిలిచి ఉంటాం.

వి. ఈ శ్లోకంలోని ప్రియేహంసఃలో అకారం ( ఽ ) లుప్తమైనది లుప్తంకానప్పటి రూపం ప్రియే + అహం - సః (=ప్రియురాలా! ఆ పిల్చినవాడు/ది (సః), నేనే (అహం)కావచ్చు, అనే అర్థం, అభిధావృత్తి (ముఖ్యవృత్తి) వలన గుప్తమైపోయింది. ఇట్లు గూఢం కావటం కారణంగా ఇక్కడ ముఖ్యాగూఢోక్తి వాకోవాక్య మున్నది.

ఇక ''గౌణీ ''ఎట్లనిన

**46.శ్లో. నిరర్థకం జన్మ గతం నలిన్యాః యయా న దృష్టం తుహినాంశు బిమ్బమ్ ।**
**ఉత్పత్తి రిందో రపి నిష్ఫలైవ కృతా వినిద్రా నలినీ న యేన ॥ 2-353**

ఒక వ్యక్తి-చంద్రబింబాన్ని చూడని పద్మం యొక్క జన్మ ఎందుకు? అది నిరర్థకమే. అనగా, మరొక వ్యక్తి అట్లే కమలాన్ని వికసింపచేయజాలని చంద్రోదయం కూడ వ్యర్థమే సుమా! అనెను

వి.1. ఈ శ్లోక పూర్వార్ధాన్ని ఒకరు చెప్పగా, మరొకరు ఉత్తరార్ధాన్ని ప్రత్యుక్తిగా చెప్పినారు. అయితే, వీరిద్దరు ఒకరి కొకరు ఎదురుగా నుండక, ప్రచ్ఛన్నం (గూఢం) గా నుండి చెప్పుటచే ఇది గౌణీ - గూఢోక్తి అను వాకోవాక్యమగుచున్నది.

వి. ఈ సంభాషణ ''రాజకన్యా - బిల్హణుల'' మధ్య జరిగినదని కొందరు పెద్దలు చెప్పినారు. (పూర్వార్థము రాత్రి యందు చంద్రుని గాంచి, వర్ణించుచున్న భోజానిదని, ఉత్తరార్థము చోరవేషంలో రాజదర్శనార్థమై వచ్చిన, మరొకరిదని కొందరి భణితి )

చంద్రుని వంటి నన్ను పెండ్లాడని, నళిని వంటి నీ జన్మము వ్యర్థముసుమా! అని కవి యనగా, వికసిత కమలము వలే సుందరముగా నున్న నన్ను పెండ్లాడని నీ పుట్టుకకూడ అంతకంటే వ్యర్థమని, వక్రోక్తితో రాజకుమారి ప్రత్యుత్తరము.

2 పై 1. కేశవ! యమునాతీరే -- 2. నిరర్థకం జన్మ-- అనే ఈరెండు శ్లోకాలలోనూ గూఢోక్తి ఉన్నది. మాటలు కూడ స్పష్టంగానే చప్పబడినాయి. అయితే, వార ప్రకటన, సంవాదరూపంలో సూటిగా జరుగనందున గూఢోక్తి అయినది.

మొదటి శ్లోకంలో ఆడుహంస (హంసికా) కోసం, మగహంస వెదుకుతూ పిలుస్తోంది అయితే, దానితోపాటు ప్రియే! అహం సః అనే దాని అర్థంకూడ ముఖ్య-అభిధావృత్తి ద్వారానే ప్రకటితమైనది. ఏదైనా ఒక పదానికి అర్థం ఎడంలేకుండా,సాక్షాద్రూపంలో ప్రకటితమైనచో, అట్లు ప్రకటించు శబ్ద శక్తిని, ముఖ్యా, లేక, అభిధా వృత్తి అంటారు. ముఖ్యార్థాన్ని బాధించి, దానిలో కలిసిపోయే అర్థం ప్రకటితమైతే,

దనిని గౌణీ, లక్షణా, వ్యంజనా, అనుమాన ఆదినామాలతో కూడా పిలుస్తారని గమనింపవలెను. ఇక, రెండవ శ్లోకంలోని 1 కుముదినీ 2. చంద్రవర్ణనలు ఎవరో ఒక నాయకా నాయకులవైపు సంకేతింపబడినవి గనుక, ఈ అర్థమంతా గౌణీ వృత్తి యొక్క ప్రభావంతోనే వస్తుంది.

5. ప్రశ్నోత్తరోక్తి - ''అభిధీయమాన హృద్యా'', ప్రతీయమానహృద్యా అని ద్వివిధము. 1అభిధీయ మాన హృద్యా - ఉదా:

**47.శ్లో. క్వ ప్రస్థితాసి కరభోరు! ఘనే నిశీథే**

**ప్రాణేశ్వరో వసతి యత్ర మనః ప్రియో మే ।**

**ఏకాకినీ వద కథం న బిభేషి బాలే !?**

**నన్వస్తి పుంఖిత శరో మదనః సహాయః ॥ స.కం. 2-254**

ప్ర.1 ఓసున్దరీ! ఈ గాఢాంధకారంలో, రాత్రిలో, ఒంటరిగా ఎక్కడకు బయలుదేరినావు?

ఉ. నామనోహర ప్రాణనాధుడు ఉన్నచోటికి..

2. ఓ అమాయకపు - పిల్లా! ఒంటరిగా వెళ్తూ ఉంటే, నీకు భయమేమీ లేదా?

ఉ. నేను ఒంటరిదాన్ని కాదయ్యా! నా వెంటనే, ధనుస్సును ఎక్కుపెట్టిన మన్మథుడు వస్తున్నాడు కదా! కనుక నేను నిస్సహాయురాలను ఎలా అవుతాను?

వి. ఇక్కడ, హృదయగతమైన ప్రశ్న, స్పష్టంగా ముఖ్యమగు అభిధావృత్తి తోనే చెప్పబడుటచే, అభిధీయమాన హృద్యా అను ప్రశ్నోత్తరోక్తి.

2. ప్రతీయమాన హృద్యా - కు ఉదా ·

**48.శ్లో కియ న్మాత్రం జలం విప్ర!? జాను దఘ్నం నరాధిప!**

**తథా పీయ మవస్థా తే? న హి సర్వే భవాదృశాః ॥ స. కం. 2-255.**

రాజుగారి ప్రశ్న 1 ఓ బ్రాహ్మణుడ ఏటిలో నీరు ఎంత లోతుగా ఉన్నది?

బ్రాహ్మణుని ఉత్తరం - మహారాజా ! మోకాలిబంటి లోతు న్నది.

2 ఇంత మాత్రానికె ఇంత బాధపడుతున్నావా?

ఉ. అయ్యా! అందరూ మీ వంటివారు కాదు సుమా! ( మీ బోంట్ల కిది లెక్కలోనిది కాకపోయినా, మాకిది మహా ,బాధాకరమైనదే! సుమా!

వి. 1. ఇది వ్యాకరణశాస్త్ర నైపుణ్యంతో , హృదయంగమంగా, ప్రతీయమానమగుటచే ప్రతీయమాన హృద్యా- ప్రశ్నోత్తరోక్తి వాకోవాక్య మైనది.

2. పై రెండు శ్లోకాలలోనున్న ప్రశ్నోత్తరోక్తులు హృద్యంగా, మనోహరంగానే ఉన్నాయి. అయితే, మొదటి దానిలోని హృద్యత అభిధావృత్తి ద్వారా స్పష్టీకరింప బడింది. ఆనాయిక ( అభిసారిక) మన్మథసాహాయ్యంతో సురక్షిత అన్నమాట. హృదయంలో చమత్కార చందనాన్ని చిందిస్తోంది.

3. ఇక రెండవ శ్లోకం శార్ఙ్గ ధరపద్ధతి, భోజప్రబంధం అను రెండు గ్రంధాలలోనూ కన్పడుతోంది. దీనిలోని 1,3పాదాలలోని ప్రశ్నలు, నదిని దాటాలనుకున్న భోజ దేవునివి కాగా, 2,4 పాదాలలోని ప్రత్యుత్తరాలు నీరునేషంలో కట్టెలమోపు మోస్తున్న ఒక బ్రాహ్మణ పండితునిది దీనిలో

భోజ-కష్టనాహకు లిద్దరి పాండిత్య ప్రకర్ష ప్రత్యక్షమౌతుంది. ఇంకా, విశేషమేమి టంటే- రాజు వ్యాకరణ ప్రసిద్ధ మా త్రచ్ ప్రత్యయాన్ని జోడించి, ప్రశ్నింపగా, పండితుడు కూడ వ్యాకరణ ప్రసిద్ధ దఘ్నచ్ ప్రత్యయ ప్రయోగంతో ప్రత్యుత్తరిందుట వలన, వీరిద్దరు మహా వైయాకరణు లని కూడ తెలుసుకొనగలము
4. ఈ ''మా త్రచ్, దఘ్నచ్'' ప్రత్యయాలు రెండూ పరిమితి (కొలత) ని తెలుపు వ్యాకరణ ప్రత్యయాలని తెలియుచున్నది

6 చిత్రోక్తి కూడ - 1. చిత్రా, 2. విచిత్రా అని రెండు విధాలు కాగా, ఆ చిత్రోక్తికి ఉదా.

**49.శ్లో. లభ్యంతే యది వాంఛితాని యమునాభాగీరథీ సంగమే**

**దేవ! ప్రేష్యజన స్తదేష భవతో భర్తృత్వతాం వాంఛతి ।**

**న న్వేత న్మరణేన కిం ను మరణం? కాయా న్మ నో విచ్యుతిః,**

**దీర్ఘం జీవ మన స్తవాం ఘ్రికమలే, కాయో z త్ర న స్తిష్ఠతి ॥ 2-356.**

ప్రభూ! గంగ యమునా సంగను ప్రదేశంలో, నిజంగా సర్వాభీష్టాలు సంప్రాప్తిస్తే, మీ యీ సేవకుడు, మీ యొక్క స్వామిత్వము నే సదా కోరుకుంటున్నాడు ఒకవేళ, ఆకోర్కెల ఫలితాలు మరణానంతరం సంభవిస్తాయంటే, కేవల మరణమంటే ఏముంది? మరణమనగా శరీరం నుండి మనస్సు వేరగుటయే కదా! కనుక, ఓ మహా ప్రభూ! అట్టి నామనస్సు సదా మీ పాదపద్మాలపై లగ్నమై ఉండు గాక! ఇక, శరీరమందా మా - అది ఇక్కడ ఉండనే ఉన్నది గదా!

వి. ఇక్కడ, స్వయంగా కల్పించుకొన్న ప్రశ్నోత్తరాల ద్వారా, ప్రస్తుతం జీవించి యున్న వానికి కూడ జన్మాంతర ప్రాప్తి సిద్ధంచేయబడింది. అది ఆశ్చర్యకారణంగా కూడ అవుతోంది. అందుచే, ఇక్కడ చిత్రా'' అనే పేరు గల చిత్రోక్తి ప్రత్యుక్తి వాకోవాక్యమున్నదని గమనింపవలెను.

విచిత్రోక్తికి ఉదాహరణము.

**50.శ్లో. కో z యం భామిని భూషణం కితవ! తే, శోణః కథం?, కుంకుమాత్**

**కూర్పాసాంతరితః ప్రియే! విసమయః పశ్యాపరం క్వాస్తి మే?, ।**

**పశ్యా, మీ తృథిధాయ, సాంద్రపులకో మృద్నన్ మృడాన్యాః స్తనౌ**

**హస్తేన, ప్రతిబింబితేన్దు రవతాత్ ద్యూతే హసన్ వో హరః ॥ 2-357**

ప్ర 1. సుందరి ! ఇదేమిటి? ఉ. ఇది నీ భూషణం (అలంకారం) సుమా!

2. అయితే అది ఎర్రగా ఉన్నదేల? ఉ. కుంకుమం పడుట వలన

3 ప్రేయసీ! కుబుసంతో కూడ కప్పబడి ఉన్నది. ఎందువలన?

ఉ. చూడు ఇంకా నావద్ద మరేవస్తువున్నది.

4. సరే, చూస్తానులే అని చెప్పి, మిక్కిలి గగుర్పాటు చెందిన వాడై, పార్వతి యొక్క స్తన ద్వయమును, తన హస్తంతో మర్దిస్తూ, జూదంలో చంద్రుని కూడ, పణంగా పెట్టి, ఓడిపోయి కూర్చున్న శంకరుడు మిమ్ములను రక్షించుగాక !

వి.1. ఇక్కడ, ఉక్త ప్రత్యుక్తులకు పిమ్మట, స్తనమర్దనాది విచిత్ర కర్మలద్వారా వర్ణన సమాప్తమగుట వ లన, ''విచిత్రా'' అను పేరుగల వాకోవాక్యమైనది.

2 ఇక్కడ, భోజదేవుని ప్రశ్నలు, పశ్చిమంగా ...ప్రాయములు, అవశ్య గ్రాహ్యములు ఉంటుటే,

51. కస్త్వంభోః .......... (67 వ పేజీలో చూడగలరు.)

సరస్వతీ కంఠాభరణం'' లోని, ఆయా విశేషాలు పేర్కొంటె పరితోషం. ముఖాత ఫంగ అనూదితములైనవని మనవి.

**52.శ్లో. కస్త్వం భోః? కవి రస్మి, త త్కిము సఖే! క్షీణో Z సి? అనాహారతః**

**ధి గ్దేశం గుణినో Z పి దుర్గతి. రియం దేశం? న,మా మేవ ధిక్ ।**

**పాకార్థీ, క్షుధితోయదైవ విదధే పాకాయ బుద్ధిం, తదా**

**వింధ్యే నేంధన మంబుధౌ న సలిలం, నాన్నం ధరిత్రీ తలే ॥**

సం. ఒక బక్కా ఎక్కిన కవికి, బాటసారికి జరిగిన సంవాదము

ప్ర 1 ఎవరయ్యా! నీవు? ఉ నేనొక కవినండీ.

2 ఏమి మిత్రమా! అంత బక్కగా చిక్కి, శల్యావశిష్టంగా ఉన్నావు?

ఉ. సరియైన ఆహారం లేక.

3 అయ్యో! ఇంత సద్గుణవంతులకు , కవి పండితులకు కూడ పట్టెడన్నముపెట్టలేని హీన, నిక్కష్ట దేశములో ఉన్నారా? ఈ దేశం- దేశ ప్రజలును?

ఉ. అయ్యా! ఈ దుర్గతి, నిక్కష్ట స్థితి, నిజానికి ఈ దేశానిది, దేశ ప్రజలదే కాదు మాదే మాకు నిందిత ఎదుర్కొంటే. ఆనింద మా మీదనే పడవలసి ఉంటుంది.

ఎందువల్లననగా, ఆకలితో అల్లాడుతూ నాలుగు మెతుకులు తిందామనుకొని, పొయ్యిలోని పిల్లిని లేపుదామనుకుంటే (పర్యావరణ రక్షణ లేక) వింధ్యారణ్యంలో కట్టెలు లేవు. జలనిధులలో నీరు, ధరిత్రిలో ధాన్యం కూడ కరువైపోయింది. ఎంత కష్టం వచ్చి పడిందిరాబాబు! - అని కవి సమాధానం.

ఏ ఒకనాడు ధన కనక వస్తువాహనాలతో నందించి, వర్థిలిన దేశంలో, నేడు ప్రజల యొక్క స్థితి – గతి ఇంత నీచ స్థితికి దిగజారిపోయిందా- అను కవి యొక్క ఆక్రోశం కూడ వ్యక్తమౌతుంది

53.శ్లో. కస్త్వం భద్ర !? ఖలేశ్వరో Z హ, మిహ కిం ఘోరే వనే స్థీయతే?

శార్దూలాదిభి రే . హింస్ర పశుభిః ఖాద్యో Z హ మిత్యాశయా!

కస్మా త్కష్ట మిదం త్వయా వ్యవసితం? మ ద్దేహమాంసా శినః

ప్రత్యుత్పన్న న్నృమాంస భక్షణధియః, తే ఘ్నన్తు సర్వా న్నరాన్ ॥

ప్ర 1. ఓ మంచిమనిషీ! ఎవరివయ్యా నీవు?

ఉ. నేనొక ఖలేశ్వరుడను (= ఆస్తి గలవాడను, భూస్వామిని, దుర్మార్గులకధిపతిని)

2 ఈ భయానకారణ్యంలో, ఒంటరిగా ఎందుకుంటున్నావు?

ఉ. పెద్దపుల మొదలగు, క్రూరమృగాలేవైనా, నన్ను పట్టి పల్లార్చి, తినగలవను ఆశతో,

3. ఏల ఇంత గొప్ప/ కఠోర/ చెడ్డ నిర్ణయాన్ని తీసుకున్నావు?

ఉ. నన్ను చంపి నా మంచి మానవ మాంసం తిన్న వ్యాఘ్రాది క్రూరమృగాలు, నరమాంసభక్షణ రుచికలవాటుపడి, ఆ మనుష్యుల నందరిని తినివేయాలని సుమా!

ఈ లోకంలో కొందరు ధనాఢ్యులు, మధ్యతరగతికూడా, ఒకప్పుడు ఉన్నత బుద్ధికలవారైనా, నేడు ధనానికి దాసులు కావడంతో, పాపం పెరిగి పడగలు విప్పుతోంది. నీతి నియమాలు, సంస్కారం, మంచిచెడులు మంటగలుస్తున్నాయి . ఈ నీచులంతా తగ్గిపోతే కొంత పాప భారం తగ్గుతుందేమో నని ఇలా, ఆత్మత్యాగానికి పూనుకున్నాను. ఇది శుభోదర్కమైతే బాగుంటుందేమో!

54 శ్లో. కస్త్వం వానర! రామరాజభవనే లేఖార్థసంవాహకః
యాతః కుత్ర పురాగతః స హనుమాన్ నిర్దగ్ధ లంకాపురః ।
బద్ధో రాక్షససూనునేతి కపిభిః సంతాడితస్తర్జితః
స వ్రీడాత్తపరాభవో వనమృగః కుత్రేతి న జ్ఞాయతే ॥

సం. రాయబారానికి వచ్చిన అంగదునితో, లంకలోని రాక్షసుల సంభాషణ

ప్ర.1. ఓ కోతీ! నీవెవరివయ్యా?

ఉ. నేను శ్రీరాముని సౌధంలో ఉత్తర ప్రత్యుత్తరాలు, సందేశాలనందజేసేవాడను

2 ఔను, సరే, ఒకప్పుడు లంకానగరాన్ని, నిర్దాక్షిణ్యంగా సర్వనాశనం చేసిన ఆ కోతి (హనుమంతుడు) ఏమయ్యాడు? మళ్ళా కనపడలేదు?

ఉ. వాడా! అతడిక్కడి రాక్షసునిచే, ఇంద్రజిత్తుచే బంధింపబడినందుకు, ఇతర వానరాలన్నీ వానిని కొట్టి, భయపెట్టి పరాభవించినాయి. ఆ పరాభవంతో సిగ్గుపడి, ఆ కోతి ఏమైనదో, ఎక్కడికు పారిపోయినదో, దాక్కొన్నదో, దాని జాడకూడ తెలియరావడం లేదు సుమా! అని తేలికగా, సగర్వంగా, సమాధానం చెప్పాడు.

వి. 1 ఆ హనుమంతుడు చాల చిన్నవాడు, సన్నవాడు. వాడే లంకాదహనం చేస్తే మిగిలిన వానరాలు వానిని అవమానించి, దండించినవంటే, మిగిలిన కోతులు ఎంత పరాక్రమంగలవో నని శౌర్య, ధైర్య స్థైర్యాలెలాంటివో ఆలోచించుకోండి. వానినెదుర్కొనవలసిన స్థితి మీకు త్వరలో దాపురిస్తుంది సుమా! - అని హెచ్చరిక.

2. ఇక్కడ, హనుమన్నిందచే, ఇతర వానరుల స్థితి అభివ్యక్తమగుటచే, ఇది వ్యాజస్తుత్యలంకారానికి కూడ ఉదాహరణమౌతుందని అప్పయ్య దీక్షిత ఉవాచ.

55.శ్లో. కస్మాద్దూతి! శ్వసిషి నిభృతం? సత్వరావర్తనేన,
భ్రష్టో రాగః కి మధరతలే? ప్రార్థనాభి స్త్వదర్థమ్ ।
భ్రష్టా చేయం కి మలకతతిః? తత్పదాలుంఠనేన,
వాణః తస్య త్వయి వద కథం? ప్రత్యయార్థం తవైవ ॥

సం. ఒక కోపగించిన నాయిక, తన దూతికను నాయకుని తోడ్కొని రమ్మని పంపినది. తిరిగి వచ్చిన ఆ చెలికి-నాయికకు జరిగిన సంవాదము.

ప్ర. ఏమిటే దూతీ! చాటుగా అంత ఆయాసపడుతూ రొప్పుతున్నావేమి?

ఉ. హడావుడిగా, తొందరగా పరుగెత్తుకుని రావడం చేత ఆయాసం వచ్చిందమ్మా!

2. నీ పెదవులకి రాసుకున్న రంగంతా పోయిందేమిటే?

ఉ. నీ కోసం ఆన మనుషులతో ఎన్నో విధాల ప్రార్థనలు, హార్లాడటం వలన.
3. నీ కొప్పు కూడా ఊడి, వెంట్రుకలన్నీ నేలాడుతున్నాయి, ఎందువలన?
ఉ. నీ కొరకు ఆయన పాదాలపై పడి, ప్రాధేయపడటం వలన,
4. అయితే, ఆయన పత్రం కూడ నీ వంటి మెడకి ఎలా వచ్చింది?
ఉ. నేను ఆన మనుషుని అనేక విధాల ప్రతిమలాడినందుకు, సరిగ్గా నీకు నమ్మకం కల్గించుటకు, ఆ పత్త్రం చెప్పాను సుమా!

వి. నాయకుని పంపిన మాలికతో, ఆ ధూర్త నాయకుడు సంభోగించడంలో, ఆమాలికపై, ఆ సంభోగ చిహ్నాలన్నీ ప్రత్యక్షం కావడంతో, ఆ మాలిక ఎన్ని విధాల మభ్యపెట్టినా, ఆనాయిక చాతుర్యంతో ప్రశ్నించి, ఆమె నిజాన్ని అర్థం చేసుకున్నదన్న మాట

56.శ్లో కా త్వం పుత్రి? నరేంద్ర! లుబ్ధక వధూః, హస్తే కిమేతత్ పలమ్,
క్షామం కిం? సహజం బ్రవీమి నృపతే! యద్యస్తి చేత్ కౌతుకమ్ ।
గాయన్తి త్వదరిప్రియా శ్రుతటినీతీరేషు సిద్ధాంగనా:
గీతాంధా న తృణం చరన్తి హరిణా:, తేన ఆమిషం దుర్లభమ్ ॥

సం. వేటకు వెళ్లిన (భోజ?) రాజుకు కిరాత స్త్రీకి జరిగిన సంవాదము.

ప్ర.1. ఓ అమ్మాయీ! నీ వెవరవు? ఉ. రాజా! నేనొక కిరాతిని (కిరాతుని భార్య లేక కోడలిని)
2. నీ చేతిలోనున్న దేమిటి? ఉ. రాజన్! మాంసం (పలం= మాంసం, ఫలం= పండు)
3. ఆ మాంసం అంత బక్కగా చిక్కి ఉన్నది ఎందువలన?

ఉ. అయ్యా! క్షమించండి. ఆ విషయం నిజంగా మీకు తెలుసుకోవాలని ఉంటే, వాస్తవం చెప్పుతాను వినండి. మీరు ఓడించి, పంపిన మీ శత్రురాజుల యొక్క స్త్రీలు, ఆ అడవుల్లో పడి, ఏడుస్తూ ఉంటే, వారి కన్నీరు కాల్వలై పారి, చెలుప్రులుగా చేరగా, వాని ఒడ్డున చేరిన సిద్ధాంగనలు, మీ యశస్సును గానం చేస్తున్నారు. ఆ గానం చే ఆకృష్టాలైన హరిణాలన్నీ అక్కడ చేరి, గ్రుడ్డిగా, అక్కడే పడి ఉంటూ, మేతను కూడ మేయటంలేదు. అందుచే, బక్కచిక్కిన ఆ లేళ్ళమాంసం కృశించి, దుర్లభంగా ఉన్నది సుమా! - అని కిరాతి బదులు చెప్పిందట!

వి. 1. ఈ పద్యం భోజ ప్రబంధంలో కూడ కనపడుతోంది. మొత్తం మీద ఆ రాజుయొక్క అవక్ర పరాక్రమము అంత గొప్పదన్నమాట!

2. ''శిశు ర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ'' అని యొక ఆ భాణకము (లోకోక్తి) గానంలో ఉండే సారాంశాన్ని, పాయిని పసిపిల్ల (వాడు) గోవు, లేడి మొదలగు జంతువులు, పాము కూడ తెలుసుకొని ఆనందిస్తాయి. అనునదొకసామెత.

57.శ్లో అః పాకం న కరోషి పాపిని!, కథం? పాపీ త్వదీయః పితా
రండే! జల్పసి కిం? తవైవ జననీ రండా, త్వదీయా స్వసా, ।
నిర్గచ్ఛ త్వ మితో గృహా ద్వృహిః?, నేదం త్వదీయం గృహం
హాహా! నాథ! మ మాద్యదేహి మరణం, జారస్య భాగ్యోదయః ॥

సం ఎభ్యప్రపంచంలో ఆరటాలు, కరాటాలు, పోరాటాలు తప్పనేకపచ్చు, కానీ, ఒకప్పుడు అజ్ఞానులగు భార్య, భర్తల మధ్య లేనిపోని పట్టుదలలు, కలహకారణాలుగా కూడ కావచ్చు. అట్టి కలహ సంభాషణను గూర్చి కవి వర్ణన

ప్ర.1 ఓసీ! పాపాత్ముురాలా! వంట ఇంకా చేయలేదేమీ?

ఉ. నన్ను పాపిని అంటావా? నేను కాదు నీ తండ్రియే పాపాత్ముడు.

2 ఓసి ముండా! ఏమిటే కూస్తున్నావు?

ఉ ఓయా! నేను రండను, ముండను కాను, నీ అమ్మ, అక్క చెల్లెండ్రే రండలు,

3 ఒసే! నా యింట్లో నుంచి ముందు బైటికి కదులు. పో!

ఉ. ఇది నీ తాత ముత్తాతల ముల్లేసు కాదు, నాకూ దీంట్లో అధికారం ఉంది.

4 (చివరి పాదం ఇద్దరిదీ కావచ్చు!) అయ్యో! భగవంతుడా! నాకు చావన్నా తెప్పించకున్నావే? ఇక నేను ఛస్తే (జారునితో) దీని పంట పండిందన్నమాటే! ''పీడామదీయామమ'' అనే పాఠాంతరం కూడ, ఇరువురికి అనువర్తింపవచ్చు. ఇరువురు కూడ, మాలో ఎవరు చచ్చినా, మరొకరికి పీడవిరగడైపోతుందని భావం

58 శ్లో గర్దభదన్త! భదన్త! నమస్తే, కపి వృషణాస్య వయస్య! సుఖంతే?
కస్య గృహే వసతి స్తవ సాధో? యస్య రుచి ర్వసతి మమ తత్ర ॥

సం ఒక గృహస్థునకు లేక బాటసారికి , జైన లేక బౌద్ధ సన్న్యాసికి జరిగిన సంవాదం. వారిద్దరూ లన్యాపదేశంగా అన్యోన్యదూషణ చేసుకొనుటను గమనిస్తాము.

ప్ర.1 గాడిద దంతాలు గల ఓ సన్న్యాసీ! (భదన్త!) నీకొక నమస్కారము, అని ఎత్తిపొడవగా,

ఉ (వాడు మాత్రం తక్కువ తిన్నాడా?) కోతి ముష్కాల (వట్టల) వలె ఎర్రని మూతి గల మిత్రమా! సుఖంగా ఉన్నావా? (అని ఘాటుగా ప్రత్యుత్తరం) దీనితో దిమ్మతిరిగి, చచ్చినంత పనియ్యై, భయపడి, మర్యాదగా -

2 ఓ మునీ! మీరెవరింట్లో ఉంటున్నారు? (అనగా, సాధువుకూడ సౌమ్యంగా)

ఉ ఎవరు, నేను కావాలని, రమ్మని కోరి, నన్నుంచుకుంటారో? అక్కడే ఉంటాను.

అనగా, గృహస్థుడు భయపడి, నోరుజారినందుకు పశ్చాత్తప్తుడై, ఆసాధువును తన ఇంటికే తీసుకొని వెళ్ళి గౌరవించెనట!

వి. మర్యాదను ఇచ్చిపుచ్చుకోవాలి. హాస్యం సహ్యమైనా, ఆక్రోశం, అధిక్షేపం, అంతగా క్షన్తవ్యం కావు. విద్యా, ధన, వయో, రూప, గర్వాలు పనికిరావు. అధికారం ఉన్నది కదా అని అదరపడరాదు ''అధికారాన్తము నందు చూడవలెరా ఆ అయ్య సౌట్లన్నియున్'' అన్నారు అనుభవజ్ఞులగు పెద్దలు.

59 శ్లో ఆంధ్రభాషామయం కావ్యం అయోమయవిభూషణమ్ ।
సంస్కృతారణ్య సంచారి విద్వన్మత్తేభశృంఖలమ్ ॥

సం శ్రీకృష్ణ దేవరాయల ''భువనవిజయ'' ఆస్థానమండపంలో, ఒక గీర్వాణ(సంస్కృత) కవి, ఆంధ్రభాషా, పండితులను వెక్కిరిస్తూ ప్రథమార్థం పఠింప, అల్లసాని వారు ద్వితీయార్థంతో,

దిమ్మతిరిగేటట్లు ఏవట్లు పెట్టుతూ చెప్పు మహాదసం.

ఆంధ్ర (తెలుగు) భాషలో వ్రాసిన కబ్బము, ఇనుముతో చేసిన అలంకారం, ఆభరణం వలె కఠినంగా, బొత్తిగా తెలియకుండా ఉంటుంది. అర్థంకాక (అయ్యో+ ఓ, మాయ్యో (మా+అయ్యో) అన్నట్లుగా) అయ్యో! మా(అ)య్యో గా ఉంటుందని భావం.

కాగా, దీన్ని, ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన సహిస్తాడా? వెంటనే అవునయ్యా! కవీ! (సీం) ద్రా! నిజమే. ఆ ఆంధ్రకావ్యం, సంక్లిష్టమైన సంస్కృతమనే అరణ్యంలో తిరిగే పండితులనే మదమత్తేభములకు (మా ఆంధ్రం) కట్టిపడవేయుటకు ఇనుపసంకెలల వంటిది సుమా! - అంటచేత, ఆపండితుడు కూడ దిమ్మతిరిగి, పలాయనమంత్రం పఠించాడట!

వి.1. సంస్కృత పండితుడు గీర్వాణం (గీః+బాణం = వాక్కనే బాణం) వేసి, గర్వం చూపగా, తెలుగు పండితుడు పెద్దన, తెలుగు మీరిన(వి(ర)వీగిన) తెలివిడి (జ్ఞానం) చూపి, చవుదెబ్బకొట్టాడు.

2 గీర్వాణ - గీర్-బాణ - ఇక్కడ ''వ-బ'' లకు అభేదాన్ని గమనించాలి. కనుక గీర్బాణ = గీర్వాణ అయినది.

60.శ్లో. అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్యసన్నిధౌ ।
అనాచారభయం నాస్తి తిష్ఠన్ మూత్రస్య సన్నిధౌ ॥

సం పూర్వం రాయలవారి ఆస్థానంలో అప్పలాచార్యులనే గొప్ప వ్యాకరణ పండితుడు ఉండేవాడని, ఎవరెన్ని అపశబ్దాలు ప్రయోగించినా, తన వ్యాకరణ పాండిత్యంతో, వాని నన్నిటినీ సుశబ్దాలుగాచేసి, చూపించేవాడని ప్రసిద్ధి. కొద్ది మంది మాత్రం అతడు వ్యాకరణ జ్ఞాన శూన్యుడని, అన్నీ అపశబ్దాలే పలికేవాడని, ఇక అతని వద్ద అపశబ్దాలంటే, ఎవరూ భయపడేవారు కారట - అని అంటారు మరికొందరు.

ఈ శ్లోక పూర్వార్ధాన్ని అచ్చటి పండితులు ఉదాహరించుచుండగా, మన వికట కవి రామకృష్ణుడు దాన్ని ఎగతాళి చేస్తూ, నిలుచుండి మూత్రవిసర్జన (ఉచ్చపోసే) వాని దగ్గర, ఇక అనాచారమంటే భయమేముంటుంది ? - అని, ఉత్తరార్ధాన్ని పూరించాడట

ఆచారపరుడు ఒకచోట చాటుగా, స్థిరంగా కూర్చుండి, జందెమున్నచో చెవికి తగిలించి , వంటికి, బట్టలకు, కాళ్ళకు తగలకుండా, కూర్చుండి,మూత్రమును విడిచి, ఈ వలకు వచ్చి, కాళ్ళు, చేతులు, ముఖం మొ. శుభ్రంగా కడుగుకొని, పుక్కిలించి ఊచేవాడు.

ఇక, అనాచారి కూర్చుండుటకు బద్ధకించి,(ప్యాంటు చెరిగిపోతుందనే భయంతో కూడ) కాళ్ళపై, బట్టలపై, మూత్రం చిందుచున్నా లెక్కచేయక, నిలుచుండియే మూత్రోత్సర్జన చేస్తాడు. ఇట్టివాని వద్ద ఆచారం, సత్సంప్రదాయం గురించి చర్చించినా, ఆలోచించినా వ్యర్థమని భావం.

61.శ్లో. విప్రా స్మి న్నగరే మహాన్ కథయ కః? తాల ద్రుమాణాం గణః,
కో దాతా? రజకో దదాతి వసనం, ప్రాత ర్గృహీత్వా నిశి ।
కో విద్వాన్. పరదారవిత్తహరణే సర్వే ఽ పి విద్వత్తమాః
క (య) స్మా జ్జీవసి హేసఖే! విష(క్రిమి న్యాయేన జీవా మ్యహమ్ ॥

సం. క్రొత్తగా వచ్చినవాడు ఆ నగరవిశేషాలను ఒక నాగరికుని గూర్చి ప్రశ్నించుట.

ప్ర. 1 ఓ బ్రాహ్మణుడా! ఈ నగరంలో ఉన్నతుడు గొప్పవాడెవడో చెప్పు?

ఉ. గొప్పవారెందుకులేరండీ! తాటిచెట్ల గుంపు బాగా ఎత్తుగా, గొప్పగా పెరిగిందండీ.

2. మహాదాత ఎవరైనా ఉన్నాడా? ఉ. చాకివాడే మహాదాత, ఉదయం మురికి బట్టలు తీసుకొనివెళ్లి, శుభ్రంగా ఉతికి, రాత్రికి తెచ్చి, దానం చేస్తూ ఉండేదాత.

3. పండితుడెవడైనా ఉన్నాడా? ఉ. లేకేమి? పరులభార్యలను, పరధనాలను చెరచి, దోచుకొని అనుభవించటంలో, నగరవాసులంతా మహాపండితులండీ.

4. ఇట్టి నీచ, నికృష్ట నగరంలో నీ వెట్లా ఉంటున్నావయ్యా!

ఉ. విషంలో పురుగు( క్రిమి) నివసిస్తూ బ్రతికి ఉండటంలేదా? ఆక్రిమి మాదిరిగానే పాపభూయిష్ఠమైన ఈ నగరంలో నేను కూడ జీవిస్తూఉన్నాను.

వి. శ్లోకంలోని మహాప్ విశేషణం అన్ని ప్రశ్నలకు అనుసంధించుకొనవలెను.

**62.శ్లో.** ఇయం సురతరంగిణీ, న పున రత్రనౌ సంగమః,
భనే త్తరణి మజ్జనం పథిక! నైవ పాంథాగమః।
నిధాయ హృదయే సదా విపులచారు కుంభ ద్వయం
సఖే! ఘనఘనాగమే ఘనరసస్య పారం వ్రజ ॥

సం పద్యంలో ప్రశ్నలు లేకున్నా, అంతకుముందే, ఈ పవిత్ర గంగానదిలో స్నానం చేసి, దాటిపోవచ్చునా? అను బాటసారి ప్రశ్నమూహించిన జారిణీ యొక్క సమాధానము. అంతేకాక, ఆజాణ తన అభీష్టాన్ని అన్యాపదేశంగా అందిస్తోంది కూడ.

ఓ బాటసారీ! ఇది దేవతలనది యగు గంగ. (సుర-తరంగిణి) ఇక్కడ పడవల-నౌకల (నౌ=నౌకా-సంగమః) రాకపోకలుండవు. నదిలో ఈదుటకు, స్నానానికి, కూడా ఎవ్వరూ రారు. విశాల మనోహర కుంభాలుండు ప్రదేశాలను, అదిగో, అక్కడ దట్టంగా వ్యాపించియున్న ఆ మేఘమాలాడంబరాన్ని కూడ బాగా చూచి, ఈ నదీ జలము(ఘనరసము) యొక్క ఆవలివైపుకు దాటిపొమ్ము. జారిణిగనుక, అన్యాపదేశంగా, శ్లేషతో తన అభీష్టార్థాన్ని ఇట్లు తెల్పుతోంది.

మిత్రమా! అలలతో, పడవలతో నిండియున్నందున ఈదుటకు, స్నానానికిగాని ఇక్కడికి ఎవ్వరూరారు అందమైన, విశాలమైన కుంభాలవంటి (నా) స్తనాలను, ఆపైన గాఢమేఘాడంబరాలను ఇవన్నీ నాస్తవాలేగనుక చెప్పుచున్నాను. వానినన్నీ విని జాగ్రత్తగా ఆలోచించుము. అపాయం మూడుతుంది. గనుక, ఇట్టి పరిస్థితులలో వీటినన్నీటినీ విడిచి, ఎలా వెళ్లుతావు?

ఇకనేనా సంభోగసంపదనందించి, నానావిధరతులతో రంజింపజేయుటలో (సురత రంగిణి) ఆరితేరినదానను. ఇక, ఇక్కడే మన కిద్దరికి సంగమం (నౌ= మనకిద్దరికి) (సంగమః= సంభోగము) సంభవిస్తే, ఆనందసాగరం ( తరణి- మజ్జనం) లో, ఓలలాడవచ్చును. ఇంకా, ఇక్కడికి వచ్చిపోయేవారెవరూ ఉండరు.

కనుక, ఈ సాంద్రవర్షర్తువులో, నిగూఢనిబిడ శృంగారాన ంద జలధిలో మునిగి, దానిలోని ఘనసారాన్ని (స్థిరాంశాన్ని) గ్రహింపుముని, ఆనెరజాణ హెచ్చరిక కూడ, ఆమె వక్రోక్తులలో వ్యంగ్యంగా

ప్రకటితమౌతుంది.

వి. జాగ్రత్తగా పరిశీలిస్తే, చిత్రాలంకారాలలో కూడ, వ్యంగ్యచిత్ర ప్రభేదాలు చిత్రింపబడి ఉన్నాయన్న సంగతి ఊరీకృతమౌతుంది.

63.శ్లో. గత ప్రాయారాత్రిః, కృశతను। శశీ శీర్యత ఇవ,
ప్రదీపో యం నిద్రావశ ముపగతో ఘూర్ణత ఇవ।
ప్రణామాన్తో మానః త్యజసి న, తథాపి క్రుధ మహో!
కుచప్రత్యా సత్త్యా హృదయ మపి తే చణ్డి కఠినమ్ ॥

సం బాణ మహాకవి మహామహిమా ప్రతి భా సంపన్నుడు, మయూర మహాకవికి అల్లుడు, బాణుని గార్హస్థ్య జీవితాన్ని కన్నులార గాంచుదామనే ఉద్దేశ్యంతో, ఒకనాటి తెల్లవారు జామున వారి గృహ ద్వార సమీపంలో నిల్చియున్నప్పటి సంఘటన.

ప్రణయకుపితయగు బాణుని భార్య భర్తను ఆ రాత్రికి దరిచేరనీయలేదు. తెల్లవారబోతూ ఉండగ, బాణుడు భార్యనిట్లు సమాశ్వాసించుచున్నాడు.

ప్రేయసీ! మొత్తంమీద, రాత్రంతా గడచిపోతోంది. చంద్రుడు కూడ అస్తమిస్తున్నాడు. నిద్రాక్రాంతమైనట్లు దీపంకూడ కునికిపాట్లు పడుతూ జోగుతోంది. ఎంత ప్రణయ కోపం వచ్చినా, నమస్కారంతో పోవాలి (ప్రణామాంతః) ఈ విధానాలన్నీ మాస్తూకూడ, నీ కోపాన్ని విడువకున్నావు సుమా!

భాణుని ఈ మూడుపాదాలలోని దీనాలాపాలను బైటనుండి వినుచున్న మామయగు మయూరుడు, నాలుగవ పాదాన్నిలా పూర్తిచేసాడట! ఎట్లు? ఓ కోపనశీలా (చండీ) నీ కుంచాలకు దగ్గరగా నుండి స్నేహం చేయటంతో, నీ హృదయం కూడ కఠినమై పోయిందిగాబోలు - అని పూరించాడట!

వి. లనుకోకుండా జరిగిన ఈ పూరణ, ప్రత్యక్షింగా కున్నా, పరోక్షసంవాదంగా పరిణమించింది.

64 శ్లో చిరశ్రాంతో దూరా దహ ముపగతో హంతమలయాత్
త దేకం త్వ ద్గేహే తరుణి! పరిణేష్యామి దివసమ్,
సమీరే ణోక్తైవం నవకుసుమితా చూతలతికా
ధునానా మూర్ధానం, ''నహి, నహి, నహీ'' త్యేవ వదతి ॥

సం. క్రొత్తగా పుష్పించిన చూత (మామిడి) లత అనునాయిక దగ్గరకు, సమీరుడు (గాలి) అనే నాయకుడు వచ్చినాడన్న పరమహృద్యమైన పండితరాయజగన్నాథుని పద్యసౌరభాన్ని కూడ పాఠక మహాశయులు పరమానందంతో ఆఘ్రాణింతురుగాక!.

ఓ గున్నమామిడీ! ఎంతో దూరాననో ఉన్న అమలయ పర్వతం నుండి రావడంతో చాల అలసిపోయాను. ఈ ఒక్క రాత్రి నీ ఇంట్లో ఉండనివ్వు - అని సమీరుడు (వాయుదేవుడు) ఒకనాయకుడు అడుగగా, నవపుష్పితయగు సహకారలత, (అనునాయిక) సహకరింపక ''నహి, నహి, నహీ'' అని మున్మూరు తల తిప్పి, నిరాదరించిందట!

ఇది ప్రస్తుతార్థం కాగా, దీనిలో మరొక అప్రస్తుతార్థం కూడ అభివ్యక్తమవుతుంది సాభిప్రాయాలైన ''తరుణీ, సరణస్యేమి, నవ కుసుమితా, నహి- త్రయ పదాలు'' సహకారాన్నందిస్తున్నాయి. చూతలతికా - సమీర పదాలు స్త్రీలింగపుంలింగాలతో, నాయికానాయకులను వ్యంజింపజేయగా, ఆనాయిక క్రొత్తగా పుష్పవతియైన తరుణీ, ఆమె పరిణయమునకు తగినదే, కావచ్చు. అయితే, ఆమె క్రొత్తగా పుష్పవతి (రజస్వల, పెద్దమనిషి) అయినది గనుక, సమీరుడెంతగా సందడించి, సంభోగించాలనుకొన్నా, మూడు రోజుల వరకు పనికిరాను సుమా! అని, చూతలతిక, ''నహి,నహి,నహి'' అని ముమ్మారు ఊగుతూ నర్మ, వ్యంగ్యంగా స్ఫురింపజేసింది.

వి. సాధారణంగా సంవాదాలు చైతన్యంగల ప్రాణుల ప్రశ్నోత్తరాలుగా ఉంటాయి. ఇక్కడ, ముఖాముఖిగాగాక, సూచనాప్రాయంగా, సంజ్ఞారూపంలో పరమచమత్కారంగా, ప్రత్యుత్తర వ్యక్తీకరణ, పండితరాయల ప్రతిభ ప్రాబల్యానికి పరమ తార్కాణమని గ్రహింపగలను.

65 శ్లో. కుశలం తస్యాః? జీవతి, కుశలంప్పృచ్ఛామి? జీవతీ త్యుక్తమ్ ।

పున రపి తదేవ కథయసి? మృతాం ను కథయామి యా శ్వసితి ॥

సం. ప్రణయక'పంత' పరుగత్తి, పిమ్మట పశ్చాత్తాపపడుచున్న ఒక నాయికాసఖికీ, ఆనాయకునకు జరిగిన సంవాదము.

నాయకుని ప్రశ్న 1. ఆ నాప్రియురాలగు నాయిక క్షేమంగా ఉన్నాదా?

సఖి సమాధానం: ఆ, ఇంకా జీవించియేయున్నది (జీవతి)

2. నేను ఆమె క్షేమాన్ని గురించి అడుగుచున్నాను. ఉ. ''జీవతి'' అని చెప్పాను గదా

3 మరలా బ్రతికియే ఉన్నాదంటున్నావు (ఆమె బ్రతికియున్న, కుశలంగా ఉన్నదా? అని నా ప్రశ్న). ఉ. అయ్యా! ఆ పశ్చాత్తప్త యగు నాయిక, నేను వచ్చునప్పుడు కూడ, ఉచ్ఛ్వాసనిశ్వాసములను విడుస్తూనే ఉన్నది. అలా గాలిని పీలుస్తూ, విడుస్తూ బ్రతికి ఉన్న దానిని పట్టుకొని, చచ్చినది అని ఎలా చెప్పుమంటారు మహానుభావా! నిజంగా చచ్చి నప్పుడే, బహుశః ఆమెకు కుశలత కుదురుతుందేమో!

66 శ్లో. ప్రశ్నోత్తరాన్తరాభిన్న ముత్తరం చిత్ర ముచ్యతే ।

కే దార పోషణ రతాః? కే ఖేటాః? కిం చలం? వయః ॥

ప్రశ్న దాని ప్రత్యుత్తరాలు రెండూ సమానం (అభిన్నం)గా ఉంటే, అది చిత్రాలంకారం.

ఈ శ్లోక ఉత్తరార్థంలో మూడు ప్రశ్నలు, ఉత్తరాలు ఉన్నాయి. ఇంకా విశేషమేమి టంటే అవన్నీ అభిన్నంగా కూడ ఉండటం విశేషోత్తరం. ఎట్లు?

ప్ర 1. కే- దార-పోషణరతాః? = ఎవరు భార్యను (సంతానాన్ని) పోషించుట యందు ఆసక్తిగలవారు? అని ప్రశ్న అదే ఉత్తరం కూడ అగుచున్నది. ఎట్లు?

ఉత్తరంః కేదార- పోషణరతాః = ఎవరు వ్యవసాయక్షేత్రాలను (కేదారం...) చక్కగా పోషిస్తారో, వారే తమ భార్యా, పుత్రులను కూడ పోషింపగలుగుతారని, వ్యవసాయ ప్రాభవం ప్రకటితమైనది.

2. కే-ఖేటాః = ఏవి- ఆకాశంలో తిరుగుతాయి? 3 కిం చలమ్ = ఏది - చంచలమైనది? ఈ 2, 3 ప్రశ్నలు రెండింటికి ''వయః'' (పక్షులు, వయస్సు ప్రాయము) అనునదొక్కటే ప్రత్యుత్తరమగుట

ప్రభా పోత్పాదకము. ఎట్లు?

''వయః'' అనునది రెండవ ప్రశ్నకు ప్రత్యుత్తరమైనపుడు, ఇకారాంత-పుంలింగ ప్రథమా బహువచనము ''వి - వీ- వయ '' (హరి శబ్దము వలె) లని ప్రథమా- ఏక- ద్వి-బహువచనములు. కనుక ''వయః'' బహువచనంగా పక్షులు అనే అర్థంలో, ''కే ఖేటాః'' అను ప్రశ్నకు ప్రత్యుత్తరమైనది.

ఇక,'' కిం చలం '' అను మూడవప్రశ్నకు, సకారాన్త- నపుంసలింగ- ఏకవచనంగా( ప్రథమా విభక్తి) ''వయః- వయసీ- వయాంసి'' అను ఏక- ద్వి- బహు- వచన రూపాలలో మొదటిదగు ప్రథమైకవచనం ''వయః'' ప్రత్యుత్తరమైనదని తెలిసిడి. బాల్య, యౌవనాది అవస్థలు స్థిరంగానుండక, క్షణ క్షణం మారుతూ, చంచలంగా ఉంటాయి గదా!

మొత్తం మీద, 1వ ప్రశ్నకు ''కేదారపోషణ'' అనే పదం, భిన్న పద విభాగంతో ప్రత్యుత్తరం కాగా, 2, 3 ప్రశ్నలకు ''వయః'' అనునది ఒక్కటే, భిన్నలింగ, వచన భేదంతో ప్రత్యుత్తరమై, చమత్కారాన్ని చెందిస్తోంది. ఇలాంటి, అభిన్న (సమాన) ప్రశ్నోత్తరాలు, ఇతరభాషలలో ప్రాయశః ప్రబలంగా అన్వేషించి, పరిశోధిస్తేగాని, దొరకవంటారు. అది సంస్కృత భాష యొక్క గీర్వాణము కాబోలు! అలం అతివిస్తరేణ!

67.శ్లో. స్మర్తవ్యా వయ మిందు సుందరముఖి! ప్రస్తావతోఽపి త్వయా?
స్యా దేవం - యది నాథ! దాస్యతి విధిః, జాతి స్మరత్వం మమ
ఏకస్మి న్నపి జన్మని ప్రియతమే! జాతి స్మరత్వం కుతః?
ప్రాణాః పాంథ! సమం త్వయైవ చలితాః, క్వా ద్యాపి జన్మైకతా? ॥

సం. ప్రియా ప్రియుల సంభాషణ.

ప్రియుని ప్రశ్న 1. చంద్రముఖీ! ఎప్పుడైనా కనీసం ఏ ప్రసంగాలలోనైనా, నన్నుకూడ, కొంచెం తలుస్తూ ఉండు.

ప్రేయసి ప్రత్యుత్తరం: నాథా! దేవుడు నాకు పూర్వజన్మస్మృతిని, మరుజన్మలో కూడ కలుగజేస్తే, అలాగే తప్పకుండ స్మరించడం జరుగవచ్చును (లే)

2. ఈ ఒక్క జన్మలోనే పూర్వపు పుట్టుకను గురించి స్మరించడం ఎలాసాధ్యం?

ఉ. ప్రియా! నీవు బాటసారివై వెళ్ళినంతనే, నీ విరహంతో, నీతో పాటే, నా ప్రాణాలు కూడ పోతాయి. ఇక, మరణించిన తరువాత, ఈ ఒక్క జన్మలోనే నిన్ను స్మరించడం ఎలా కుదురుతుంది? కనుకనే, బ్రహ్మ మరుజన్మలో కూడ నాకు పూర్వజన్మ విషయాలను గుర్తించే శక్తినిస్తే, నిన్ను తప్పకుండా స్మరిస్తానని చెప్పుచున్నాను.

వి ఆ ప్రియా ప్రియుల ప్రణయం, గాఢాను రాగిత్వ మట్టిది కాబోలు!

68.శ్లో. రేరే పాంథ!, కుతో భవాన్? నగరతః, వార్తా న చా పి శ్రుతా?
బాఢం బ్రూహి, యువా పయోదసమయే హిత్వా ప్రియాం జీవతి।
సత్యం జీవతి? జీవతీతి కథితా వార్తా మయాపి శ్రుతా
విస్తీర్ణా వ్యథినీ, జనోఽపి వివిధః, కిం కిం (నా) న సంభావ్యతే? ॥

ప్ర.1. ఓయీ బాటసారీ! ఎక్కడ నుండి వస్తున్నావు? ఉ. పట్టణంనుండి.

2. ఈ వార్త నీ చెవిని పడలేదా? ఉ. అదేదో, వివరంగా, సరిగా చెప్పుమా!

3 ఏమీ లేదు, ఈ పయోద (మేఘ) + ఆవృత వర్షాసమయంలో, జంటగా నుండక, ఒకప్రియుడు తన ప్రియురాలిని విడిచి, వెళ్ళి, ఆవియోగంతో చావకుండా, ఇంకా బ్రతికే ఉన్నాడట! ఈ వార్తను నీవు వినలేదా? ఉ. నిజంగా, ఇంకా బ్రతికే ఉన్నాడా? అని

4. బ్రతికే ఉన్నాడు- అనే వార్తనే, నేనూ విన్నాను. కాని వానిని మాత్రం చూడలేదు సుమా!

ఉ. అవునులే! పృథివి ఎంతో విశాలమైనది. ప్రజలా-పరిపరివిధాలుగా పల్లవిస్తూ, ఆలోచిస్తూ ఉంటారు అప్పుడు, ఎక్కడెక్కడ? ఏ ఏ కాలంలో, ఏ ఏ విషయం సాధ్యంకాకుండా ఉంటుంది? ఇలాంటివి, ఇంకా ఈ భూప్రపంచంలో ఎన్నో జరగవచ్చు (వినకుండా ఉంటామా?) - అని ఆ ఆగంత (వచ్చినవాడు) నిట్టూర్చాడట!

వి. ప్రియా, ప్రియులగాఢనిర్భర ప్రేమ, అన్యోన్య ''సుమానుషము'' (దాంపత్యము) అట్టిది కాబోలు!

69.శ్లో. అహో! కే నేదృశీ బుద్ధిః దారుణా తవ నిర్మితా?

త్రిగుణా శ్రూయతే బుద్ధిః, న తు దారుమయీ క్వచిత్ ॥

సం. ఇద్దరు పండిత మిత్రుల సంభాషణ.

ప్ర 1. ఆహా! ఇంత భయంకరం (దారుణా) గా, నీ బుద్ధి నెవరు సృష్టించారయ్యా!

ఉ. అదేమిటయ్యా! అట్లా అంటావు? బుద్ధి ఎప్పుడూ సత్త్వ, రజస్, తమో గుణాత్మకంగా అనగా - త్రిగుణాత్మకంగా, ఉంటుందని విన్నాముగాని, నీ వన్నట్లు, కొయ్యతో (దారుణా) నిర్మింపబడినట్లుగా, ఎప్పుడూ వినలేదే. అని వ్యాజోక్తితో చమత్కరించెను.

వి. ప్రచ్ఛకుడు, దారుణా = భయకరమైనది - అనే అర్థంలో, ఆకారాన్త స్త్రీలింగ, ''దారుణా'' శబ్దాన్ని, ప్రథమైక వచనంగా, బుద్ధికి విశేషణంగా, (దారుణా - బుద్ధిః) వాడినాడు. కాని, సమాధాత (రిసీవర్) దానిని, అనగా దారు (=కొయ్య) అను ఉకారాన్త (పుం-న పుం) శబ్దము యొక్క తృతీయైక వచనముగా గ్రహించి, కొయ్యతో అనే అర్థాన్ని వక్రోక్తి భంగీభణితితో లాగి, తన పాండిత్య ప్రకర్షతో చమత్కరించెను.

వి. దీనిని అనిక్షిప్తశ్లేషవక్రోక్తి కి ఉదాహరణంగా, అప్పయ్యదీక్షితులు, ''కువలయానందం'' లో చూపెను.

70.శ్లో. పలాశ కుసుమ భ్రాన్త్యా శుకతుండే పత త్యలిః

సోఽపి జమ్బూ ఫలభ్రాన్త్యా త మలిం హర్తు మిచ్ఛతి ॥

అనగనగా - ఒకచెట్టు. దానిపై ఒక చిలుక కూర్చుండగా, ఒక నల్లని తుమ్మెద, వంకరగా ఎర్రగా నున్న ఆచిలుక ముక్కును చూచి, బహుశః అది మోదుగ పువ్వు - అనుకొని, ఆశపడి దానిపై వ్రాలబోయింది. ఇంతలో, ఆ చిలుక కూడ, పైనుండి, నల్లగా నేరేడుపండు (వల) వచ్చి, మీద పడుచున్నదని తలచి, ఆతుమ్మెదను గ్రహించాలని భ్రాంతిపడి, నోరుతెరుచుకొన్నదట!

వి.1. వస్తుతః, దీనిలో సంవాదం లేదు. రెండింటిలో ఏ ఒక్కటో భ్రాంతిపడక, రెండూ ఒక్కసారిగా భ్రమపడి, పరస్పరము గ్రహింపగోరుచున్నవని, దూరస్థుడగు కవి, వాని మనోవికారము నిట్లు చక్కగా,

చమత్కారించి మాపుట పవిత్రాంతరము.

2. సంవాదంగాని సంవాదం - గా ఉన్న, దీనిని అప్పయ్య దీక్షితుడు ''భ్రాంతిపుదలంకారాంతరం''గా విశ్లేషించి, వివరించాడు.

71.శ్లో. కాన్తా కటాక్ష దగ్ధానాం నర వైద్యం కి మౌషధమ్?

దృఢ మాలింగనం పథ్యం క్వాథ శ్చాధర చుమ్బనమ్.

ఒక రసికుడు ఒక వైద్యు నిట్లు ప్రశ్నించాడట! అయ్యా! డాక్టరుగారూ! ప్రియురాలి యొక్క- నిప్పులు చెరిగే క్రీ గంటి మాపులతో దహింపబడిన, కాల్చబడుచున్నవారికి, ఏదైనా ఒక మంచి మందు చెప్పండి- అని అడిగాడట!

ఉ. ఆ వైద్యుడు కూడా చతురుడు కావడంతో, తన భైషజ్యాన్ని ప్రదర్శిస్తూ, అయ్యా! ప్రత్యేకంగా మందేమీ అక్కర్లేదండీ! గట్టిగా కౌగిలించుకుంటే చాలు. ఆమందుతో వళ్ళు వేడితగ్గి, చల్లబడుతుంది.

2. అయితే, దానికేదయినా ''అనుపానం'' కూడ చెప్పండి.

ఉ ఇక ఏమి అక్కర్లేదు. ఆమె అధరాన్ని (పెదవిని) అంటి పెట్టుకుని గట్టిగా ముద్దుపెట్టుకుంటే, అదే, అనుపానంగా, కషాయంగా కూడ, పనిచేస్తుంది - అని హాస్యంగా హెచ్చరించాడట!

వి. మానసిక వైద్యుల మాన్యత అట్టిది మాటలతోనే పట్టేసి, మాన్యమైన మందును సూచిస్తారు.

72.శ్లో. క్షేమేణ వ్రజ బాంధవాన్, నను మయా లబ్ధో భవాన్ బాంధవః,

స్మర్తవ్యో ఽస్మి కథాంతరేషు భవతా, స్వాత్మా పి విస్మార్యతే ।

త్వాం రక్షన్తు పథి ప్రయాన్త మమరాః, సంరక్షితో ఽ హం త్వయా

స్వైర్భాగ్యైః పరిరక్షితో ఽ సి, నను హే తత్రా పి హేతు ర్భవాన్ ॥ మృచ్ఛ

సం. ఇది శూద్రక మహా కవి కృత ''మృచ్ఛకటికం'' లోని చారు దత్త- ఆర్యకుల సంభాషణ

చారుదత్తుడు: మిత్రమా! ఆర్యక! క్షేమంగా బంధువుల దరిజేరుము

ఆర్యకుడు. (ఇతరబంధువుల సంగతి సరే!) నేడు నీవే నాకు గొప్ప బంధువుగా దొరికినావు

చారు. ఆయా కథా, సంభాషణల సందర్భాలలో నన్నుకూడ ఒక్కసారి గుర్తుకు తెచ్చుకొనుము.

ఆర్యా: (అయ్యా! మనది ఆత్మబంధుత్వం) నిన్ను తలంచకపోతే నన్ను నేను మరచినట్లే. కనుక, నిన్ను మరవటం జరగదు సుమా!

చారు: దారిలో నిన్ను ఆ దేవతలు రక్షింతురుగాక!

ఆర్యా: (ఇంకెక్కడి దేవతలు?) నీవే నన్ను రక్షించుటకు అవతరించిన దేవతవు.

చారు: అలాకాదు, నీ అదృష్ట సందోహమే నన్ను రక్షించినది.

ఆర్య: కావచ్చు, అయినా ఇక్కడ కూడ, దానికి, నీవే ముఖ్యకారణం సుమా!

వి. ఇక్కడ చారుదత్తుని దయార్ద్రహృదయం, ఎన్ని ఆపదలు రానున్నా, భయపడక ఆశ్రిత- మిత్ర సంరక్షణం చేసి పంపడం, ఆర్యకుని కృతజ్ఞత- సంభావ్యాలౌతున్నాయి.

73.శ్లో. విద్య యాస్తి సహ కో ఽ త్ర విరోధీ?

కా మునే రపి మనో మదయంతి? ।

రావణ శ్చ భృశ మీర్ష్యతి కస్మై_?

కావ్య మాహు రస్మృత ప్రతిమం కిమ్?

ప్ర 1 విద్యకు విరుద్ధమైనదేది ఉ. రాః = ధనము (ద్రవ్యము) సరస్వతి ఉన్నచోట లక్ష్మి ఉండదు.

2. మహర్షుల మనస్సున కూడ మత్తు, ముత్తు (సంతోషము)ను పుట్టించునదెవతె?

ఉ. రామా = అందగత్తె ''సున్దరీ, రమణీ, రామా'' - అని అమరకోశము

3. రావణుడు ఎవరిపై ఎక్కువ ఈర్ష్య కల్గియుండును?

ఉ. రామాయ = రాముని కొరకు- రామునిపై అని భావం.

4 అమృతతుల్యమైన కావ్యం ఏది? ఉ. రామాయణం = వాల్మీకి కృత రామాయణము. అది అమృత సమానమగు ఆది కావ్యమని భావం

వి. మొదటి ప్రత్యుత్తరం ''రా'' కాగా, తరువాత, ''మా'' చేర్చి, రామా, ఇట్లే ''య-ణ'' లను చేర్చగా ''రామాయ, రామాయణం'' గా, ఒకొక్క అక్షరం వృద్ధిచెందుచూ ప్రత్యుత్తరమైనందున, ఇది, ''వర్ధమానాక్షరమ్'' అను దానికి కూడ ఉదాహరణమగుచున్నది.

74.శ్లో. పూః కీ దృక్? కా మాధవేష్టా? యతే ర్వాక్ కీ దృక్? కం పా హీశ్వరే ల్యాహ భక్తః ?

ఆదే రాదే రుద్ధృ తైకైక వర్ణః శబ్ద స్తేషా ముత్తరం నైన మున్తే।

వి. పద్యంలోని నాల్గు ప్రశ్నలకు ''రామారామా'' ఒక్కటే ప్రత్యుత్తరము. ఎట్లనగా- దానిలోని మొదటి ఒక్కొక్క అక్షరాన్ని క్రమంగా, తగ్గిస్తూ పోయినచో ''మారామా, రామా, మా,'' గా విభక్తములై, ప్రత్యుత్తరములగుచున్నవి.

ప్ర 1. పట్టణ మెట్లున్నది? ఉ. రామా రామా = 1రామ + ఆరామా 2. రామా + ఆరామా 3. రామా - రామా = 1 అందమైన తోటలతో గూడి యున్నది. 2. సుందరభామలతో నిండిన ఉపవనాలు గల్గియున్నది.

3. ''అందంగల'' సుందరిమణులు గల్గియున్నది- - -

2. విష్ణువునకు ఇష్టురాలెవరు? ఉ. (''రా'' ను తగ్గింపగా) మారామా= రమాసుందరి, లక్ష్మి

3. సన్యాసి మాట ఎట్టిది? ఉ. మొదటి ''రా-మా'' అనే రెండక్షరాలు పోగా, మిగిలిన ''రామా= రాః, మా= ధనము, వద్దు'' అనగా ధనాశ పనికిరాదని సన్యాసి భావం.

4. భక్తుడు ఎవరిని రక్షింపుమని భగవంతుని కోరును?

ఉ. మా (=నన్ను). ఇది అస్మద్ శబ్దం యొక్క ద్వితీయైక వచనం (మామ్- మా) ఆది నుండి క్రమంగా ఒక్కొక్క అక్షరం తగ్గించుటచే, ఇది ''హీయమానాక్షర'' మైనది.

75.శ్లో. సంబుద్ధ్యసి కథం దేవి? కే మస్త్యర్థం క్రియాపదమ్?

శోభా చ కీదృశీ వ్యోమ్ని? భవతీ దం నిగద్యతామ్ ॥

వి. పద్యంలోని ప్రశ్నలు మూడింటికి ''భవతి'' ఒక్కటియే సమాధానం.

ప్ర.1. ఓ దేవీ! నీవేమని సంబోధింపబడుదువు? 2. అస్తి- అను అర్థమును దెల్పు క్రియాపదము ఏది?

3. ఆకాశములోని శోభ ఎట్టిది?

ఉ. 1. దేవిని ''భవతి!'' అని సంబోధింతురు ఈ ''భవతి''- ''భవతి'' శబ్దము యొక్క సంబోధన

ప్రథమా విభక్తి ఏకవచనము. ఓ పూజ్యురాలా! అని అర్థం.

ఉ. 2. సత్తార్థమును దెల్పు క్రియా పదము ''భవతి'' (ఉండుట). అనునది. ఇది ''భూసత్తాయాం'' (ఉండుట) అను ధాతువు యొక్క- ''వర్తమానే లట్'' యొక్క, ప్రథమ పురుష, ఏకవచనము.

ఉ. 3. భవతి (=నక్షత్రములు గల(ది)) ఆకాశము శోభించును.

''భం'' అనగా నక్షత్రము. ''భం-భే-భాని'' భాని (నక్షత్రాలు) అస్మిన్ సన్తీతి = భవతి (=నక్షత్రములు గలది- ఆకాశము) ''నక్షత్ర మృక్షం భం తారా-తారకా ప్యుడు (వా స్త్రియామ్)'' అని అమరకోశము

వి. ఈ - ''భవతి'' లనే ప్రత్యుత్తరం, శ్లోకంలోనే ఉన్నను, కప్పబడి ఉండుటచే ఇది ''నిహ్నుతైకాలాపకము'' నకు కూడా ఉదా: అగుచున్నది.

76 శ్లో. జలై ర్విరహితా శుష్కా- సరసీ కీదృశీ భవేత్?

అత్రోత్తరం యత్, ప్రశ్నం స్యాత్- వనితే త్యుత్తరస్య తత్ ॥

వి. ఇదొక విచిత్ర సంవాదప్రశ్నము. పృచ్ఛకుడు, మొదట తాను అడిగిన ప్రశ్నకు, సమాధాత దేనిని సమాధానంగా చెప్పుచున్నాడో, ఆ సమాధానమే ''వనితా'' అను ప్రత్యుత్తరమునకు ప్రశ్నగా కూడ కావలెనని విషమషరతును విధించుచున్నాడు. అందుచే జాగ్రత్తగా ఆలోచించి చెప్పవలెను.

ప్ర.1. నీరు లేక ఎండిపోయిన సరస్సు ఎట్లుండును?

ఉ. దీనికి ప్రత్యుత్తరము: ''అబలాకా'' అను బైటనుండి తేబడిన పదము అబలాకా = బలాకలు (కొంగలు) లేనిది. ఎండిన సరస్సులో చేపలుండవు కనుక అక్కడ కొంగలు కూడ ఉండవని భావము.

2. ఈ ''అబలా కా'' అను ప్రత్యుత్తరమే, రెండవ ప్రత్యుత్తరమగు ''వనితా'' అను సమాధానానికి ప్రశ్నగా కూడ కావడము అను షరతులో ప్రశ్న.

ఉ. ప్రస్తుతం, ఈ ''అబలాకా'' అను ప్రత్యుత్తరాన్ని, ''అబలా-కా'' (=కా-అబలా?) అని విడదీసి బలముతక్కువ గలది ఎవరు? అని ప్రశ్నగా మార్చినచో-

ఉ. ఈ ''అబలాకా'' అను ప్రశ్నకు, వనితా (=స్త్రీ) ప్రత్యుత్తరమగుచున్నది. ఇట్లు పై విషమ షరతుకు లోబడి, సమాధానం చెప్పబడినది.

వి. ఇక్కడ, అబలా= బలము లేనిది - అను అర్థము చెప్పుటకంటే, ''నఞర్థాః షట్ ప్రకీర్తితాః'' (''న'' కు ఆరర్థాలు చెప్పబడినవి) కనుక పురుషుని కంటె కొంచెం తక్కువ బలము కలది. అను అల్పార్థక నఞర్థకముగా చెప్పుట సమంజసమగును.

77. శ్లో. సంపత్కామాః కీ దృశాః? కా మృ ద్వ్యః? మణ్యశ్చ కీ దృశాః?

కం శ్రితో యుద్ధకామః స్యాత్? ''సారంభాః'' చతుర్ష్వోత్తరమ్,

వి. శ్లోకంలోని నాల్గు ప్రశ్నలకు ''సారంభాః'' అను పదం, ''రంభాః, సాభాః, సారం'' గా కూడ ప్రత్యుత్తరమౌతుందని గమనింపవలెను.

ప్ర.1. ఐశ్వర్యమునుగోరు వారెట్లుందురు? ఉ. సారంభాః ఆరంభించి పనిచేయుటకు ఉద్యుక్తులై ఉందురు. ఈ మూడక్షరాల పదం ఇక్కడ విడదీయబడకనే, పూర్ణాక్షరాలతో ప్రత్యుత్తరమైనది.

2. మృదువైనవి ఏవి? ఉ. ''సారంభాః'' లోని మొదటి అక్షరమగు ''సా'' ను చ్యుతం చేసిన, మిగిలిన

''రంభా'' (= అరటిచెట్లు) ప్రత్యుత్తరిస్తాయి.

3 మణులు ఎలా ఉంటాయి? ఉ ''సారంభాః''- లో మధ్యలోనున్న ''రం'' అక్షరాన్ని తొలిగించిన, ''సాభాః'' (= కాంతిగలిగి ఉంటాయి ) సమాధానమౌతుంది.

4 దేనిని నమ్ముకుని యుద్ధాన్ని కోరుకుంటాడు?

ఉ. ''సారంభాః'' లో చివరనున్న ''భాః'' ను చ్యుతం చేసిన, మిగిలిన ''సారం'' (=బలము, స్థిరాంశము) పదము ప్రత్యుత్తరమౌతుంది. తన సైన్యాది బలాన్ని (సారం) నమ్ముకుని యుద్ధం చేయగోరును

వి. పూర్వ శ్లోకములలో వలె, దీనిలోనూ, ప్రత్యుత్తరము ఇయిడియున్నది ఇక్కడ, క్రమంగా ఒక్కొక్క అక్షరాన్ని పెంచటంగాని, లేక వృద్ధిచేయడంగాని, లేక తగ్గించడం గాని, జరుగలేదు. ''సారంభాః'' అను ఒక పూర్ణశబ్దంలోని అక్షరాలను అక్రమంగా తొలగించి, ప్రత్యుత్తరాలు చేయటం- దీనిలోని విశేషము. అక్షరాలు అన్నీ పూర్ణంగా తొలిగింపబడినందున, ఇది ''పూర్ణచ్యుతక'' ఉదాః గా కూడ అగుచున్నది

78.శ్లో. అలం కః? కే? మదోదగ్ర కుంభ కుంభి విదారణే?

అనయోః కవిభి ర్వాచ్యం ప్రశ్నయో రేక ముత్తరమ్ ॥

శ్లోకం లో ''కః ( ఏది) కే (= ఏవి)'' అను రెండు ప్రశ్నలున్నవి ఈ రెండింటికీ ఒకే ప్రత్యుత్తరం చెప్పాలని, మరొక విషయం ప్రశ్న. కః= ఏక-, కే = బహు, వచనాలు.

ప్ర 1. మదముతో బలిసి ఏనుగుల కుంభస్థలమును చీల్చుటలో సమర్థమైనది ఏది?

(కః?) ఈ ప్రశ్న ఏకవచనంలో నున్నది.

2. మత్తేభ కుంభస్థల విదారణలో సమర్థములైనవేవి? - అనునది బహువచన ప్రశ్న ''కః -కౌ-కే'' - ప్రథమా విభక్తి ఏకవచనం ''కః'' కాగా, ''కే'' అనునది కిం శబ్ద బహువచనం గదా! ఈ రెండు ప్రశ్నలకు ''మృగరాజ'' అనునదొక్కటే ప్రత్యుత్తరమై నిల్చినది. ఎట్లు? 1 వ ప్రశ్నకు ప్రత్యుత్తరమైన ''మృగరాజః = మృగాణాం రాజా = మృగరాజః (సింహము)'' అను నది ఏకవచనంగానే సమాధానమైనది.

2వ బహువచన ప్రశ్నకు ''మృగాణాం రాజా మృగరాజః (=సింహములు)'' సమాధానములగుచున్నవి ఎట్లు?

వి.1. వస్తుతః, నకారాంతమైన ''రాజన్'' శబ్దము ''రాజాహః స్సఖిభ్యష్టచ్ (5 4 91)'' అను పాణిని సూత్రంచే, తత్పురుష సమాసాంతమైనపుడు ''టచ్'' ప్రత్యయం వచ్చి ... ''రాజః'' గా మారి, అకారాంత శబ్దముగా మారుతుంది కనుక, ''మృగాణాం రాజా= మృగరాజః'' అయినది.

2 ఈ రాజన్ శబ్దం కాక, ''రాజు'' అనే అర్థాన్ని తెలుపు, జకారాంత ''రాట్'' అను మరొక శబ్దం కూడ కలదు దీని ప్రథమా విభక్తికి ''రాట్ - రాజౌ - రాజః'' అనేవి ఏక - ద్వి - బహువచనములు అప్పుడు, ''మృగరాట్ - మృగరాజౌ - మృగరాజః'' కాగా, ఈ మృగరాజః (=సింహములు) బహువచనమై, విషమస్థితులను ఎదుర్కొని ప్రత్యుత్తరమగుట విశేషాంతరము

3. వచన మాత్ర భిన్నతచే ప్రత్యుత్తరమైనందున, ఇది ''వచనమాత్ర భిన్నము'' నకు కూడ ఉదా. అయినది.

79.శ్లో రాగీ భినత్తి నిద్రాం, తల్పం న జహాతి, విస్మరం దశతి ।

చతురే! కిం ప్రాణేశః? , నహి, నహి, మత్కుణవ్రాతః ॥

ప్ర 1. సఖీ! అనురాగంతో నిద్రా భంగం కల్గిస్తుంది. పడకను విడిచిపెట్టదు గట్టిగా కరుస్తుంది- ఇత్యాదిగా, నాయిక చెప్పుకొని పోవుచుండ, నిన్ను చెలికత్తెకు సందేహం కల్గి, ఓ చాతుర్యం కలదానా! నీ ప్రాణ నాథుడా (రత్ర) వచ్చాడా? (వచ్చి) అనురాగంతో ప్రక్కలో చేరి, దన్తక్షతా దులతో నిద్ర భంగం చేస్తున్నాడా? అని చెలికత్తె ప్రశ్న ఉ. (ఇంతలో నాయిక నాయిక కరచుకొని, కపటనాటకంగా (యథార్థము చెప్పదలచిగాని) కాదు, కాదు, సఖీ! నైపుణ్యంస్త్రీయూ చేసినది నల్లులగుంపు (మత్కుణ-వ్రాతః) సుమా, అని అపహ్నవము (కప్పిపుచ్చుట) చేసినది. నల్లులు కూడ, రక్తానురాగంతో, మంచమునెక్కి, పండ్లతో కొరికి, నిద్రాభంగము చేస్తాయి కదా!

వి. ఇక్కడ, అసలు విషయం అపహ్నుతం (కప్పిపుచ్చటం) అయినందున, ఇది ''అపహ్నుతి'' కి కూడ ఉదా -- అగుచున్నది.

80 శ్లో. (క) ప్రభాతే కీదృశం వ్యోమ? ప్రమాణే కీదృశం వచః? ।---

81. శ్లో. (ఖ) కస్మై ప్రసీదతే విష్ణుః? కిమాంధ్రాణాం అతి ప్రియమ్? ।---

82. శ్లో (గ) రావణస్య కియ ద్వక్త్రం? నూపురం కుత్ర వర్తతే? ।---

83. శ్లో (ఘ) కిం వద వ్యాధితో వైద్యం? వాజిశాలా చ కీదృశీ? ।---

84. శ్లో. (ఙ) కిం వక్తి భిత్తి నిర్మాతా? చాపలం కుత్ర వర్తతే? ।---

85. శ్లో (చ) కిం పుష్టి యమునా నద్యాం? జారం కిం వక్తి జారిణీ? ।---

86. శ్లో. (ఛ) ఏమి రసం ఎటకారం ముండితే మంచిదే కదా?

(80-85) ఆంధ్ర గీర్వాణ భాషాభ్యాం, ఏకమే వోత్తరం వద ॥ (ఇది 80 నుండి 85 శ్లో. వరకు ఉత్తరార్థము అని గమనించవలెను

(క). ఎ. ప్రాతః కాలమున ఆకాశమెట్లుండును?

బి. ప్రమాణము చేయునప్పుడు ఏమని చెప్పుదురు?

ఉ. ఈ రెండింటికీ ''సీ తోడు'' అనునది ఒకటే సమాధానం ఎ. ప్రభాతకాలం, ''సీత ఉడు: సీతోడు- పోయిన నక్షత్రాలు కంది'' - (సంస్కృతంలో) గా ఉంటుంది

బి. ప్రమాణం (ఒట్టు పెట్టుకొనునపుడు ''సీతోడు'' లేక అమ్మతోడు, అయ్యతోడు - అని (**తెలుగులో** చెప్పుదురు.

వి. మొత్తం మీద సంస్కృత- ఆంధ్రాలలో, ఈ ''సీతోడు'' ఒక్కటే రెండింటికి **ప్రత్యుత్తరమైనది.**

(ఖ). ఎ. విష్ణువు ఎవరిపై అనుగ్రహించును?

బి. ఆంధ్రులకు అత్యంతము ఇష్టమైనదేది?

ఉ. చింతకాయ. సంస్కృతాంధ్రాలలో ఒకటే సమాధానం

ఎ. తననెల్లప్పుడు చింతించువానిపై (సంస్కృతం) అనుగ్రహించును.

బి. చింతకాయ - చింతపండునిచ్చు కాయ (తెలుగు)

(గ) ఎ. రావణునికి ఎయెన్ని?

బి. అందెలు ఎక్కడ ఉండును? ఉ. పది

ఎ. రావణునికి తలలు దశ (పది) సంఖ్య గలవి. (సం)
బి. నూపురము పాదము నందు (పది) ఉండును. (తె)
(ఘ) ఎ. రోగి వైద్యు నేమని కోరును?
బి. గుఱ్ఱములుండు చావడిని ఏమంటారు? ఉ ''మందురా'' అనునది రెండింటికీ ప్రత్యుత్తరము
ఎ. ''వాజిశాలాతు మందురా'' అని - అమరకోశం. కనుక ''గుఱ్ఱాల చావడి''ని ''మందురా'' అంటారు. (సం)
బి. రోగి ''మందురా'' (మందుతీసుకొనిరారా) (తె) అంటాడు.
(ఙ). ఎ. మిక్కిలి కదలిక ఎక్కడ ఉండును?
బి. తాపీవాడు గోడ పునాది త్రవ్వుటకు దేనిని తెమ్మనును?
ఉ ఈ రెండింటికీ ''పారదే'' అనునదొక్కటే ప్రత్యుత్తరము
ఎ. పారదే = పాదరసము నందు (సం) ఆ పాదరసము ఒకచోటనుండక, అతి చంచలముగా అటు ఇటు తిరుగుతుంది
బి. తాపీవాడు, పారదే = ''పారను తీసుకొనిరా'' - అంటాడు (తె)
(చ) ఎ యమునా నదిలో ఏమున్నది?
బి. అంకుటాలు విటునితో ఏమని చెప్పును? ఉ. ఈరెంటికి ''నీలం జలం'' ఒక్కటే సమాధానం.
ఎ. యమునలో ''నీలం - జలం = నల్లని నీరు'' ఉంటుంది (సం)
బి. జారిణి- ''మేము నీ - లంజలం'' - అని చెప్పును. ఎ. వ్యభిచారిణి విటులతో నీ - ''లంజలం'' = నీ యొక్క ఉంపుడుగత్తెలము (తె) అంటుంది.
(ఛ) సం. పై వానివలె కాక, ఇది పైకి ''ఆంధ్రభాషా భాస సంవాదం''గా కూడ కన్పడినా, సంస్కృతమే. పైకి కన్పడే అర్థం:- ఓరే! (ఈ) కారం మంచిదేనా? ఉ. మంటను కల్పిస్తే మంచిదే కదా! (తె)
ఇక, సంస్కృతార్థముకోసం ఈ శ్లోకార్థానికి పదచ్ఛేదం ఇలా చెప్పుకోవాలి. ''ఏమి- రామం - చిదాకారం - మండితేమం- చిదే-కదా'' అని దాని పదవి భాగం. ''చిదాకారం - మండితేమం- రామం - చిదే- కదా- ఏమి?'' అని అన్వయ క్రమం అనగా దాని అర్థం- చిత్స్వరూపుడై, మన్మధుని, లక్ష్మిని, అలంకరింపచేసిన శ్రీరామచంద్రుని, జ్ఞానసంపాదన కొరకు ఎప్పుడు (శరణు) పొందుతాను- అని
వి. 1. మండితేమం ''ఇః'' అనగా మన్మథుడు, మా = లక్ష్మి, కనుక మన్మధుని, లక్ష్మిని అలరింపచేసినవాడు.

87 శ్లో. కః ఖే చరతి? కా రమ్యా? కా జప్యా? కిం విభూషణమ్?.
కో వంద్యః? కీ దృశీ లంకా? వీరమర్కటకంపితా ॥

ఇదొక అంతరాలాప సంవాదము. అంతరాలాప ప్రక్రియకు చెందిన చిత్రాలలో, పద్యంలోని ప్రశ్నలన్నింటికి, ప్రత్యుత్తరం ఆ శ్లోకంలోనే ఉంటుంది. దీనిలోని 6 ప్రశ్నలకు ''వీరమర్కటకంపితా''

అనునది ఒక్కటే సమాధానము పద్యంలోనే ఉన్నది దీనిని సరిగా విభజించుకొనవలెను. 1. విః+ 2 రమా+ 3 ఋక్+ 4 కటకం 5 పితా = 6 ''వీరమర్కటకంపితా,
ప్ర 1 ఆకాశమున సంచరించునది ఏది? ఉ విః (=పక్షి)
2 అందగత్తె ఎవరు? ఉ. రమా (లక్ష్మి)
3 జపింపబడినది ఏది? ఉ ఋక్ = మంత్రము, ఋగ్వేదము
4 అందమును పెంచు అలంకారమేది? ఉ కటకం (కడియం, గాజు)
5 నమస్కరింప (గౌరవింప) దగినవాడెవరు? ఉ పితా (=తండ్రి)
6 లంకానగర మెట్టిది? ఉ ''వీరమర్కటకంపితా'' అను మొత్తం సమాసం సమాధానం లంకపై దండెత్తినపుడు, హనుమదాది వీరవానరులచే లంక చలింపచేయబడినది
వి వీర పితా ఈ సమాసమును, ముందు విడదీయగా, అయిదు ప్రశ్నలకు విడి, విడిగా సమాధానమై, ఆరవ ప్రశ్నకు సమాసం మొత్తంగా ప్రత్యుత్తరమగుట విశేషము

88.శ్లో. కే భూషయన్తి స్తనమండలాని?
కీ దృ శ్యుమా? చంద్రమసః కుతః శ్రీః?
కి మాహ సీతా దశకంఠ నీతా?
హారామహాదేవర తాతమాతః ॥

శ్లోకంలోని నాలుగు ప్రశ్నలకు, ప్రత్యేక పదవిభాగంతో ''హారామ మాతః'' అనునది ప్రత్యుత్తరము. దాని పదచ్ఛేదముః 1. హారాః, 2. మహాదేవరతా, 3 తమాతః, 1 వి (మరలా) 1. హారామ!, 2 హాదేవర!
3. (హే) తాత! 4 (హే) మాతః! - అని
ప్ర 1 చన్నుగవల నలంకరించునవి ఏవి? ఉ హారాః (=ముత్యాలుహారాలు మొ.)
2 ఉమ (=పార్వతి) ఎట్టిది? ఉ. మహాదేవరతా (= ఈశ్వరుని యం దాసక్తి గలది)
3 చంద్రుని కాంతి ఎప్పటి నుండి ఉంటుంది? ఉ. తమాతః (=రాత్రి నుండి)
4 రావణుడు, తనను ఎత్తుకొని పోవునపుడు సీత ఏమని ఆక్రోశించెను?
ఉ హారామ! (= ఓరామా) హాదేవర (= ఓ మరదీ! లక్ష్మణా) తాత! (తండ్రీ) మాతః! (అమ్మా) అని, సీతరోదించినది.
వి అంతరాలాపంలో నున్న ''హారామ హాదేవర తాత మాతః'' ను ముందుగా పదచ్ఛేదం చేసుకొని, అన్వయించుకొని, తర్వాత మొత్తంగా అనేకులను సంబోధిస్తూ- ప్రత్యుత్తరమైనది 2 చతుర్థపాద మొక సమస్య గా కూడ కావచ్చును.

89 శ్లో కిం త్రాణం జగతాం ? న పశ్యతి చ కః? కే దేవతావిద్విషః?
కిం దాతుః కరభూషణం? నిరు దరః కః? కిం పిధానం దృశామ్?
కే ఖే ఖేలన మాచరన్తి? సుదృశాం కిం చారుతా భూషణమ్?
బుద్ధ్వా బ్రూహి విచార్య సూక్ష్మమతిమన్- త్వ మేకం ద్వయో రుత్తరమ్

ఓ కుశాగ్రబుద్ధీ! చక్కగా ఆలోచించి, ఈ క్రింది ఎనిమిది ప్రశ్నలలో, ప్రత్యక్షంగా రెండింటికి ఒక్కొక్క

సమాధానం చెప్పున, పై ఎనిమిది ప్రశ్నలకు, నాలుగు సమాధానములనిమ్ము.

ప్ర.1. ప్రపంచ ప్రజలను రక్షించునది ఏది? ఉ. అన్నః (= అన్నము)

2. మాదజాలని వాడెవడు? ఉ అన్నః (= గ్రుడ్డివాడు)

ఇట్లు, మొదటి రెండు ప్రశ్నలకు అన్న అనునదొక్కటే, విభిన్న, అంత, లింగ, ములతో ప్రత్యుత్తరమైనది ఎట్లు? అన్న ః (= అన్నము) శబ్దము, నకారాంతము నపుంసకలింగ ప్రథమా విభక్తి ఏకవచనము ఇక, రెండవ ప్రశ్నకు ఉత్తరమైన అన్ధః (గ్రుడ్డివాడు) శబ్దము, అకారాంతము, పుంలింగము, ఏకవచనము ఇట్లు ''అంధః'' శబ్దము భిన్నఅర్థ, అంత, లింగభేదములలో, 1, 2 ప్రశ్నలకు ఒకే సమాధానమైనది

3. దేవతలను ద్వేషించువారెవరు? ఉ. దానవాః (= రాక్షసులు)

4. దాత చేతికి అలంకరణమేది? ఉ. దాన-వాః (= దానము చేయునపుడు చేతితో విడిచెడి- నీరు.

3, 4 ప్రశ్నలు రెండింటికీ ''దానవాః'' అనునదొక్కటే, భిన్నార్థలతో ప్రత్యుత్తరం

5 చూపులను అడ్డగించునది ఏది? ఉ. తమః (= చీకటి)

6. ఉదరము (పొట్ట) లేనివాడెవడు? ఉ. తమః (= రాహువు), ఇతనికి తల మాత్రమే ఉన్నది. ''తమస్తు రాహుః '' అని అమరకోశము

వి 5,6 ప్రశ్నలు రెండింటికి ప్రత్యుత్తరమైన ''తమః'' శబ్దము రాహువు అనే అర్థాన్ని చెప్పునది, పుంలింగ, నపుంసకలింగాలలో నుండును. చీకటి - అనే అర్థాన్ని తెల్పునపుడు మాత్రము సకారాంత- నపుంకలింగమని తెలియవలెను.

7. ఆకసమున ఆడుకొనునవి ఏవి? ఉ. వయః (= పక్షులు)

8. ఆడు దానికి అందము నిచ్చి, అలంకరించునది ఏది? ఉ. వయః (= ప్రాయం, యౌవనము)

ఈ 7,8 ప్రశ్నలు రెండింటికి ''వయః'' ఒక్కటియే సమాధానము. 1. పక్షులు అనే అర్థం చెప్పునపుడు ''విః- వి- వయ''ః అని, ఇకారాన్త పుంలింగ, ''వి'' శబ్ద బహువచనము.

2 వయస్సు, యౌవనము- అను అర్థన్ని తెల్పునపుడు మాత్రం, సకారాన్త నపుంసలింగ - ప్రథమా ఏకవచనమని గమనింపవలెను.

వి. 1 ఇక్కడ బుద్ధిమంతుడు ఆలోచించి, ఎనిమిది ప్రశ్నలకు చెప్పిన నాలుగు ప్రత్యుత్తరాలు చక్కగా సరిపోయినవి.

**90 శ్లో.** కో నిర్దగ్ధః త్రిపురరిపుణా? కశ్చ కర్ణస్య హన్తా?
నద్యాః కూలం విఘటయతి కః? కః పరస్త్రీరత శ్చ? ।
కః సన్నద్ధో భవతి సమరే? భూషణం కిం కుచానాం
కిం దుస్సంగా ద్భవతి మహతాం ''మానపూజాపహారః'' ॥

ఈ శ్లోకంలోని ఏడు ప్రశ్నలకు , పద్యం చివరనున్న ఏడక్షరాల ''మానపూజా పహారః'' అను సమాసపదము ఒక్కటే సమాధానమగుచున్నది దాని కీటుకు తెలుసుకొన్న సమాధానం చెప్పుటం చాల సులభం, లేకున్న మెదడుకు మేతనందించి, కొంత తలనొప్పి, బాధపెడుతుంది. మొత్తం చిత్రాలంకారాలతో పాటు, సంవాదసాహిత్యం లో కూడ ఇదే తంతు. దానిని విడదీయుటకు కొంత వ్యాకరణ- జ్ఞానం,

అనుభవం, పరిశీలన కూడ ఉపసరిపుయుట సర్వవాదాంశము

ప్రత్యుత్తర జ్ఞానానికి ప్రత్యక్ష రహస్య మార్గమేదనగా - ఈ "మానపూజాసహారః" అను సమాసంలోని ఆద్యక్షరక్రమంలో ప్రత్యేకాక్షరానికి, చివరి అక్షరం కలుపవలెను అనగా ఆద్యక్షరం "మా" నుండి క్రమంగా, చివరి అక్షరము "రః" ను అన్నింటికి కలిపిన, "1 మారః, 2 నరః, 3 పూరః, 4 జారః, 5 పరః, 6 హారః" అనువి ప్రత్యుత్తరపదాలుగా బహిర్గతాలు కాగలవు ఇక చివరి ఏడవ ప్రశ్నకు మొత్తం సమాసం సమాధానము ఉట విశేషము. ఇప్పుడు పరిశీలిస్తే మీకే సులభంగా తెలుస్తుంది.

ప్ర 1 త్రిపురారి (శివుని) చే కాల్చబడినవాడెవడు? ఉ మారః (= మన్మథుడు)

2. పక్షుని హత మొనర్చినవాదెవడు? ఉ. నరః (= అర్జునుడు)

3 పేటిగట్టును పారుచున్నది ఏది? ఉ పూరః (=నదీ) ప్రవాహము, వరద

4. పరస్త్రీలపైకి పరుగెత్తువాడెవడు? ఉ జారః (= విటుడు, వ్యభిచారి)

5. యుద్ధమున సంసిద్ధమై నుండువాడెవడు? ఉ పరః (=శత్రువు).

6. స్తనముల కలంకారమేది? ఉ హారః (= ముత్యాల, బంగారు- హారము మొ.నవి)

7 దుష్టులు పూజ చేయుట వలన మహాత్ములకు కలుగు నష్టమేమి?

ఉ. మాన - పూజా - (అ) పహారః, (= మహాత్ముల గౌరవ-సత్కారాలకు హాని కల్గును.

వి 1 మొత్తం మీద ప్రాధ్యమిక ఏడు ప్రశ్నలకు ఏడక్షరాలతో సమాధానం చెప్పి, సమన్వయపరచటం అత్యంత చమత్కారానందాలనందిస్తుంది.

ప్రస్తుంభితిచే, ఉదాహరణాన్తరములను, ఎక్కువగా చూపుటందుకు క్షన్తవ్యులము

2. దీనిని మించిన, మరొక గొప్పవిశేషమేమిటనగా, అది, శ్లోకంలోని 13 ప్రశ్నలకు, సప్త (7) క్షరాలతో సమాధానాన్ని సమన్వయించటం. ఇట్టి చమత్కార చిత్ర విశేషాలను ఒక్క సంస్కృత భాష మాత్రమే సమన్వయించి, చూపగలదు. ఇతర భాషలలో, ఈ విశేషాలను చూపటం కష్టసాధ్యము. పాఠక ప్రభువులా విషయాన్ని క్రింద శ్లోకంలో పరిశీలించ ప్రార్థితులు.

91 శ్లో కిం త్వష్టాకారి? కీదృగ్ రథచరణః? మహో రాతికః? కా ఖ్రికాంచీ?
కో ఽపస్మారీ? భుజంగే కిము? కలిశమనం? త్వార్య సంబోధనం కిమ్?
కా స్వన్నర్వా? మహీన్ద్రః కథ? మచలభ్రుతః కా చ సంబుద్ధి? రగ్నేః
బీజం కిం? కా (అ) వనీజా రమణ మతిహరా? "హేమసారంగలీలా"

వి. శ్లోకంలోని మొదటి మూడుపాదాలలో 3 x 4 ప్రశ్నల చొప్పున మొత్తం 12 ప్రశ్నలు, + 4వపాదంలో మరొకటి = వెరసి 13 ప్రశ్నలున్నవి. ఈ 13 కి "హేమసారంగలీలా" అను సమాసం, సాకూతంగా, సాటోపంగా, సాప్తపదీన పదం సమాధానమై, పాఠక మహాశయులను పరమానంద సాగరంలో నిమగ్నులను చేయగలదనుట నిశ్చయము.

పరమానందముతో పారవశ్యము చెందిన పాఠకమహోదయులు, ఇతర భాషలలో కూడ, ఇట్టి చారు చిత్రాలను, పరిశోధించి, ప్రకటించి, పండితామోదముతో పరిఢవిల్లుదురు గాక!

వి. ఇక, ఈ సాప్తపదీన ప్రశ్నోత్తరములను సాంత్వనంతో, సాంప్రదాయికంగా, సాంతంగా, శాంతంగా

సంగ్రహంగా, సమీక్షించండి. ముందు వీనిని విడదీసుకుంటే, సులభావగాహనం సుఖతరమైతుందని మనవి.

ఈ "హేమసారంగలీలా" ను, వివిధములగు విరుపులతో, మార్పులతో కూర్పులతో విడమర్చవలెను ముమ్మొదట దానిని, క్రమంలో 1 హేమ, 2సారం,3గలీ,4 ఇలా-గాను, విపరీత క్రమంలో, వెనుకనుండి ముందుకు అనగా అపక్రమంలో కూర్చిన,1 లాలీ 2 గరం,3 సామ, 4 హేగాను, పిమ్మట ఆ సమాసంలోని ఆది అక్షరాలను, ఒక క్రమంలో అంత్యాక్షరాలతో కలిపిన 1హేలా 2 మలీ 3 నాగ, 4 ( చివరికి మిగిలిన) రం, ఇట్లు మూడు సార్లు కూర్పుల, చేర్పుల,మార్పులతో, 4+4+4 =12 ప్రశ్నలకు, 13 వప్రశ్నకు "హేమసారంగ లీలా" ఒక్కటేమొత్తంగాను ప్రత్యుత్తరములగుటను ప్రతీక్షింపగలము. ఎట్లన-దయయుంచి, ఈ క్రింది ప్రశ్నోత్తరములను క్రమంగా పరిశీలించండి.

ప్ర 1 ఆశను కల్గించునది ఏది? ఉ. హేమ (=బంగారము, ధనము, సంపద)

2. రథచక్రమెట్టిది? ఉ. సారమ్ (స+అరమ్) (= అరమ్ ( ఆకుల) తో కూడినది)

3. బాగుగా కంఠమెత్తిపాడగలవాడెవడు? ఉ. గలీ (=మంచి కంఠము (గళము) గలగాయకుడు, లేక మంచి కంఠము గల కోకిల.. . పాడగలదు.

4. సముద్రము మొలనూలుగా గలది ఏది? ఉ. ఇలా (=భూమి) వి. గలీ+ ఇలా = గలీలా (సవర్ణదీర్ఘసంధి) సముద్రము భూమిని చుట్టి ఉండుటచే, దానిని భూమికి వడ్డాణముగా కవులు వర్ణించుట సంప్రదాయము. ఇట్లు క్రమంగా మొదటి పాదంలోని నాల్గు ప్రశ్నలకు నాల్గు ప్రత్యుత్తరాలు లభించినవి.

ఇక అపక్రమంగా (వెనుకనుండి ముందుకు) విడదీసిన నాలుగు జవాబులు రాగలవు. ఎట్లనగా-

5. అపస్మార (మూర్ఛ) రోగము గలవాడెవడు ఉ. లాలీ ( =నోటినుండి లాలా జలమును (చొంగ) కార్చువాడు)

6. పాములో ఏమి ఉన్నది? ఉ గరం (=గరళము, విషము)

7. కలియుగపాపమును లేక కలహమును పోగొట్టునది ఏది? ఉ. సామ (=మంత్రజపము లేక మంచిమాట (సామోపాయము)

8. పెద్దలనెట్లు సంబోధింతురు. ఉ. హే (=హే ( ఓ) అను శబ్దాన్ని ముందుంచుకొని) హేరామ! హే కృష్ణ- - ఇత్యాదిగా సంబోధింతురు.

ఇక, వ్యుత్క్రమంలో, వరుసతప్పించి, ఆద్యంతాక్షరాలను నియతక్రమంలో కలిపిన వచ్చు సమాధానములు నాలుగు

9. అందగత్తెలో ఏమున్నది? ఉ. హేలా (=విలాసము, శృంగారచేష్ట)

10. చంద్రుడెట్లుండును? ఉ. మలి (= లోపల మచ్చ, లేక కళంకము కల్గియుండును)

11. కదలని చెట్లను భరించు పర్వత సంబోధనమెట్లు? నాగ! (=న+అగ = కదలని వృక్షములతో కూడుకున్నదాన? అని పర్వతసంబోధన)

12. అగ్నికి బీజాక్షరమేది? ఉ. రం (= ర అను అక్షరము, లేక రేఫ)

13. కా+అననీజారమణమతిహరా, అననీ- జా= భూపుత్రి అగు సీత, ఆమెకు రమణుడు, భర్త=

శ్రీరాముడు, అతని యొక్క మతి (బుద్ధి) ని, హరా= హరించినది ఏది?

ఉ. హేమ-సారంగ- లీలా = బంగారు-లేడి- యొక్క- విలాసము.

వి. 1 ఈ చిత్రోత్తరాలంకార భేదంలో క్రమ, అపక్రమ, వ్యుత్క్రమ భేదములచే ఇది మిశ్రాలంకారము కూడ అగుచున్నది.

2 పద్యం చివర ప్రత్యుత్తరముండుటచే అంతరాలాపము కూడ అవుతుందని మరువరాదు.

3. అపని, అవనీ లలోని హ్రస్వ దీర్ఘాలకు. . చిత్రాలంకారాలలో పట్టింపు ఉండదని సంప్రదాయం.

92.శ్లో. భవిత్రీ రంభోరు! త్రిదశవదన గ్లాని రధునా?
స తే రామః స్థాతా న యుధి పురతో లక్ష్మణసఖః? ।
ఇయం యాస్య త్యుచ్చై ర్విపద మథ తే వానరచమూః?
లఘిష్ఠేదం షష్ఠాక్షర పర విలోద్రాత్ పర పునః ॥

వి హనుమన్నాటకము నుండి గ్రహింపబడిన ఈ సంవాద శ్లోకాన్ని, అప్పయ్యదీక్షితులు వక్రోక్తికి ఉదాహరణగా ఇచ్చెను.

సం సీతారావణ సంవాదము.

రావణుని ప్రశ్న 1 ఓసీతా! నేడు దేవతల మొగమున దౌర్బల్యము (గ్లాని) దండెత్తియున్నది. 2. సలక్ష్మణుడగు ఆ నీమగడు రాముడు, ఇక యుద్ధప్రాంగణమున కూడ నిల్వజాలడు సుమా! 3 ఈ నీ కోతిమూక కూడ గొప్ప ఆపదలను పొందుచున్నది. అని, రావణుడు ఎలుగెత్తి, రావము (శబ్దము) చేయగా

సీతా ప్రత్యుత్తరము:- ఓరీ పరమనీచుడా! (లఘిష్ఠ) ఏమి కూస్తున్నావు? నీకేమైనా తెలివి ఉన్నదా? ఉంటే నీవు చెప్పిన పై మూడు ప్రశ్న పాదాలలోని ఏడవ అక్షరాన్ని, తొలగించి, మరలా ఒకసారి చదివి అర్థం తెలుసుకో అప్పుడు నీవు చేసిన పొరపాటు ఏమిటో, ఏమి జరుగబోవుచున్నదో, నీకే తెలుస్తుంది. (అని సీత కొన్ని చకార గుళ్ళ (ఛీ, ఛీయి) రావణునిపై విసరింది.

వి.1 షష్ఠాక్షర పరవిలోపాత్ = షష్ఠ+ అక్షర - పర- విలోపాత్= ఆరవ- అక్షరానికి - పరమైన (పక్కనున్న) - అనగా ఏడవ అక్షరాన్ని- లుప్త చేయటం వలన

1వపాదం భవిత్రీ రంభోరు (త్రి) దశ - -,2వపాదం సతేరామః స్థాతా (న) యుధి.

3వపాదం ఇయంయాస్యత్యుచ్చైః (వి) పదం....

వి.2 ఇట్లు, 1-3 పాదాలలోని ఏడవ త్రి-న- వి అను అక్షరాలను తీసివేసినచో 1 దశవదన (రావణ) గ్లాని జరుగుతుందని, 2 రాముడు యుద్ధములో స్థిరంగా ఉంటాడని, 3 వానరసైన్యం ఉన్నతస్థానాన్ని (ఉచ్చైఃపదం) పొందగలదని అర్థమవుతంది 3సీత ఈ యదార్థస్థితిని, రావణుని మాటలతోనే త్రిప్పికొట్టి, వానినోటికి తాళం వేయించినది

వి 4 ఇట్లు, వక్రోక్తి ద్వారా జరిగిన సంవాదములు, ఆయా వ్యక్తులలోని జాణతనము, పాండిత్యప్రకర్షల తెల్పుచూ, చమత్కారచారువులుగా కూడ ఉండగలవని భావింపగలము.

93.శ్లో పరిక్షీణాలస్యః సమరభువి, రక్షఃకులపతిః,
సలజ్జః స్వస్తుత్యాం, అమల హితమార్గైక పథికః ।

ప్రణమ్ర స్త్రీలభ్య:, సుముఖి! పలసత్కీర్తి రతి వ,

శ్రుతో నాహం కిం? రే ఉఘను! ముహు రలం త్వాం శ్రుతవతీ ॥

సం ఇది మైసూరు, రామశాస్త్రి రచిత సీతారావణ సంవాదఝరీ నుండి గ్రహితం

శ్లోకంలోని 31/4 పాదంలో రావణుడు ఆత్మస్తుతి చేసుకొనగా, మిగతా 3/4 పాదముతో సీతాదేవి

ప్రత్యుత్తరమెంతో చమత్కార పందిన పర్భితమై ఉన్నది

ఓ సీతా! యుద్ధభూమిలో నా పరాక్రమంతో, ఏమాత్రం వెనుకాడను నేను రాక్షసేశ్వరుడను ఆత్మస్తుతికి అత్యంత దూరంగా ఉంటాను ధర్మంమార్గాను సారిని. ప్రణతులైన పదతులకు మాత్రమే లభించువాడను దిగంత విశ్రాంత కీర్తిమంతుడను. ఇట్టి నన్ను (రావణుని) గురించి, నీవు వినలేదా?; అని రావణుని ప్రశ్న. దీనికి సీత ప్రత్యుత్తరం- ఓరీ నీచుడా! (వినకేమి? నిన్ను గురించి, బాగా, కావలసినంత (అలం) గా చాలసార్లు విన్నానుగా, ఈ నిగూఢ సీతా ప్రత్యుత్తరంలోని పరమరహస్యం ''అలం''లో నున్నది అలం అను శబ్దానికి= అలం భూషణ, పర్యాప్తి, శక్తి, వారణావాచకమ్ ( = అలంకారము, పూర్ణము, సమర్థుడు, నివారణ) అని అమరకోశం నానార్థాలను తెల్పుచున్నది. కాని, అవి ఇక్కడ అక్కరకు రావు. దాని అర్థమును కుశాగ్రబుద్ధితో కనార్చవలెను. ఎట్లన.

ఇక్కడ, అలం=(నాస్తి ల వర్ణః యస్మిన్) నీవు చెప్పిన విశేషణములలోని లకారమును తీసివేసి అర్థంచేసుకొనుము.

1. పరిక్షీణా(ల) స్యః =పరిక్షీణాస్యః = బాగుగా క్షీణించిన ముఖముగలవాడు

2. రక్షః కు (ల) పతిః = రక్షః కుపతిః = రాక్షసులకు చెడ్డరాజు.

3 స్వస్తుత్యాం స(ల)జ్జః = స్వస్తుత్యాం సజ్జః= ఆత్మస్తుతిలో అతి జాగరూకుడు.

4. అను(ల)హితమార్గైక పథికః = అ- నుహిత- మార్గ+ ఏకప్రవణః = నింద్యమార్గానుసారి

5 ప్రణమ్రస్త్రీ (ల) భ్యః = ప్రణమ్రస్త్రీభ్యః = స్త్రీలకు లొంగి నమస్కరించువాడు.

6. వి(ల) సత్కీర్తిః = విసత్కీర్తిః = పోయిన మంచి కీర్తి గలవాడు, నేడు కీర్తి లేని వాడు

అలం = లకారం లేని ఈ విశేషాలలో, ఇంత నిగూఢార్థమున్నది కనుకనే సీత, రేః ఒరే - అని నీచంగా సంబోధించి, అలం గా అర్థంచేసుకున్న ,సత్యం నీకే నిశ్చయంగా బోధపడుతుందని నర్మగర్భంగా చెప్పి నోరుమూయించినది. ఒక్క అక్షరచ్యుతితో, అనంతర్థాన్ని వ్యంజింపచేయటం గొప్పవిశేషం.

94.శ్లో భారతం చేక్షు దండం చ సిన్ధు మిన్దుంచ వర్ణయ!

పాద మేకం ప్రదాస్యామి ప్రతిపర్వ రసోదయః ॥

సం. పూర్వార్థము భోజుని ప్రశ్నకాగా, ఉత్తరార్ధం కాళిదాసకవిది.

భోజప్రశ్న: కాళిదాస మహాకవీ! 1 మహాభారతమును 2. చెఱకుగడను, 3 సముద్రమును 4 చంద్రుని- ఈ నాల్గింటిని ఒక్కసారిగా ఒక్కపాదంతో వర్ణించుము. కాళి.ప్రత్యుత్తరము - రాజన్! ''ప్రతి పర్వరసోదయః'' అనే ఒక్క పాదాన్నిస్తున్నాను. దానిలో నాల్గువర్ణనలున్నాయి సుమా!

వి. ఇక్కడ పర్వపదము శ్లిష్టము శ్లేషయొక్క నానార్థాలతో పై నాల్గింటిని, చక్కగా సమన్వయించుకొనవచ్చును.

1. భారతములోని ప్రతిపర్వ (విభాగ) ము నందును రసము చిప్పిలు చుండును.

2. చెరకు గడలోని ప్రతి పర్వము (గనుపు) నందును రసోద్గారము రంజిల్లును.
3-4 పర్వమనగా పుణ్యతిథి, పండుగ. దేవదానవులు అమృతం కొరకై పాలసముద్రమును మథించునపుడు దాని నుండి అమృతముతో పాటు, చంద్రాదులు కూడ పుట్టినారు. పూర్ణిమ మొదలగు పుణ్యతిథులందు
3. సముద్రజలము, ఉప్పొంగుట, 4 చంద్రుడు సర్వకళా పరిపూర్ణుడగుట, సర్వజగత్ ప్రసిద్ధము గదా!
మొత్తం మీద నాల్గు ప్రశ్నలకు ఒకేపాదం ప్రత్యుత్తరమగుట విశేషం కాదా!

95. శ్లో. భూరి భార భరాక్రాంతో బాధతి స్కంధ ఏష తే (మే) ।
న తథా బాధతే స్కంధః యథా బాధతి బాధతే ॥

సం. పూర్వార్ధం శిబికారూఢుడై వేట నుండి తిరిగి వచ్చుచున్న భోజునిది కాగా, ఉత్తరార్ధం శిబికావాహకుడగు పండితునిదని కొందరనగా, మరికొందరు విపరీతంగా కూడ సమన్వయిస్తారు. ఏమైతే నేమి ఈ సంవాదంలో చమత్కారమున్నది.

భోజప్రశ్న: అత్యధిక భారం మోయటంతో నీ భుజం బాధపడుచున్నట్లున్నదేమి? అనగా శిబికమోస్తున్న పండితుని ప్రతివచనం : రాజా! మీరుపయోగించిన "బాధతి" అనే క్రియాపదం ఎంతగా నన్ను బాధపెడుతోందో, అంతగా, ఈ శిబికా భారం నన్ను బాధ పెట్టడం లేదు.

వి. "బాధతే" అను క్రియ బాధృ- లోడనే అను ఆత్మనేపదధాతువు యొక్క ప్ర. పు. ఏకవచనం. బాధతే అని, ఆత్మనే పద రూపం ప్రయోగింపవలసి ఉండగా "బాధతి" అని పరస్మైపదంగా వ్యాకరణశాస్త్ర విరుద్ధంగా ప్రయోగించడం, శిబికాభారం కంటే అత్యంత బాధను కల్గిస్తోందని భావం.

96. శ్లో. యస్య షష్ఠీ చతుర్థీ స్యాత్ విహస్య చ విహాయ చ ।
అహం కథం ద్వితీయా స్యాత్ ద్వితీయా స్యా మహం కథమ్ ॥

సం. వివాహోత్పూర్వం వధూవరుల- పెండ్లి పెద్దలిరువురూ, వధూవరుల చదువు సంధ్యలు, కట్నకానుకలు, పెట్టుపోతలు మొ. వానిని గురించి సంప్రదించుకోవడం పరిపాటి. అట్టి ప్రదాన సమయంలో ఒక కన్య, కాబోయే భర్తను ప్రశ్నించి, అతని అర్హతను ఆట పట్టిస్తూ, అపహసించినదట. ఆమె పద్యమిది.

వి. సాధారణంగా పడతికి పద్యం వంటపట్టదని, కాంతకి కవిత్వం కలసి రాదని, ఆటది, ఆడుది, ఆడది అల్లిన కవిత్వం అల్పాల్పమని, ఆడిపోసుకోబడిన అబలలే, అమంద సుందర కమనీయ కావ్యములల్లి, ఆద్యులైన అంగనామణులుగా, ఆదర్శవంతురాండ్రయినవారుగా అందల మెక్కారు కొందరు.

ప్రస్తుత చిత్రానికి వస్తే, పూర్వమొక విద్యావతి పెండ్లి చూపులకు వచ్చిన పెండ్లికొడుకును ఇట్లు ప్రశ్నించి, వానికతడు తప్పుడు ప్రత్యుత్తరాలియ్యగా, అసంగతంతా, పద్యంలోనేపన్ని, పది మంది ముందు పరిహసించినదట! ఎట్లు?

పెండ్లి చూపులకు వచ్చిన అప్రబుద్ధునికి (వరునికి), "విహస్య - విహాయ" అను అవ్యయాలు షష్ఠీ, చతుర్థీ విభక్తులుగా కన్పడినవి. అట్లే అహం అను అస్మచ్ఛబ్ద ప్ర.వి. ఏకవచనం, మరియు కథం అనునది అవ్యయం- వీని ఈ రూపాలను ద్వితీయా విభక్తులుగా చెప్పుచున్నాడు. ఈ మాత్రం ప్రాథమిక పరిజ్ఞానం వాడ లేని, ఆపండిత పుత్రునికి, నేను ద్వితీయ (సహధర్మచారిణి)ను ఎట్లాఅవుతానన్నదట! అనాటి కొందరు విద్యావతుల విజ్ఞత అట్టిది! ఆనాటి మరొక విద్యాధరి "ఉష్ట్రః" అని, వచ్చిన వరుని పల్కమనగా,

అపండిత పుత్రుడు, ఉష్ట్రము, ఉట్రసు-- ఇత్యాదిగా పల్కాడట.!
అందుకామె "ఉష్ట్రే లుంపతి రంవా, షంవా తస్మై దత్తా వికట నితమ్బా" అని గేలిచేసినదట.
97.శ్లో. విక్రమే ణార్జున ముఖాః కృష్ణభూపాల! తే హితాః ।
విక్రమే ణార్జున ముఖాః కృష్ణభూపాల! తేహితాః ॥
సం. మాదుగుల మహారాజు నిద్దరు కవీశ్వరులు దీవిస్తూ చెప్పినదీపద్యం.
ఓ కృష్ణభూపాల! విక్రమేణ- అర్జునముఖాః - తే హితాః = పరాక్రమంలో (పాండవమధ్యముడగు) అర్జునుడు మొదలగువారు- నీకు సమాన- స్నేహితులుగా పేర్పడగియున్నారు- అని ఒక కవి వర్ణింపగా, రెండవ కవి కూడా, దానినే పునరుక్తం చేయడంతో, పూర్వోత్తరార్ధాలు తేడా లేకుండా, భ్రాంతిని కల్గిస్తున్నాయి. మరి కవులు అలా పునరుక్తం చేస్తారా? అని ప్రశ్నవస్తే, అక్కడే ఒక కిటుకో, కీలకమో, ఉన్నది. అదేమిటనగా, తే- హితాః అను అక్షరాలమధ్యలో అవగ్రహము, ఽ అకారప్రశ్లేషకు గుర్తు ఉన్నది. పైకి ఒకే విధంగా కన్పడినా అవగ్రహంతో అర్థం భేదిస్తుంది. ఎట్లనగా తే హితాః = తే- అహితాః= నీ శత్రువులు, అర్జున ముఖాః= తెల్లమోగాలతో నెల వెల పోతున్నారని ఉత్తరార్ధభావం.
అవగ్రహ దానంతో పునరుక్తిభ్రమ తొలగి, చమత్కారవారుపైన అర్థాంతరం ఆనందాన్ని కల్గిస్తోంది. ఇట్టివే పథ్యేసతి - పథ్యేఽసతి గదార్తస్య---, చేతోనలం - చేతోఽనలం కామయతే మదీయం,--- కౌముదీ యది కంఠస్థా, అష్టాస్వాష్ట్యే యదిస్యాతాం... మొదలగు వానిని కూడ సమన్వయించుకొనవలెను.
వి. అవగ్రహం లేక అకారప్రశ్లేష (ఽ) యొక్క మరికొన్ని వైచిత్ర్యాలు.

98. 1. పథ్యేసతి గదార్తస్య కిమౌషధ ప్రయోజనమ్ ?
పథ్యేఽసతి గదార్తస్య కి మౌషధ ప్రయోజనమ్? ॥ నిషేవణమ్ అని పాఠాన్తరము.

99. 2.చేతో నలం కామయతే మదీయం
చేతోఽనలం కామయతే మదీయమ్.

100. 3.కౌ ముదీ యది కంఠస్థా వృథా భాష్యే పరిశ్రమః ।
కా ము దీ య ద్య కంఠ స్థా - వృథా భాష్యే పరిశ్రమః ॥

101. 4. అష్టా స్వాష్ట్యే యది స్యాతాం మేధయా కిం ప్రయోజనమ్? ।
తావుభౌ యది న స్యాతాం - మేధయా కిం ప్రయోజనమ్? ॥
2 అష్టాస్వాష్ట్యే న హిస్యాతాం అని పాఠాన్తరము.

1. పథ్యము (రోగా దులు వచ్చినప్పుడు తీసుకొనెడి నియమితా హారము) గా ప్రవర్తించినచో, ఇక రోగ పీడితుడు ఔషధములను మండలం (40 రోజులు) సేవించినను ప్రయోజనమేమీ ఉండదు. అలాగే, పథ్యం చేయకపోతే, రోగి ఎన్నిమందులను సేవించినను, నిష్ప్రయోజనము. ఈ రెండవ అర్థం అవ గ్రహం (ఽ) సహాయంతో వచ్చినదని మరువరాదు. పైకి పూర్వ- ఉత్తరపాదాలు రెండూ, ఒకటిగానే కన్పడినా, అకార ప్రశ్లేషతో వీని అర్థం విపరీతంగా మారిపోతుందని భావం.
2 దమయంతి- తన మనస్సు నలునే కోరుకొంటున్నది. అలా నలుడు దొరకకపోయినచో, (అవగ్రహంతో వచ్చిన) అనలం = అగ్నిని- ప్రవేశించాలని కోరుకుంటున్నది.

3. "వైయాకరణ సిద్ధాన్త కౌముది" అను భట్టోజీ దీక్షితుని వ్యాకరణ గ్రంథాన్ని, బాగా చదివి, కంఠంలో నిలుపుకొన్నచో, ఇక పతంజలి- మహాభాష్యం చదివి, పరిశ్రమింపవలసిన పనిలేదు. అట్లుకాక, కౌముదీ- యది+ అకంఠస్థా = అకౌముదినే గనుక కంఠోపపాఠంగా చదివి అర్థం చేసుకోకపోతే మహాభాష్యం చదువలేడు, చదివినా, ఏమీ అర్థం కాదని భావం.

4. మనిషికి శ్రద్ధ (ఆస్థ), లేక ప్రయత్నము, ఆదరము, మరియు, ఆరోగ్యము (స్వాస్థ్యము) ఉన్నట్లయితే, మేధ (ధారణాశక్తి గల బుద్ధి, తెలివి) లేకపోయినా, పరవాలేదు. ఈ ఆస్థాస్వాస్థ్యములు రెండూ లేకపోయినచో, వానికి ఎంత ధారణాశక్తి ఉన్నను ప్రయోజనం ఉండదని భావం.

అనగా, ప్రస్తుతం మనిషికి శ్రద్ధ, ఆదరం, ప్రయత్నం, (ఆస్థ) ఉన్నట్లైతే, కొంచెం గ్రహణశక్తి, బుద్ధితక్కువగా ఉన్నానష్టంలేదు. శ్రద్ధ ఉండటంతో చదివి గొప్పవాడౌతాడు, అట్లుగాక, వాడెంత మేధావంతుడు, కుశాగ్రబుద్ధియైనను, ఆస్థాస్వాస్థ్యాలు లేకపోతే ఏమీ చదవడు, చదువలేడు, చదివినా అర్థంకాదని భావం

కనుక మనిషికి మేధకంటె శ్రద్ధ, ఆరోగ్యము ముఖ్యములని భావం

వి. ఈ 1,2అర్థాలలో అవగ్రహమాహాత్మ్యం వలన,3-4 అర్థాలు సంధి ము. వ్యాకరణ విశేషాల వలన లభించినవని మరువరాదు. మొత్తం మీద, ఒక్క అకారప్రశ్లేషతో, అర్థమంతా, విరుద్ధంగా, ఎదురుతిరిగి, ఎంతో వైచిత్ర్యాన్ని కల్గిస్తున్నదని భావం.

ఇటువంటి సంవాదాలు చాలా ఉన్నా, విస్తరభీతి విడువక వెంటాడుట చే త్యజింపబడినవని మనవి. ఇవన్నీ, 1. ప్రశ్నలను శంకించుకొన్న ఒకే వ్యక్తి చెప్పినవి కావచ్చును. లేక 2.ఒకరు పూర్వార్థం చెప్పగా, దాన్ని అవగ్రహంతో, వ్యాకరణ, విశేషాలతో, అన్యాపదేశంగా సమర్థిస్తూ, మరొకరు సంవాదరూపంలో చెప్పినవి కూడ కానచ్చునని తెలియవలెను.

102 శ్లో కుంద కుంజ మముం పశ్య సరసీరుహలోచనే!

అమునా కుంద కుంజేన సఖి! మే కిం ప్రయోజనమ్ ॥

సం. ఒక చెలికి నాయికకు జరిగిన పత్యుత్తసంవాదం.

సఖి ప్రశ్న. ఓ కమలాక్షీ! అముం- కుందకుంజం- పశ్య= ఈ మొల్లపూల- పొదను - చూడుము- (అని ఒక చెలి నాయికకు చెప్పగా)

నాయిక ఉత్తరం- సఖీ! అమునా- కుందకుంజేన- మే- కిం- ప్రయోజనం= నీవు చూపించిన ఈ మొల్లపొదతో- నాకు- ఏమి- ప్రయోజనము? (కల్గుతుంది?) అను నాయిక యొక్క సమాధానం అర్థంకాక, మనమెదడుకెంతో మేతనందిస్తోంది.

కనుక, సత్యమైన అన్యార్థాన్నికూడ ఆలోచించి, ఆకళించుకోవాలి. ఎట్లు? శ్లోకంలో నున్న "అమునా" అను శబ్దాన్ని "అదస్" శబ్దముయొక్క, తృతీయైకవచనంగా భ్రమించి, భావించి, 'కుందకుంజేన' కు విశేషణంగా చేయుట వలన, ఈ చిక్కు, చీకు, గందరగోళం వచ్చినది.

అట్లుగాక, దానిని సూక్ష్మబుద్ధితో, అ.- ,ము- నా = ము కారరహితమైనది- అను అర్థం స్వీకున్నచో, ము కారం లేని కుందకుంజం, అనగా ము కారం ముందుగల కుందకుంజం = ము

- కుందకుంజం=ముకున్దకుంజం= ముకుందుడు (కృష్ణుడు) ఉన్నపొద- అనే అర్థం రాగలదు. అప్పుడు- ఆముకుందుడున్న పొదరింటిలో, ఆ కృష్ణునితో, నేను హాయిగా, స్వేచ్ఛగా క్రీడించు ప్రయోజనమును పొందగలను- అను నాయిక సమాధానము నాణెంగా సరిపోతుంది కదా!

103. శ్లో. కః పంజర మధ్యాస్తే? కః పరుష నిస్స్వనః?

కః ప్రతిష్ఠా జీవానాం? కః పాఠ్యోఽక్షర చ్యుతిః ॥ అ.చి. 2-139.

104. శ్లో శుకః పంజర మధ్యాస్తే, కాకః పరుషనిస్స్వనః।

లోకః ప్రతిష్ఠా జీవానాం, శ్లోకః పాఠ్యోఽక్షరచ్యుతః ॥ ల.చి. 2-140

ప్ర.1. పంజరమునందున్న దేది? 2. కర్ణకఠోరంగా శబ్దించునది ఏది?
3. జీవులకు ఆధారమైనది ఏది? 4 అక్షరం చ్యుతమైనా పఠింపదగినది ఏది?
అను నాల్గు ప్రశ్నలు శ్లోకంలో ఈయబడగా, తర్వాతి శ్లోకంలో ప్రత్యుత్తరాలిచ్చుట విశేషం
సమాధానాలు : 1 పంజరము నధిష్ఠించియున్నది చిలుక(శుకః)2. కఠినంగా శబ్దించేది కాకి (కాకః) 3. జీవులకాశ్రయ దాత లోకము (లోకః) 4. ఏవో ఒకటి రెండు .... అక్షరాలు చ్యుతాలైనా చదువదగింది శ్లోకము సుమా!

వి.శ్లోకంలోని నాలుగు ప్రశ్నలు కిం శబ్ద, పుంలింగ - ప్రథమావిభక్తి- ఏకవచన, "కః" తో ప్రశ్నించబడినవి. ఈ ప్రశ్నవాచకమగు "కః" కు ముందు- లుప్తాలైన "శు- కా- లో- శ్లో" అను నాలుగు అక్షరాలను దత్తం చేసి, చేర్చిన, శుకః, కాకః, లోకః, శ్లోకః అను నాలుగు ప్రత్యుత్తరాలు వెల్వడుట విశేషం. మరియు, ఇది పై నాలుగక్షరాలు, మొదట చ్యుతం అగుటచే చ్యుతచిత్రంగా, మరల (లేక), నాలుగక్షరాలు దత్తాలగుటచే, దత్తచిత్రాలుగాను, అంతేకాక, మొదటచ్యుతాలై తర్వాత దత్తాలు కూడ అగుటచే చ్యుత, దత్తాక్షరచిత్రాలు గా కూడ అగుట కవకాశము కల్పించుట అజితసేనాచార్యుని ప్రత్యేకత.

ఇంకను, ఒకే శ్లోకంలో ప్రశ్నోత్తరాలతో, సంవాదం కాక, ఒక శ్లోకంలో ప్రశ్నలు, రెండవ శ్లోకంలో ప్రతివచనాలు ఉండటం కూడ చమత్కారావహ మగుచున్నది.

105. శ్లో కాముకః, శ్రయతే నిత్యం కాముకీం సురత ప్రియామ్।

కాన్తాననే! - వ దేదానీం చతురక్షర విచ్యుతిమ్ ॥ అ.చి.2-146.

**అజితసేనా చార్యుని అలంకార చింతామణిలో ఇట్టివెన్నియోగలవు. మరియొక ఉదాహరణాన్ని కూడ మన్నించండి.**

కాన్త+ **ఆననే!=అందమైన** ముఖం గలదానా! కామియగు పురుషుడు సంభోగ ప్రియురాలగు కామునిని సదా **ఆశ్రయించుచున్నాడు**- నీ వప్పుడు దీని మూడు పాదాలలోని నాలుగు **అక్షరాలను** తొలగించి, జాగ్రత్తగా ప్రత్యుత్తరింపుము.

వి.1. మొదట ఈ శ్లోకము **యొక్క**, పాదత్రయంలోని రెండవ అక్షరాలను తొలగిస్తే **అనగా**, 1 కా(ము)కః 2. సు(ర)తప్రియా 3.కా(ము)కీం 4. కాం(తా)ననే అలోని రెండవ అక్షరాలను తొలగింపగా, 1కాకః 2సుతప్రియాం 3 కాకీం 4 కాననే నిత్యంశ్రయతే = కాకి-సంతానోత్పత్తినిగోరిన - ఆడుకాకిని - అడవిలో ఎల్లప్పుడు అనుభవించుచున్నది - అను అర్థము కూడ ప్రత్యుత్తరముగా సమన్వయించుచున్నది.

2. దీనిలో ఏకోత్తరమగు లిపా, ఒకటి తర్వాత రెండవదగు అక్షరం చ్యుతమై, పై చమత్కారాన్ని లభింపజేసినది. అంతేకాక, ఉత్తరార్ధంలో కొన్ని అక్షరాల విచ్యుతితో కాననే- చర- రతిం అనునది కూడ లబ్ధంకావడంతో, కాననే =కుత్సితమైన మొగం గలదానా! లేక అడవిలో, రతిం- చర = హాయిగా సంభోగమునాచరించి, సుఖింపుము అను విశేషార్థము కూడ ప్రతీయ మానమగుచున్నది. (చ(తు)ర(క్ష) ర(వి చ్యు)తమ్)

3. ఇంకా, ఇది ఏకాక్షరచ్యుతకము కూడ కాదగియున్నది.

106 శ్లో. సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే,
చండాశోర్నిశి కా కథా? రఘుపతే! చంద్రో౽ య మున్మీలతి।
వత్సైత ద్విదితం కథం ను భవతా? ధత్తే కురంగం యతః
క్వాసి ప్రేయసి ! హా కురంగనయనే! చంద్రాననే! జానకి! ప్ర. రా.

సం. సీతా వియోగి యగు రామునకు లక్ష్మణునకు జరిగిన సంభాషణ. ఆరాత్రి అతడు వెన్నెలలో కూర్చుండి, విరహిక వడం వల్ల, చంద్రికను చండాశు (సూర్య) కిరణజ్వాలలుగా భావించి, లక్ష్మణునితో ఇట్లనుచున్నాడని ప్రసన్నరాఘవ కర్త వర్ణన,

రాముని ప్రశ్న1. ఓయీ లక్ష్మణా!అదుగో చండభానుడు (సూర్యుడు) క్రమంగా విజృంభిస్తున్నాడు. ఆ చెట్టు నీడలోనికి వెళ్లితే బాగుంటుంది.

లక్ష్మణ ఉ. రఘుపతి! ఇది రాత్రి. రాత్రికి చండకిరణుడు ఎక్కడ నుండి వస్తాడు? చంద్రోదయం అవుతోంది గదా!

2.వత్సా! ఆసంగతి నీ కెలా తెలిసిందయ్యా! ఉ. ఆ చంద్రుడు మధ్యలో కురంగాన్ని (లేడిని) ధరించి ఉండటం చూచుట వలన. అంత శ్రీరాముడు ఈ ''కురంగ'' పదం వినడంతోనే, సీత నూహించుకొని, హా కురంగనయనే! చంద్రవదన! జానకి! ఎక్కడున్నావో కదా? అని పరిపరివిధాల పలవించుచున్నాడు.

107.శ్లో. హాలాహలో నైవ విషం విషం రమా
జనాః పరం వ్యత్యయ మత్ర మన్వతే।
నిపీయ జాగర్తి సుఖేన తం శివః
స్పృశ న్నిమాం ముహ్యతి నిద్రయా హరిః॥

సం. ఒకపుడు ఒకరికి మరొకరితో సంవాదం జరుగకపోవచ్చు) అప్పుడు తనలో తానే ప్రశ్నించుకొని, ప్రతివచనం చెప్పుకొంటాడు. దానికిది ఒక ఉదా.

సం. పూర్వం దేవదానవులు పాలసముద్రాన్ని తరచునపుడు పుట్టిన ఈ ''హాలాహలం'' అను విషం సంగతే తెలియక ప్రజలు దాన్ని ఘోరకాకోల విషం అన్నారు. వాస్తవానికి అది శుద్ధ - అబద్ధం. అసలైన విషం ఏదంటే- అది ''లక్ష్మి''(=సంపద). ఎందుచేత నంటారా ఆలోచించండి. నిజంగాదాన్ని మస్తుగా త్రాగిన శివుడు, ఏ ఇబ్బంది, చావు లేకుండా హాయిగా, సుఖంగా మేల్కొనియే ఉన్నాడు. కాని, సముద్రంలోపుట్టిన అసలు విషమైన ఈ లక్ష్మిని (సంపదను) తాకినంత మాత్రాన తన్మయత్వం చెందిన విష్ణువు మాత్రం, మూర్ఛితుడైనట్లు నిద్రాముద్రితుడై ఉన్నాడు సుమా! కనుక అసలు విషమంటే లక్ష్మి ( సంపద) యే అవి

భావం. మధ్యలో వచ్చిన సంపదతో ఆతడు మతమత్తచిత్తుడై, కళ్ళుమూసుకుపోయినాడని గూఢార్థం.
వి. ఇక్కడ మరొకరి ప్రశ్నలేకున్నా, తానే ప్రశ్నించుకుని, దానిని సమాధానంతో అవహ్వానం చేయడం మాత్రం విశేషాంతరం.

## కొందరు మహాకవుల మాన్యసంవాద వైచిత్ర్యాలు.

108 కొందరు మహాకవుల మహనీయ కావ్యాలలో సంభావ్యాలైన సంవాదచిత్రములెన్నో సంధడిస్తున్నా, మచ్చుకు మరికొన్ని ఉదాహరణలను ఊరీకరించండి.

ఈ సందర్భంలో కొంచెం పెద్దదయినా, కాళిదాస మహాకవి ''రఘువంశాది'' కావ్యాలలోని సంవాదచిత్రాలను కాదని, అపచారం కొని తెచ్చుకోలేముకదా! అవి కతిపయ పండితులకు కంఠస్థాలు కావచ్చు. కాని, సంస్కృతంలో సరైన పరిచయం లేని సాధారణ పాఠక మహాశయులకు, వానిని చూపించక, చూస్తూ ఉపలపించలేము. మచ్చుకు, కాళిదాసు యొక్క రఘువంశ, కుమారసంభవ, శాకున్తలాదుల నుండి, ఒక్కొక్క సంవాదచిత్రాన్ని సంభావించండి.
సం. రఘువంశ రెండవసర్గలోని "సింహదిలీపుల సంవాదాల" ను సంగ్రహంగా శ్లోకసంఖ్యతో నిస్తున్నాము. అసలే, బాహుప్రతిష్టంభంతో, గో సంరక్షణ చేయజాలక, మంత్రౌషధి రుద్ధవీర్యమగు మహాసర్పం వలె, ముడిపడుచున్న ఆదిలీపునికి, ఆ సింహం మనుష్యవాక్కుతో మరొక మహాశ్చర్యాన్ని కూడా కల్గించినదట.
(శ్లో. బాహుప్రతిష్టంభ ----- మంత్రౌషధి రుద్ధవీర్యః రఘు 2-32)

రాజా! ఎందుకయ్యా అంత శ్రమపడుతున్నావు? ఇక్కడ నీ శస్త్రాస్త్రాలన్ని వ్యర్థాలే. అవేమీ పనిచేయజాలవు. వాయువేగం చెట్లను పెకలింపవచ్చునుగాని, పర్వతాలను కూడ ప్రకంపింపచేస్తుందంటావా? యథా శక్తి, శక్తిని మించికూడ నీశిష్యభక్తిని చిత్రంగా ప్రదర్శించావు. నీ తప్పేమిలేదు. (అలం మహీపాల! .... దర్శితశిష్యభక్తిః -2-40)

ఏకచ్ఛత్రాధి పత్యమగు నీ ప్రభుత్వంగాని, నవయౌవనంగాని, అందమైన ఆకారంగాని, మాన్యవిషయాలను కొంటున్నావా? ఇవేమీ ఆలోచింపక, నీశరీర భక్షణంతో నన్ను తృప్తిపడుమంటావా? అంత మాత్రం ఆలోచింపలేని, కార్యాకార్యవిచక్షణ లేని, మూర్ఖుడవా? ( ఏకాతపత్రం జగతః ప్రభుత్వం --- (2-42) మదీయ దేహేన ప్రసీద (2-45) విచారమూఢః ప్రతిభాసి మే త్వమ్ 2-47), అలాకాక నీవు జీవించి యున్నచో, ప్రజలను కన్న తండ్రి వలె కాపాడగలవు. సమృద్ధరాజ్యము దేవేంద్రపదవి వంటిది.
( ప్రజాః పితేవ పాసి (2-48) ఋద్ధం హిరాజ్యం పద మైంద్రమాహుః -2-50)

ఇట్లు, మృగాధిరాజమగు (సింహ) సంభాషణ విన్న దిలీపుడు, కాతరాక్షియగు గోవును చూస్తూ, క్షతం (నాశం) నుండి రక్షించేవాడేగదా! క్షత్రియుడు. ఆపని చేయలేని, నా వంటి క్షత్రియబ్రువుడు చావడం మంచిది. బ్రతికి సాధించేదేమున్నది? (క్షతాత్ కిల త్రాయత ఇతి...) ఓ మృగరాజా! ఈ ఆవు సామాన్యమైనది కాదు. కామధేను సమాన. కావున నా ప్రాణ వ్యయంతో, గురుధనాన్ని గుర్తించి, రక్షించు. ఏనాటికైనా నశించే, ఈ పార్థివ శరీరమంటే, మాకంతగా శ్రద్ధలేదు. ఆలాప పూర్వక సంభాషణ సాప్తపదీనము గదా! అది నేడు మనకు సంప్రాప్తమైనది. కనుక ఆ మాత్రం సాయం చేసి,

సంరక్షింపుమని రాజు ప్రార్థన.

ని. మొత్తం మీద ఈ సంవాదం వలన, కాళిదాసమహాకవి మనకెన్నో ధర్మసూక్ష్మాలను, రహస్యాలను, కనరాకుండ తెల్పి, కరతలామలకం చేశాడో ఆలోచిస్తేగాని తెలియదు.

109. ఇలాంటిదే ''కుమారసంభవం'' లోని శివపార్వతుల సంవాదం కూడ. కపటవటుడు పార్వతి యొక్క పంచాగ్ని మధ్య తపస్సును గురించి ప్రశ్నించి, సఖీ ! ఈ పార్వతి కోరుకున్న వరుడెవడో, సౌభాగ్యమద మత్త చిత్తుడైనట్లున్నాడుగదా! (అవైమి సౌభాగ్య మదేనగర్వితం--- 5-49) పార్వతీ! ఇంకా ఎంత కాలం నిరీక్షిస్తావు? నిన్ను చూస్తే జాలి వేస్తుంది పూర్వాశ్రమ సంచిత తపస్సు, నా వద్ద కూడ ఎంతో పడి ఉన్నది. దానిలో సగం నీకిస్తాను అసలా వరుడెవ్వడో మాత్రం నాకు తెల్పు. (5-50) అని అడుగగా, పార్వతి ప్రక్కనున్న చెలి కత్తె వైపు చూచినదట!

ఇంగిత జ్ఞ యగు చెలి, విషయమంతా వివరించి, ఈమె శివుని భర్తగా కోరి, (పినాకపాణిం పతి మాప్తు మిచ్ఛతి--- 5-53) అందుకోసం అన్యమార్గాన్ని కానక, కఠోరతపస్సే తత్సాధనమని, ఈ తపోవనానికి వచ్చింది. (ఇయం ప్రసన్నా తపసే తపోవనమ్ - 5-59) అని చెప్పగా, నైష్ఠిక సుందరుడగు ఆ బ్రహ్మచారివటువు ఈ సఖి చెప్పిన దంతా నిజమా లేక పరిహాసమా? (అయీదమేవం - పరిహాసః? 5-59) అని తన హర్షాన్ని పైకి పొక్కనీయక పార్వతిని అడుగగా-

పార్వతి :- భో వేదవిదాంవర! నీవు కన్నది, విన్నది అంత నిజమే ఉన్నత పదాన్ని ధిక్షించాలనుకొని, తపస్సును ప్రారంభించినాను కోర్కెలకు అంతేమున్నది? (యథా శ్రుతంవేదవిదాంవర! -- మనో రథానా మగతి ర్నవిద్యతే 5-64) అంటూ చెప్పెను.

ఓహో! అమంగళాభ్యాసరతుడగు ఆ శివుడా వరుడు! అతని సంగతి తెలిసి కూడ, మరల అతనినే, కామించుచున్న నిన్ను, నేను సమర్థింపజాలకున్నాను. సుమా! (తవానువృత్తిం న చ కర్తుముత్సహే 5-65) అతనికి నీకు హస్తిమశకాంతరం. వలయీ కృతాహియగు వాని హస్తాన్ని ఎలా గ్రహిస్తావమ్మా! (5-67) వధూదుకూలము గజచర్మము, ఈ రెండూ ఎప్పుడైనా కలుస్తాయా? (5-67) అలక్తకరసాంకితములైన నీ అడుగులు వల్లకాట్లో వేయడానికి, నీ శత్రువైనా అంగీకరిస్తాడంటావా? (5-67). హరి చందనా స్పదమగు నీ స్తన ద్వయం చితాభస్మ రజస్సుతో రాణిస్తుందా? (5-69,70).

ఆ చంద్రకళ ఒక్కటే కాదు, నేడు నీవు కూడ దానితో పాటు శోచనీయ స్థితిలో పడిపోయి ఉన్నావు. వివాహానంతరం ఆ ముసలి ఎద్దునెక్కి, అతనితో వూరేగుతూ ఉంటే చూచిన మహాజనులంతా పరిహాసం చేయకుండా ఉంటారా?(5-71) ఏమిచూసి వాడిని మోహించావు? వరునికుండవలసిన లక్షణాలలో, ఒక్కటైనా వానిలో ఉన్నదా? (తదస్తి కిం వ్యస్త మపి త్రిలోచనే? 5-72) ఈ అనిష్ట మనోరథాన్ని మానుకో స్మశానశూలానికి, యూపసత్క్రియ యుక్తరూపమౌతుందా?(5-73) అని అనేకవిధాల హెచ్చరింపగా-

పార్వతి, పెదవులు కంపింప, కన్నులెఱ్ఱచేసి, ఓయీ! ఆ పరమేశ్వరుని పరమార్థాన్ని ఎఱుగని, నీవంటి మందబుద్ధులు ఇలాగే ద్వేషిస్తారు. (5-78) దేవతలతో సహా అందరూ వానినే కోరుకుంటారు. తాక అకించనుడైనా అందరికీ అతడు సర్వసంపదలనిస్తాడు (5-79) అతని సంగతి యథార్థంగా అందరికీ

తెలియదు (5-77) ఇన్ని విధాల దూషించిన, నీవు కూడ ఒక్కటి మాత్రం నిజం చెప్పావు అతడు నిజంగా అలక్ష్యజన్ముడే (5-81) --- ఇంకా నీతో నాకు సంవాదమెందుకు ? నా భావమంతా అతని పైనే సంలగ్నమై ఉన్నది. అది అపనిందలను సహించదు. (5-82) చెలీ! ఇతడు ఇంకా ఏదో వాగాలనుకుంటున్నాడు ముందు, అతనిని ఆవలికి పంపు మహాత్ములను దూషించిన వారేకాక ఆ నిందలను విన్నవారుకూడా పాపభాక్కు లౌతారు సుమా! లేకపోతే నేనే ఇక్కడనుండి వెళ్ళిపోతాను సుమా! (5-84) అని పార్వతి ప్రత్యుత్తరించినదట.

వి. ఈ సంవాద చిత్రమెంత విచిత్రంగా ఉన్నదో గమనించండి.

**110** శాకున్తలం

కాళిదాసమహాకవి "శాకున్తలం"లోని మరొక ఉదాహరణాన్ని కూడ మన్నించండి.

శార్ఙ్గరవః :- శ్లో॥ కిం కృత కార్యద్వేషః? ధర్మం ప్రతి విముఖతా? కృతావజ్ఞా?

రాజా :- కుతోఽయ మసత్యకల్పనా ప్రశ్నః?

శార్ఙ్గరవః :- మూర్ఛ న్త్య మీ వికారాః ప్రాయే ణైశ్వర్య మత్తేషు ॥ శా. 5-18

సం. దుర్వాస శాపగ్రస్తుడగు దుష్యన్తుడు, ఎన్ని విధాల గుర్తుచేసుకున్నా శకుంతలా వివాహ విషయం మాత్రం అతనికి గుర్తురాక చివరికి ''ఈ పూజ్యురాలు నాచే పరిణీత పూర్వయా?'' - అని, అసలుకే మోసం తెస్తూ మాట్లాడగా, కొంచెం కోపం తెచ్చుకున్న చురుకైన వాడగు శార్ఙ్గరవుడు, కొంచెం కరుకుగా ఇట్లు అనుచున్నాడు.

రాజా! మేమే లోకతంత్ర నిష్ణాతులమనుకుంటున్నావేమో! ఆవిషయం అలా ఉంచు ఇప్పుడు ఈమెను నేను పూర్వం వివాహమాడినానా? - అని కూడ సందేహిస్తున్నావు! ఇదేమి న్యాయమయ్యా! తాత్కాలిక సుఖం కోసం ఏవో మాయమాటలు చెప్పి చేతలు ముగించుకొని, ఆప్రయోజనం తీరగానే, అపకీర్తికి భయపడి, చేసిన అపనినే ద్వేషిస్తున్నావా? లేక ధర్మసంతానార్థం గాంధర్వ వివాహమాడి, ఇప్పుడాధర్మం విషయంలో వైముఖ్యం వహిస్తున్నావా ఏమిటీ దురన్యాయం ? - అని గట్టిగా ప్రశ్నింపగా,

రాజు - (బిత్తరపోతూ) ఏమిటి బాబూ! ఈ అసత్యకల్పనా ప్రశ్న? - అని ప్రత్యుత్తరింప, శార్ఙ్గ - ఔనులే రాజా! ఇలాంటి కృతకార్యద్వేషాదిదోషాలు, సహజంగా ఎక్కువగా ఐశ్వర్యమద మత్తచిత్తులగు వారి విషయంలో పెరిగి మూర్ఛ కలిగించడం నైజమేకదా- అని సోపహాసంగా ఆదుష్యంతుని అధిక్షేపించాడు.

వి.1 మొత్తం మీద ఇదొక చిక్కు సంవాదం. మధ్యలో రాజును సరిగా మాట్లాడనియ్యకుండా, శిష్యుడే అధిక్షేపిస్తూ, తపస్వుల, లోక తంత్ర నిష్ణాతతను నిరూపించుకొన్నాడు.

**111**.శ్లో. సర్వక్షితిభృతాం నాథ! దృష్టా సర్వాంగసుందరీ ।

రామారమ్యే వనాన్తే ఽస్మిన్ - మయా విరహితా త్వయా ॥ విక్ర.

సం. సంవాదాలలో సాధారణంగా ఒకరు ప్రశ్నించడం, దానికి మరొక వ్యక్తి ప్రత్యుత్తరించడం సర్వసాధారణం కాగా, ఇక్కడ, కాళిదాస మహాకవి ఆ ప్రత్యుత్తరాన్ని వ్యక్తితో కాక, అ చేతనమైన పర్వతం (గుహ)తో ప్రతిధ్వనింపజేసి, తన "కవికుల తిలక" త్వాన్ని కన్నులకు కట్టినట్లు చాటుకున్నాడు.

విరహి, కామియగు పురూరవుడు, "విక్రమోర్వశీయ" త్రోటకం (ఒక రూపకభేదం)లో లతగా మారిన ప్రేయసి యగు "ఊర్వశి" ని వెదకుచూ, త్రోవలో కన్పడిన ప్రతిదానిని ప్రశ్నిస్తూ, ప్రస్తుతం

ఎదురుపడిన పర్వతాన్ని ఇలా ప్రశ్నిస్తున్నాడు.

అర్థం : (హే) సర్వక్షితి భృతాం నాథ! ఓ పర్వతరాజమా! అస్మిన్ - రమ్యే - వనాన్తే - మయా - విరహితా - సర్వాంగ సుందరీ - రామా - త్వయా- దృష్టా ? = ఈ - మనోహర - వన (మధ్య) మున- నాతో- ఎడబాటునొందిన - సర్వావయవ సుందరియగు - ఊర్వశి- నీచే - చూడబడినదా? అని పురూరవుడు పర్వతాన్ని ప్రశ్నిస్తాడు.

ఆప్రశ్నయే, కొండ గుహలో ప్రవేశించి, కించిద్భేదంతో, "సర్వక్షితిభృతాం నాథ! - (రాజన్!) అస్మిన్ ---- త్వయా - విరహితా - రామా - మయా - దృష్టా" = రాజా! ఈ రమ్యవనంలో- నీ విరహం పొందిన ఊర్వశి - నాచే - చూడబడినది సుమా! - అను పర్వత గుహ - ప్రతి ధ్వని ప్రత్యుత్తరంగా, కామియగు రాజుకు వినబడిందట!

వి.1. ఈ శ్లోక- చతుర్థపాద మధ్యమునందున్న "విరహితా" అను పదం, "దేహళీదత్త దీపన్యాయం" తో దానికి ముందు, వెనుకల నున్న "మయా & త్వయా" లతో చెరొకసారి సమన్వయించడంతో, ఇట్లు భ్రాంతి చెందుటకవకాశం కల్గింది. రాజు "మయా- విరహితా- రామా -త్వయ- దృష్టా? = నాతో- వియోగంచందిన ఊర్వశి- నీచే -చూడబడినదా?" అని ప్రశ్నింప, రండవ ప్రత్యుత్తరములో, "త్వయా" ముందుకు, "మయా" వెనుకకు పోగా, "త్వయా- విరహితా - రామా- మయా- దృష్టా" = నీచే- విడువబడి విరహం చెందిన- ఊర్వశీ సుందరి - నాచే -చూడబడినది - అను ప్రతిధ్వని ప్రత్యుత్తరంగా మారి లభించినది.

2 ఆయన, అంత గొప్ప మహారాజు కదా! అచేతన పర్వతాన్నిలా - అమాయకుని వలె ప్రశ్నించాడు- అనే ప్రశ్నకూడ రావచ్చును.- అని కాళిదాస కవి అంతకు ముందే, తన "మేఘసందేశ" కావ్యంలో, పూర్వం ఒక యక్షుడు మేఘంద్వారా తన ప్రియురాలికి సందేశం పంపించాడు- "అదెట్లా సాధ్యం"? అనే ప్రశ్నరావచ్చునని అక్కడే, "కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు" (కామపీడితులగువారు చరా చరముల విషయంలో, లోభంతో అవివేకంగా ప్రవర్తిస్తారు గదా) అను "అర్థాంతరన్యాసాలంకారం" తో, అక్కడ ఇచ్చిన వివరణను, ఇక్కడ కూడ సమాన్వయించుకోవలెను.

3. మొత్తం మీద మహాకవి కూడ శబ్దచిత్రవైచిత్ర్యానికి తల వగ్గినాడన్నమాట.

4. మహా కవుల కావ్యాలలో ఇట్టి మహాసంవాదాలెన్నో ఉన్నా విస్తరభీతిచే విడువబడినవి.

"**నైషధం విద్వదౌషధమ్**" (అలసిన, అనారోగ్యవంతులగు కవి, పండిత, సహృదయ పాఠకులకు "నైషధ"మను శ్రీహర్షుని కావ్యం, ఔషధం (మందు)గా "అనుపానం" గా కూడ పనిచేసి వారికి ఆరోగ్యమహాభాగ్యాన్ని ప్రసాదిస్తుంది. అని ప్రసిద్ధిగాంచిన ఆ శ్రీహర్ష మహాకావ్యం నుండి కూడ ఉదాహరణములను ఉరరీకరించి, ఊపిరిపీల్చుకుందాం.

112.శ్లో. అమృత దీధితి రేష విదర్భజే! భజసి తాప మముష్య కిమంశుభిః ?

యది భవన్తి మృతా సఖి చన్ద్రికా - శ్శశభృతః కృతదాహ పరిగ్రహే ॥నై 9-104

విరహతప్తయగు తనను సముదాయిస్తూ ఉన్న సఖీ వాక్యాలకు, శ్లేషవక్రోక్తులతో, అన్యార్థాలతో, వతను గల్గించుచున్న, దమయంతి సంవాదమిది.

అర్థం :- వైదర్భీ! ఎదురుగా నున్న ఈము "అమృతకిరణుడు" గా ప్రసిద్ధిగాంచిన చంద్రుడు, అమృతాంశుకిరణాలతో నీవు చల్లదనాన్ని పొందక, తద్విపరీతంగా, తాపాన్ని పొందుచున్నావేమి? - అని (సఖి) ప్రశ్న.

సఖీ, ఆచంద్రుని వెన్నెలయు నిజంగా సుధలు (అమృతాలు) అయినచో, అవి నాకు చల్లదనం కల్పించి, సంతోషపెట్టాల్సింది పోయి, వేడిగా, తాపాన్ని, కల్గించి వేసగిస్తున్నాయేమి? - అని దమయంతి సమాధానం

వి.1 ఈ చంద్రుడు "అమృతదీధితి" అని, కవిపండితులు అబద్ధంగా అభివర్ణించి,నాకెంతో దుఃఖాన్ని కల్గించారు. "మృతదీధితి" అని నిజం చెప్పితే నాకింత దుఃఖం కల్గేదికాదుకదా !

2. ఇక్కడ, "అమృత" శబ్దం "సుధ" అనే అర్థంలో చెప్పబడగా, దమయంతి దానిని మృతేతర = (న-మృత) చచ్చినది కానిది = బ్రతికి యున్నది- అనే అర్థాన్ని అన్వయించడంతో, దీనిలో వక్రోక్తి అనే అలంకారంకూడా వ్యక్తమౌతుంది.

113.శ్లో॥ హృదయ ఏవ తవాస్తి వల్లభః - తదపి కిం దమయన్తి విషీదసి?

హృది పరం న బహిః ఖలు వర్తతే - సఖి! యత స్తత ఏవ విషీద్యతే ॥ నై 4-109

దమయన్తీ! ఆసి ప్రియుడగు నలుడు నీ హృదయంలోనే కాపురముంటున్నాడు కదా! అయినా, ఇంకెందుకు అంతగా దుఃఖిస్తావు? - అను సఖీ ప్రశ్నకు, భైమీ సమాధానం ఏమనగా - అవునే, సఖీ! నీవు చెప్పినదంతా నిజమే! అతడు నా హృదయంలోనే దాగి, బైటకు మాత్రం రావడం లేదు నాకు కన్పడనందుననే, నేను దుఃఖింపవలసి వస్తోంది సుమా!

వి. మొత్తం మీద ఆ నలుడు స్మరింపబడుచున్నాడుగాని, కంటికి మాత్రం కన్పడటం లేదు. అందుచేతనే, అంతగా, ఏడ్వవలసివస్తున్నదని భావం.

114. శ్లో. స్ఫుటతి హారమణౌ మదనోష్మణా - హృదయమ ప్యనలం కృత మద్య తే ?

సఖి! హతాస్మి తదాయది హృద్యపి - ప్రియతమ స్స మమ వ్యవధాపితః ॥ నై 4-109

ఓభైమీ! నీ ఎదపై అలంకారంగానున్న నాయక (తరళ) మణి, నీ కామజ్వరం యొక్క వేడితో పగిలిపోగా, నీరొమ్మిపుడు అలంకార మే మాత్రములేనిది ( అ-నలంకృతం) గా అయిపోయినది సుమా! అని సఖి చెప్పగా, దమయన్తి- "నిజమే", "అ-నలం-కృతం" = నలుడు-లేనిదిగా చేయబడినది. అంతేగాక ఆ నా ప్రియతమ-నలమహారాజు నాహృదయం నుండి కూడ దూరంగా చేయబడినవాడైనచో, అప్పుడు, నేను "అనలం-కృతం" = అగ్నితో-కాల్చబడినదానితో సమానురాలినే అవుతాను. అనగా, చచ్చినదానితో సమానురాలనే- అని వ్యంగ్యంగా వక్రోక్తితో ప్రత్యుత్తరించినదట!

వి.1 ఇక్కడ "అనలంకృతం" అను వాక్యం ,సఖిచే, న+ అలంకృతం = అలంకరింపబడలేదు - అనే అర్థంలో చెప్పబడగా, దమయన్తి, ఆ వాక్యానికి శ్లేషతో మరొక అర్థాన్ని లాగి, నాహృదయము "అ+నలం - కృతం" ( = నలుడులేనిదిగాచేయబడినది) అయినచో, అప్పుడు నేను, "అనలం-కృతం" = అగ్నిలోపడి చచ్చి, పిడికెడు బూడిదయైన దానినిగా చేయబడియుందును. - అని ఇట్లు వైదర్భి చెప్పిన వాక్యార్థాలకు కూడ "శ్లేషవక్రోక్తి" యే మూలాధారము

2. (i) న+ అలంకృతం = అన్- అలంకృతం = అనలంకృతం = హృదయము అలంకరింపబడలేదు. అని ప్రస్తుతార్థం.

(ii) న- నలం-కృతం = అన్- అలంకృతం= అనలంకృతం = నలుడులేనిదిగా చేయబడినది.

(iii) అనలం - కృతం = అగ్నిలో కాల్చబడి, బూడిదగా చేయబడినది - అనే, ఈ అర్థాలన్నీ శ్లేష ప్రభావంతో వచ్చిన వక్రోక్తులని సహృదయులు గమనించే ఉంటారు.

115.శ్లో॥ అన్నదానం మయా దత్తం రత్నాని వివిధాని చ ।

న దత్తం మధురై ర్వాక్యైః తే నాహం సూకరాన్వయః ॥

సం. 14 సం॥ల అరణ్యవాసానంతరం పట్టాభిషిక్తుడైన రామచంద్రుడు "బీదసాదలకు దానం చేయు" మని హనుమంతుని ఆదేశించాడట. ఎన్నోదినాలు, ఎంతో ఉత్సాహంతో, అన్నవస్త్రాలు దానం చేసినా, "అన్నమో, రామచంద్రా! ఓలో లక్ష్మణా!" అంటూ వచ్చే జనం మాత్రం తగ్గలేదట. అందుచేత అలసిపోయిన ఆంజనేయుడు మాత్రం వచ్చినవాళ్లను తర్జిస్తూ, భర్జిస్తూ, ఏ కొద్దో గొప్పో వారి ముఖాన విసరడంతో, క్రమంగా అర్థిజనులు ఆగిపోయారట.

దీని క్షిష్టపడని శ్రీరాముడొకనాడు నగరంలో తిరుగుచుండగా, త్రోవలో ఒక వంకరమూతి గల సన్యాసి ఎదురుపడినాడట? వానికి నమస్కరించి మహానుభావా! అంతా బాగానే ఉంది. నీకు ఆ "పంది మూతి" మాత్రం ఎలా వచ్చింది? అని అడుగగా, అతడే పైశ్లోకం ప్రతి వచనంగా చెప్పాడట!

ఆర్యా! రామచంద్రా! పూర్వజన్మలో నేనెన్నో అన్న సంతర్పణలు చేసాను. కాని, ఆ చేసే దానం భక్తి శ్రద్ధలతో, వినయవిధేయతలతో, మంచి మాటలు చెప్పుచూ చేయలేదు. కఠోరంగా, కస్సుబుస్సుమంటూ , విసుక్కుంటూ దానం చేయడం వలన, ఈ జన్మలో నా మూతి కాస్త "పందిమూతి" గా మారింది. - అని చెప్పాడట.

అప్పుడు శ్రీరాముని వెంటనే "బాడీగార్డు" గా వస్తున్న సూక్ష్మబుద్ధిగల హనుమంతుడా సన్యాసిమాటల్లోని పరమార్థాన్ని పదిలంగా గ్రహించి, ఆ నాటి నుండి ప్రియవాక్యాలతో పిల్చి, దానం చేయడం మొదలుపెట్టాడట.

వి1 శక్తి కొలదీ మంచి మాటలతో ఏకొంచెం దానం చేసినా, అర్థులందరూ ఆమందానందాన్ని అనుభవిస్తారు. కనుక "వచనే కా దరిద్రతా"? = మాటలో కూడ దరిద్రమా? ఎందుకు? చేసేదానం చేస్తూ మాటల్లో దారిద్ర్యం చూపరాదని భావం.

2. ఈ శ్లోకం '' నీమూతి పందిమూతి ఎందుకయినది.'' అనే ప్రశ్నకు సమాధానం.

116.శ్లో. అహం చ త్వం చ రాజేంద్ర! లోకనాథా వుభా వపి ।

బహువ్రీహి రహం రాజన్! షష్ఠీతత్పురుషో భవాన్ ॥

సం. అధికార రోగ పూరిత బధిరాంధుడగు రాజొకడు. సర్వవిద్యాపారంగతుడగు పండితుని పిలిచి ఓ దరిద్ర దామోదరా? అందరినీ అడుక్కుతినే నీకు, అందరినీ అడ్డులేకుండా పరిపాలించే నాకు, సంబధం ఏముంది ? మన అంతరం హస్తిమశకాంతరం సుమా! - అని అధిక్షేపించాడట. దానికి ఈశ్లోకం పండితుని ప్రత్యుత్తరంగా భావించాలి.

రాజా! నీకూ నాకూ చెప్పుకోదగిన పెద్దతేడా, మొత్తం మీద ఏమీ లేదయ్యా. ఉన్నదల్లా ఒక్కటే భేదం. అది సమాసభేదం, నేను "బహువ్రీహిని" కాగా, నీవొక "తత్పురుషవు"- అన్నాడట! ఆరాజుకేమీ అర్థంకాకపోతే, ఆ విద్వాంసుడు ఇట్లా వివరించాడట.

వి.1 లోకః ( ఏవ) నాథః యస్య సః = లోకనాథః, లోక (జన) మంతా ఎవనికి ప్రభువో, అతడు "లోకనాథః".- అనగా, నాకు ప్రజలే ప్రభువులు గనుక, ఈ విచిత్రమైన బహువ్రీహి సమాసంతో, నేను లోకనాథుడనైనాను.

2. ఇక నీవో "లోకానాం నాథః" (ప్రజలకు నాయకుడు, ప్రభువవు) గనుక ఈ షష్ఠీతత్పురుష సమాసంతో నీవు "లోకనాథుడవైనావు". మొత్తం మీద ఇద్దరం "లోకనాథులమే" సుమా! అని సమాధానం చెప్పి , రాజును సమానస్థితికి తెచ్చాడట!

3 తత్పురుష సమాసంలో "ఉత్తరపదార్థం ప్రధానం" కాగా, బహువ్రీహిలో "అన్యపదార్థం" ప్రధానమౌతుం దని ముఖ్యంగా గమనింపవలెను.

117.శ్లో అలం కరోతి యః కావ్యం శుక ఏవ న మధ్యమః।

అలం కరోతి యః కావ్యం శుక ఏవ న మధ్యమః॥

సం. కవులిద్దరూ తమ అభిప్రాయములనిట్లు సంవదించి, వివరిస్తున్నారు.

ఎవడు కావ్యాన్ని, లేక శ్లోకాన్ని, చక్కగా అలంకారయుక్తంగా తీర్చిదిద్దుతాడో, వాడు "న" నకారం మధ్యలోలేనందున, "శుకము" = (చిలుక లేక శుక మహర్షివంటివాడు) అగుచున్నాడు. అనగా, "శునక" శబ్దం నుండి, మధ్యలో నున్న "న" కారాన్ని లుప్తం చేయగా, శుకం గా మిగిలినట్లు, అలంకారయుక్తంగా వ్రాసినవాడు శుకతుల్యుడవుతాడని ఒక కవి తన అభిప్రాయాన్ని విశదీకరింపగా- మరొక కవి, అవును, నీవు చెప్పినట్లేకాక, ఎవడు కావ్యాన్నో, శ్లోకాన్నో అలం = అలంకారాలు చాలులే, అన్నట్లుగా అలంకారాలు లేకుండా రచిస్తాడో, ఆ కవి "నమధ్యమః" ( = "న" కారః మధ్యే యస్యసః) = "న" కారం మధ్యలో కలవాడు అనగా శుక శబ్దానికి మధ్యలో "న" కారముంచగా, తయారైన "శు(న)క" = నీచ జంతువగు కుక్కయే అవుతాడు, కాని "శుక" తుల్యుడు మాత్రం కాజాలడని భావం తెల్పినాడు.

వి.1 "అలం" శబ్దానికి "భూషణ" మనే కాక, చాలు.... మొదలగు అర్థాలెన్నో కోశాలలో నున్నవి. సంవాదం ప్రశ్నరూపంలో లేకున్నా, సముచ్చయరూపంలో సంభావ్యమాన మౌతుంది.

3. కావ్యం కు బదులు శ్లోకం అనుపాఠాన్తరం కూడ ఉన్నది.

118.శ్లో. క స్త్వం?, జ్ఞాస్యసి మాం, స్మర! స్మరసిమాం? దిష్ట్యా, కి మభ్యాగతః?

త్వా మున్మాదయితుం, కథం? నను బలాత్, కిం తే బలం? పశ్యతత్।

పశ్యా మిత్యభిధాయ, పావకముచా యో లోచనే నైవతం

కాన్తాకంఠ నిషక్త బాహు మదహత్ తస్మై నమః శూలనే, ॥ వ.జీ 2-33

సం. శంకరునికి మన్మథునికి ప్రశ్నోత్తర రూపమున జరిగిన సంవాదము.

1 శంకరుని ప్రశ్న :- కఃత్వం = నీ వెవడవు? మన్మథుని ప్రత్యుత్తరము. నేనెవడనో తెలుసుకొనగలవు.

2. స్మర! స్మరసిమాం = మన్మథా! నేనెవరినో నీకు గుర్తున్నదా? దిష్ట్యా అదృష్టవశమున, ఇంకా, గుర్తున్నాను.

3. కిం అభ్యాగతః? = అతిథిగా వచ్చినావా? ఉ. త్వాం ఉన్మాదయితుం = అవును, నీకు ఉత్తేజం కల్గించుటకు వచ్చినాను.

4. కథం? = ఎట్లు కల్గిస్తావయ్యా! ఉ నను, బలాత్ = ఓయీ! నాబలంతో

5. కింతేబలమ్ = నీ బలము ఎంతటిది? ఉ. పశ్య - తత్ = దానిని ( ఇప్పుడే, ఇదిగో) చూడుము

6. పశ్యామిః చూస్తానులే- అని చెప్పి, కాం తాశ్లిష్ట భుజాయుగల మన్మథుని, అగ్నిని విడచిన కంటితో ఎవడు దహింపచేసెనో, అట్టి త్రిశూలధారికి నమస్కారము.

వి. ఇక్కడ, కవి, శంకరపర్యాయ పదాలెన్నో ఉండగా, వానిలో ఒక్క శూలి పదాన్నే ప్రయోగించడం వలన, అట్టి శూల ఆయుధ ప్రయోగం చేయక, కేవల నేత్రంతోనే అగ్నిని విడచి దగ్ధం, చేసిన ఆ శూలికి నమస్కారం చేయడం తప్ప ఇంకేమి లేదని భావం.

119.శ్లో. అంబా కు(తు)ప్యతి న మయా, న స్నుషయా, సాపి నాంబయా, నమయా
అహ మపి న తయా నతయా, వద రాజన్! కస్య దోషో౽ యమ్? ॥

సం. ఈ పద్యం మల్లి నాథ సూరి వంశస్థుడగు "కపర్దిస్వామి" దని కొందరంటారు. ఇది "భోజప్రబంధం" లో కూడ కన్పడుతుంది. రాజా! మా అమ్మ, నామీద కోపగిస్తుంది. నేనే కాదు, కోడలన్నా ఆమెకు కోపమే, ఇక ఆ కోడలు చూద్దామా అంటే, ఆమె మా అమ్మ( అత్త )మీద, నామీద కూడ కోపగిస్తూ ఉంటుంది. ఇక, నేను కూడ, ఎంత లోంగ ఉన్నా, మా అమ్మ, నా భార్య మీద కూడ కోపగించుకుంటాను. అసలు దీని కంతా కారణమేమంటారు ప్రభూ ! - అని ఒకని ప్రశ్న.

ఉ: రాజా:- నాయనా! వీని కన్నిటికీ అసలు కారణం "దారిద్ర్య దోషమే" , అది ఎంతకయినా తెగింపచేస్తుంది. కాని ఈ ఉత్తరం వాచ్యంగా కాక వ్యగ్యంగా ఉన్నది. కనుకనే "దారిద్ర్య దోషో గుణరాశి నాశీ" (బీదతన మనే తప్పు, ఒప్పుల కుప్పలనన్నిటినీ నాశనం చేస్తుంది). అను ఆభాణకం (లోకోక్తి )అంతటా ప్రసిద్ధిచెంది ఉన్నది.

వి. '' కుప్యతి '' బదులు తుష్యతి అను పాఠాంతరం కూడ ఉన్నది. ( తుష్యతి = సంతోషపడుతున్నాడు. - చున్నది)

120.శ్లో. కస్యేయం తరుణి! ప్రపా?, పథిక! నః, కిం పీయతే౽ స్యాం?, పయః
ధేనూనా మథ మాహిషం? బధిర! రే వారః, కథం మంగలః ।
సోమో వా థ శనైశ్చరో౽ మృత మిదం, తత్తే౽ ధరే దృశ్యతే
భో భోః పాంథ! విలాస సుందర! సఖే! యద్రోచతే తత్పిబ ॥

సం. ఒకబాట సారికీ చలివేంద్రంలో నున్న యువతి ( ప్రపాపాలిక) కి జరిగిన సంవాదం.

బాటసారి ప్ర.1. ఓయువతీ! ఈ చలివేంద్రం ఎవరిది? ఉ. ఇది మాదేనయ్యా.

2. దీనిలో ఏమి త్రాగవచ్చు? ఉ. పయః ( = నీరు లేక పాలు)

3. ఆపాలు ఆవులవా? గేదెలవా? ఉ. ఓరీ చెవిటి వద్దమ్మా! అది "వారం" నీరు లేక దినము.

4. అయితే ఆ వారం ( రోజు) మంగళా? సోమా?, లేక - శని - వారమా? ఉ.అది అమృతం నీరు లేక

సుధా!

5 మంచిది అది నిజంగా అమృతమే (సుధ) అయితే అది నీ పేరవి లోనే ఉన్నది సుమా!

ఉ. మాట కారి పని అందగాడా! మిత్రమా! నీ కేది కావాలో అదే అనుభవించుము

121.శ్లో. ప్రావృట్కాలే పయోరాశిః కస్మాత్ గర్జిత వర్జితః?

అన్తః సుప్త జగన్నాధ నిద్రా భంగ భయా దివ ॥

సం. సాహిత్యరసికుడగు "వసుపాలు" డను మంత్రి, కవుల నిట్లు ప్రశ్నించి ప్రత్యుత్తరం పొందేనాడట!

1.కవీంద్రా ! వర్షాకాలంలో సముద్రం ఎందుకని హ (ల) ల్లకల్లోలంతో ఆర్భాటం చేయదు?

ఉ. బహుశః, తన్లో పవళించియున్న నారాయణునికి నిద్రాభంగము జరుగ కూడదని కాబోలు (గర్జించకున్నాడు) - అని చక్కగా ఉత్ప్రేక్షించి, ఉత్తరమిచ్చాడట కవి.

122.శ్లో. గురుజన పరతంత్రతయా దూరతరం దేశ ముద్యతో గన్తుమ్ ।

అలికుల కోకిల లలితే నైష్యతి సఖి !'' నైష్యతి?'' సురభిసమయేఽ సౌ ॥ కా. ప్ర. 9-

సం. ఒక నాయికకు ఆమె సఖికి జరిగిన సంభాషణ.

తల్లిదండ్రులు మొ పెద్దలకు పరాధీనుడగుట వలన, దూరతరతీరాలకు వెళ్ళుటకు సిద్ధపడినా, తుమ్మెదల, కోకిలల నినాదాలతో సుందరమైన సురభి (వసన్త) సమయానికి రాడు.

అని నాయిక తన చెలికి చెప్పగా, సఖి, ఆమె చెప్పిన "నైష్యతి" (న+ ఏష్యతి= రాడు) అను దానినే కాకుస్వరం (వ్యతిరేక భావాన్ని తెల్పు పదం) తొ చెప్పుతూ, నైష్యతి? = రాడా? రాకేమి? తప్పక తిరిగి వస్తాడని ధైర్యం చెప్పింది.

వి. కాకుస్వరంతో వ్యతిరేకభావాన్ని తెల్పుట వలన, మమ్మటాచార్యుడు దీనిని "కాకువక్రోక్తి"గా ఉదాహరించెను.

2. దీనిలోని శబ్దాలను మార్చుటకు వీలులేదుగనుక, ఇదొక శబ్దాలంకారము.

123.శ్లో. యస్య న సవిధే దయితా, దవదహన స్తుహిన దీధితి స్తస్య ।

యస్య చ సవిధే దయితా, దవదహన స్తుహిన దీధితి స్తస్య ॥

సం. ఇద్దరు మిత్రుల సంవాదము, చాల వరకు పైకి సమానంగా కూడా కన్పడుతుంది.

ఒకడు : ఎవని వద్ద ప్రియురాలు లేకుండునో, అతనిని అతి చల్లగా నుండు చంద్రుడు కూడ దావాగ్ని వలె దహింపచేస్తాడు- అని తన అభిప్రాయం అడుగకుండానే తెల్పగా, మరొక మిత్రుడు : ఔను, అంతేకాక, ఎవని దగ్గరైతే ప్రేయసి ఉంటుందో, అతనికి దావాగ్ని కూడ చంద్రుని వలెశైత్యాన్ని అందిస్తుంది సుమా: అని నా అభిప్రాయం.

వి. ఈ శ్లోకంలో అనేక పదాలు అర్థ భేదం లేకుండానే పునరుక్తాలు కావడంతో "లాటాను ప్రాస" అను శబ్దాలంకార భేదము అగునని, మమ్మటాచార్య భణితి.

2. అయితే తాత్పర్య భేదాన్ని బట్టియే అన్వయంలో, భిన్నత కన్పడుతోంది.

124. శ్లో. నవలక్ష ధనుర్ధరాధి నాథే- పృథివీం శాసతి వీరరుద్రదేవే ।

అభవ త్పర మగ్రహారపీడా - కుచకుంభేషు కురంగ లోచనానామ్ ॥

సం ప్రతాపరుద్రుని దర్శనానికి నోచుకొనని - పండితుని (విద్యానాథుని ..?) పద్యం.
వి. తొమ్మిది లక్షల(నూతన) విలుకాండ్రకు ప్రభువై పాలించుచున్నవటికీ, ప్రతాపరుద్రమహారాజ రాజ్యకాలం లో కూడ, అగ్రహారములకు ఎంతో పీడగల్గెను సుమా - అని పండితుడు మొదట చెప్పెను. కాని ఇంతలో, అతడే రాజుకోపగించునని, అట్లుకల్గిన పీడ, ఏ అగ్రహారములందు కల్గినదనగా, హరిణాక్షులగు అందగత్తెల యొక్క స్తన కుంభముల, పై భాగములందున్న శ్రేష్ఠహారములకు ఒరసిడి, బాధకల్గినది అని దిద్ది చెప్పెను.
వి.1 అగ్రహారములు = బ్రహ్మణ నివాసానికై కట్టబడిన గ్రామములు లేక పన్నులు మొదలైనవి లేకుండ బ్రాహ్మణులకీయబడిన భూములు. బ్రాహ్మణ భక్తులయిన ఆనాటి రాజులెందరో వారికి అగ్రహారములు దానం చేసేవారు.
2. మొదట, తానే బ్రాహ్మణాగ్రహారములకు బాధ కల్గిందని అధిక్షేపిస్తూ చెప్పిన పండితుడు, వెంటనే మార్చుకొని చెప్పినాడు. బ్రాహ్మణ భక్తుడగు ప్రతాపరుద్రునికి బాధకలిగి, నిజమా? అన్నట్లు ఆ వైపు చూడగా, వెంటనే మాటను త్రిప్పి, హరిణాక్షుల కుచకుంభాలపైనున్న శ్రేష్ఠ (అగ్ర) హారాలకు అని, తానే సమాధానం చెప్పుకొనుట విశేషాంతరము
125 శ్లో. సా విద్యాధర కన్యకా కిము? భువం పుణ్యైః ప్రపన్నా నృణాం?
ఆ నందామృత సాగరా ద్విమథితా లక్ష్మీః కి మన్యోత్థితా ?
ఆః! జ్ఞాతం ఘనసార చందన సుధా జ్యోత్స్నా మృణాలాదిభిః
ప్రారబ్ధా హృదయం మమ భ్రమయితుం సౌష్ఠవపి శాంబరీ ? ॥
సం. ఈ సంవాదంలో కూడ తానే ప్రశ్నించుకుని, తానే ఊహించుకున్న సమాధానంతో తృప్తి పడటం విశేషం.
ఆనా స్త్రీయురాలు (స్వప్నసుందరి?) మానవులు చేసుకున్న పుణ్యాలకు ప్రతిఫలంగా దివినుండి భువికి దిగివచ్చిన విద్యాధరుల కన్యకయా? పాలసముద్రం తరచగాపుట్టిన ఆ లక్ష్మివలె, లేక తర్వాత మరల లావణ్యామృత సాగరాన్ని తరచగా వెల్వడిన మరొక లక్ష్మియా? సరి,సరి, ఆహా, ఇప్పుడు తెల్సింది ఈమె కర్పూరం, మంచిగంధం, అమృతం, చంద్రిక (వెన్నెల), తామరపువ్వులు మొదలగు శుభ్ర, శీతల వస్తువులతో ప్రారంభించబడినదై, నా హృదయాన్ని భ్రమపెట్టుటకు వచ్చిన, పుష్పబాణుడగు మన్మథునికి సంబంధించిన మాయయో, ఇంద్రజాలమో అయివుంటుంది- అని తనప్రశ్నకు తానే సమాధానం చెప్పుకుని తృప్తిపడినట్లున్న, విరహి వృత్తాంతం ఇక్కడ ప్రతీయమానమౌతుంది.
126.శ్లో "కస్య" మరౌ దురధిగమః కమలే "కః" కథయ వరచితావాసః?
"కైః" తుష్యతి చాముణ్డా? రిపవస్తే ''కుతో'' భ్రష్టాః? ॥
సం. ఒకప్పుడే పరస్పర సంవాదం ప్రత్యక్షంగా కన్పడక, ప్రశ్నవాక్యాంతరాలలోనే గుప్తంగా దాగి ఉంటుంది. దానిని కథితా పహ్నుతి అంటాడు ధర్మదాసుః
ప్ర 1. ఎడారిలో ఏపదార్థం కష్టంతో సాధింపబడుతుంది.? ఉ. కస్య (ప్రథమపాదాదిలోనున్న ఈ ''కస్య'' కు అర్థం) నీటికి, (ఎడారిలో నీరు దుర్లభం గదా).
2 పద్మంలోనుకాం పెట్టి కూర్చున్నవాడు ఎవడో తెల్పుము. ఉ (రెండవ పాదంలో ప్రశ్నగా నున్న) కః =

బ్రహ్మ కనుకనే బ్రహ్మ "కమలాసనుడు".

3. సప్తమాతృకలలోనొకటగు) చాముండాదేవి వేనితో తృప్తిపడుతుంది? ఉ. తృతీయ పాదాది యందున్న) "కైః" = శిరస్సుల (పుర్రెల) తో తృప్తి చెందును.

4. నీ శత్రువులు ఎక్కడనుండి ( కుతః) జారి, కన్పడకుండా పోయారు.? ఉ. చతుర్థపాదం మధ్యలోనున్న "కుతః" = భూమినుండి మరణించి అదృశ్యులైనారు. )

వి. ఈ "కు" ( భూమి) శబ్దానికి పంచమ్యర్థంలో తసిల్ ప్రత్యయం వచ్చి, తెలుగులో, వలన - నుండి అనే అర్థాలను తెలుపుతుంది.

2. ప్రత్యుత్తరాలగు, ఈ "కస్య, కః, కైః, కుతః", అను "కిం", '( శబ్దరూపాలు)' నాలుగు పదాలు, ప్రశ్నవాక్యం యొక్క ఆది లోనో, మధ్యలోనో గుప్తంగా దాగి ఉండి ప్రశ్నించినట్లుగా పైకి కన్పడినా, వేరొక ప్రత్యుత్తరం ఇవ్వవలసిన అవసరం లేకుండా, అవే స్వయంగా, మార్పులేకుండా, ప్రత్యుత్తరాలగుట గొప్పచమత్కార విశేషము.

3. "క" శబ్దానికి నానార్థాలు ఇంతకు ముందే చెప్పబడినవి.

127.శ్లో. అయి!కాన్త! పశ్య మేఘం, నహి నహి పాపం తవాతి పుణ్యాయాః ।
నహి నహి పశ్య పయోధరం, అపసారయ కంచు కీ మురసః ॥

సం. ఒక ప్రియురాలు ప్రియునిట్లు సంభోధించి, చెపుతొంది.

1. ఓనా ప్రియా! మబ్బుపట్టింది. "మేఘా" న్ని చూడు. అనగా, ప్రియుడు, మేఘం = మే+అఘం=మేఽఘం = నా పాపాన్ని చూడు- అని చెప్పినట్లుగా, శ్లేషతో అర్థంచేసుకొని,

ఉ. అయ్యో! అలా అంటావేమిటి? అతిగా పుణ్యం చేసుకున్న పతివ్రతవు ఇక నీలో పాపం (అఘం) ఎక్కడ ఉంటుంది? అని ప్రియునివాక్యం.

2. అది కాదునాథా! నేను చెప్పేది నీటిని ధరించిన "పయోధరా" న్ని గురించి

ఉ. ("ప్రియుడు పయోధర" శబ్దానికి "పాలను ధరించిన స్తనము" అనే అర్థాన్ని గ్రహించి) అయితే నీ రొమ్ము మీది రవికె ( జాకెట్) ను తొలగించు, చూస్తాను- అనెను.

వి. మేఘాడంబరంలో స్తన దర్శనం కామక్రీడకు ప్రోద్బలకం కనుకనే కాళిదాసు "మేఘాలోకే భవతి సుఖినోఽ ప్యన్యథా వృత్తి చేతః" (మేఘాలను చూడగానే అంతకు ముందు ఆ వ్యక్తి ఎంతసుఖంగా కూర్చున్నా, (కామాపేక్షగలదై) అతని మనస్సు మరొకవైపుకు పరుగెత్తుతుంది.) అని తన మేఘసందేశ కావ్యంలో సూచించినాడు.

వి.1 మేఘం = మబ్బును, మేఽఘం = మే+అఘం =నాయుక్క పాపమును.

2.పయోధరం = పయస్సు ( నీటిని) ను ధరించిన మేఘమును, లేక పయః (పాలను) ధరించిన స్తనమును అని శ్లిష్టార్థము.

128.శ్లో. క స్త్వం భోః?, కవి రస్మి, కా ప్యభినవా సూక్తిః సఖే! పఠ్యతామ్ ।
త్యక్తా కావ్యకథైవ సంప్రతి మయా, కస్మా దిదం కథ్యతే?
య స్సమ్య గ్వివినక్తి దోషగుణయోః సారం స్వయం సత్కవిః ॥

సో౽ స్మిన్ భావుక ఏవ నా స్త్యథ భవే ద్దైవా న్న నిర్మత్సరః ॥

సం. ఒక రసజ్ఞునికి, కావ్యరచననే మానివేసిన కవికి జరిగిన సంభాషణ

ప్ర 1. ఎవరవయ్యా నీవు? ఉ:- నేనొక కవినండి!

2. అయితే, మిత్రమా! క్రొత్తగా వ్రాసిన ఒక సూక్తినో పద్యాన్నో వినిపించరాదూ?

ఉ. అయ్యా !నేనాకావ్య ( రచన) కథల నన్నింటినీ కట్టకట్టి దూరంగా పారవేసానయ్యా.

2 ఏమిటీ? అంత నిరాశతో నిస్పృహతో మాట్లాడుతున్నావు?

ఉ. ఏమని చెప్పమంటావు.? నేడీలోకంలో, స్వయంగా సత్కవియై, గుణదోషాలను, మంచి చెడులన చక్కగా వివేచించి, విమర్శింపగల సహృదయుడు ఒకడు కూడా కరువైనప్పుడు వృథాప్రయాసగాక, కవిత్వం వ్రాసిమాత్రం ప్రయోజనమేముంటుంది? పోనీ, ఎంతో వెతకితే ఎవరో, ఒకరో,అరో దొరికి విధివిలాసమేమో ఆభావుకుడు మాత్సర్య పూర్ణుడై ఉంటాడు గాక ఉంటాడు. ఇలా ఓర్వలేని తనం నిండిన పరిస్థితిలో, ఎంతో చమత్కార, వైచిత్ర్య, పూర్ణంగా వ్రాసినా, ఏం ప్రయోజనం? కనుకనే వ్రాయట మానుకున్నానని కవి కంఠశోష,

వి లోక కల్యాణం, ఉపదేశం లేక ఆనందాన్ని అందించడం కోసం కవి కావ్యం వ్రాస్తాడు. దాన్ని అ చేసుకోనడానికి, కొంత యోగ్యత కూడా కావాలి. ''హిరణ్యమనస్తత్వంతో'', ధనదాహంతో నిండి ఉ నేటి లోకంలో, కవితామృత ధారల్ని గ్రోలేవారు అరుదంటున్నాడు కవి.

2. ఇలా నిరాశతో, నిస్పృహతో, పోషించునారులేక, కావ్యరచనమాని, కాటికి కాళ్లాఠజాపుకుని, శాశ నిద్రకు ఎదురుచూస్తున్నారు కవులు కొందరు.

3. ఆనాటి కవిపండితులను గౌరవించి, పోషించిన విక్రమాదిత్య, భోజ, కృష్ణదేవరాయ, ఆది ప్రభుష దివికేగినను, భువిలో కీర్తికాయులై, ఆనాడే కాక, నేటికీ ఏనాటికీ, ప్రాతః స్మరణీయులై ఉన్నారు.

4 నేడు ప్రజలే ప్రభువులు గనుక, కనీసం కవి పండితుల పోషణభారం ప్రజలపై ప్రజాప్రభుత్వ పడియున్నదన్న సంగతి కూడా మరువరాదు.

129.శ్లో అప్పయ్యదీక్షితాత్ పూర్వం తాతః పూజ్యో న సంశయః ।
మఖప్రక్షాలనాత్ పూర్వం గుద ప్రక్షాలనం యథా ॥

సం. తాను తమిళుడైనా, "ఆంధ్రత్వ మాంధ్రభాషా చ --- నాల్పస్య తపసః ఫలమ్"
(ఆంధ్రుడై పుట్టడం, ఆంధ్రభాషాభ్యాసం చేయడం, అత్యంత తపః (ప్రభావ ఫలం) గా పేర్కొ అప్పయ్యదీక్షితులు అఖండ విద్వత్కవి శేఖరులు. శతాధిక శాస్త్రీయ గ్రంథకర్తలుగా పేరుప్రఖ్యాత గడించిన వారు . తాతాచార్యుల వారు రాయలకాలంలో రాజగురువులు ఒకప్పుడు ఒకగోష్ఠిలో వివాదిం పై పద్యపూర్వార్ధాన్ని, వైష్ణవులు వెల్లడింపగా, ఉత్తరార్ధం రామకృష్ణుడి దంటారు.

ఏరిద్దరిలో ఎవరు గొప్పవారు అను సంవాదంలో అప్పయ్యదీక్షితులకు ముందు తాతాచా వారే మొదట పూజింపదగినవారని, దీనిలో సందేహానికి తావులేదని కొందరన్నారట! ఇంతలో వికట రామకృష్ణుడు లేచి పండ్లు తోముకుని,మోగము కడుక్కొనుటకు ముందుగా, గుదప్రక్షాలనం ( ద

వెళ్ళి ముడ్డి కడుగుకొన్నట్లు) మాదిరిగా అని నీచోపమానంతో పోల్చినాడట!
వి. తాతాచార్యుల వారికి రామకృష్ణునికి షష్టాష్టకము (విరోధము) సందుదొరికినప్పుడల్లా ఆచార్యులను ఆడిపోసుకునేవాడు. అందుకనే నీచోపమానంతో రామకృష్ణుడు కసితీర్చుకున్నాడు.

## శ్రీ నడిమింటి మంగళేశ్వర శాస్త్రి గారి కొన్ని మాణిక్యోక్తులు

శాస్త్రిగారు ఒక మహోద్దండ వ్యాకరణపండితులు ,స్వయంపాకులు వీరొకనాడు అన్నగారితో విశాఖపట్టణం వచ్చి, స్వయం పాకమునకు ఉపక్రమిస్తూ ఉండగా తమ్ముడూ నేనేమి తెచ్చినా, నీవు ఇష్టపడవు ఏమి కావాలో చెప్పిన అవే తెస్తాను.- అనెను.
అప్పుడు అన్న రుక్మేశ్వరశాస్త్రిగారు ఈ '' మాణిక్యక్రయణమ్ '' శ్లోకం చెప్పారట!
130.శ్లో. మాణిక్య క్రయణమ్ లోకే మంగళాయ భవే త్కిల ।
మంగళే సహజేఽస్మాకం మాణిక్యాత్ - కిం ప్రయోజనం ?॥
సోదరా! మాణిక్య క్రయణం (మాణిక్యాన్ని కొనటం) మంగళకరం అంటుంది లోకం. అయితే, మనకు మంగళం సహజంగానే ఉన్నది కనుక, ఇంకా మాణిక్యం కొనవలసిన పని ఏమున్నది? లేక, "మంగళే సహజేస్మాకం" అనగా అస్మాకం= మాకు మంగళే = మంగళేశ్వరశాస్త్రి సహ- జే = తోడ బుట్టిన తమ్ముడై ఉండగా- అను అర్థాంతరం కూడ చెప్పుకొనవచ్చును.

### 131. ప్రత్యభివాదమ్ – దండాలండీ!

ఒకనాడొక అధికారి, శాస్త్రిగారు గుమ్మందాటుచుండగా, సాభిప్రాయంగా "దండాలండీ" అన్నాడట! శాస్త్రులుగారు ఏమి మాట్లాడక, లోనికేగి, మరల తిరిగిరాగా అయ్యా! మీరుగొప్ప పండితులు నమస్కరిస్తే, "ప్రత్యభివాదం" చేసే మర్యాద కూడ మీకు తెలియదా? అనగా, అయ్యా! మీరు గుమ్మానికి ఆవల ఒకకాలు, ఈ వల ఒకకాలు ఉండగా నమస్కరించారు. దానికి ఎలా ప్రత్యభివాదం చేయడం ? అని వ్యంగ్యంగా సాకూతంగా సమాధానం చెప్పారట.

### 132. దీర్ఘ మాయు రస్తు

మరొకప్పుడు ఇట్లాగే అధికార రోగపూరిత బధిరుడగు మరొక అధికారి సగర్వంగా, "నమస్కార మండీ" అన్నాడట. శాస్త్రిగారు "దీర్ఘమాయు రస్తు"! అని అతనికి తగినట్లుగానే ఆశీర్వదించారట! "దీర్ఘం- ఆయుః - అస్తు" అని విడదీసిన చిరంజీవివి అవుదువుగాక- అని ఆశీర్వాదము కాగా, "దీర్ఘ-మాయుః- అస్తు" అని విడదీసిన, నీకు గొప్ప పైత్యరోగము (మాయుః) వచ్చుగాక- అనే అర్థాంతరంతో శాపము అవుతుందన్న మాట.

### ''మాఙ్గల్యతన్తు''

133.శ్లో. మాంగల్య తంతునానేన మమ జీవన హేతునా (న)

కంఠే బధ్నామి సుభగే! త్వం జీవ శరదాం శతమ్ ॥

సం. తమ ఉళ్లో జరుగుతున్న వివాహంలో తాంబూలం స్వీకరించుటకు శాస్త్రిగారు వెళ్ళినారట. "మంగళసూత్రధారణ" సమయం కావడంతో, పురోహితుడు హడావుడిగా పై శ్లోకం చదివి, మంగళవాద్యాలు వాయించండని భజంత్రీలనాదేశించి, గబగబా, వధువు మెడలో వరునిచే సూత్రం కట్టించాడట.

మంత్రాలు సస్వరంగా, మిథ్యా ప్రయుక్తాలు కాకుండా, అక్షరాల తేడా ఏమీ లేకుండా చదవాలని, అలా చదవకపోతే, అది ఈలోగా "వాగ్వజ్రమై తక్షకుని చంపినట్లు యజమానినికూడ హింసిస్తుం"- దని శాస్త్రకార వచనం. అపస్వరంతో హాఠాత్తుగా చదివిన దానికి, బాధపడి, ఇలా చదివితే ఏ అర్థం , వస్తుందో మీకు తెలుసా? - అని పెళ్ళిపెద్దలను ప్రశ్నింపగా- వారు దయుంచి చెప్పండి అని ప్రార్థింపగా, దానికర్థం ఇది సుమా- అన్నారట.

"మాంగల్యతంతు-నా" ఈ నేను కట్టునది మంగళసూత్రం ( దారం) మాత్రం కాదు. ( అసలే నేను ముసలిముండాకొడుకును. చాల పెళ్ళిళ్లు నాకు జరిగాయి అట్టినాకు ఈ మాంగల్యంతో పనేముంది? ) అనేన - మమ జీవనహేతు-న = దీనితో నా- జీవయాత్ర- గడుస్తుందనే నమ్మకం లేదు.( ఉన్న) రెండు మూడు ఎకరాలు తెగనమ్మి కన్యాశుల్కం, పెండ్లిఖర్చులు, పెట్టుకోవడంతో నా జీవనోపాధి కాస్త జీర్ణమైపోయింది. కంఠే బధ్నామి = నీకంఠానికి - ఉరి త్రాడు లాగా కట్టుచున్నాను. దీని వలన, నాకు సుఖంలేకపోగా నీకు త్రాడు కట్టి నిర్బంధించాను కూడా అని భావింపవలెను. మరియు, ''హే సుభగే=సుభగురాలా! త్వం-శరదాం-శతమ్-జీవ= నీవు- నూరేళ్లపాటు హాయిగా జీవించుము.

వి. 1 ఇక్కడ ''సుభగా '' శబ్దము సాభిప్రాయముగా వాడబడినది."భగ" శబ్దం ఇక్కడ "స్త్రీ మర్మావయవము" ను తెల్పుచున్నది. అందుచే అనగా, ఇక నీవు "సు-భగవు గనుక, దానిని ఉపయోగించుకుని చాలకాలం బ్రతకవచ్చు"ను అని అంతర్గూఢార్థము.- అని శాస్త్రిగారు వివరింపగా, పెండ్లిపెద్దలందరూ విస్తుపోయి పెద్దగా విచారించారట!

2. శాస్త్రిగారు తమ పాండిత్య ప్రకర్షతో, ఇలాంటి అర్థాలు, నానార్థాలు, విపరీతార్థాలు ఎంతగానో చెప్పి పాఠకుల పరిశీలనకు విడిచిపెట్టేవారట!

# ఆనందవర్ధనా చార్యుని సంవాద భేదాలు

ముఖ్య గమనిక: - ఇక్కడ మనం ముఖ్యంగా, ధ్వని ప్రతిష్ఠాపనాచార్యులగు ఆనందవర్ధనా చార్యుని అభిమతాన్ని కూడా జాగ్రత్తగా పరిశీలించాలి.

వస్తుతః, "సంవాద" మనగా, "పరస్పర సంభాషణము" లేక సమాచారాదికమును ఒకరికొకరు తెలుపుకొనుటయే కాని ఇట్టి సంవాదాలు శ్లేషతో, వక్రోక్తులతో, ఎత్తిపొడుపులతో లేక హాస్యంగానో చమత్కారాలు చిందించటం సర్వసాధారణం. కేవల సంభాషణ చప్పగా ఉంటుంది. దానిలో చమత్కారచందనాన్ని కలిపి పూస్తేనే ఆనందాన్ని అందిస్తుంది. ఇట్టి ఉదాహరణాలనెన్నింటినో ఇంతకు ముందు చూచినాము

134.శ్లో. సంవాదో హ్యన్య సాదృశ్యం త త్పునః ప్రతిబింబవత్।
ఆలేఖ్యాకారవ త్తుల్య దేహి వచ్చ శరీరిణామ్ ॥ ధ్వ.4-12

"ఈ సంవాదము"నకు, "ఒక కవి యొక్క కావ్యవస్తువునకు, ఇతర కవుల యొక్క కావ్యవస్తువులతోటి సాదృశ్యము" అర్థమని, అది మూడు విధాలని, 1.దేహధారుల ప్రతిబింబరూపము. 2. చిత్రతుల్య (ఆలేఖ్యాకార) ము, 3. తుల్యమగు దేహివంటిది- అని కూడ ఆనందవర్ధనాచార్యుడు వివరించెను.

దేశ కాలావస్థాది భేదాలతో నుండు ఈ కావ్యార్థము, ఔచిత్యానుసారంగా, రసభావాది వ్యంజకమగునట్లు కూర్చబడినచో, లక్షల కొలది బృహస్పతులు కావ్యనిర్మాణము చేయతలపెట్టినను, క్షయము మాత్రము పొందదు ఇంతకుముందు ఎన్ని ప్రపంచాలు నిర్మించినా, నిర్మిస్తున్నా, ఇంకా నిర్మింపతలపెట్టినా, త్రిగుణాత్మకమగు ప్రకృతి ఏమాత్రము తరుగక, తగ్గకపోగా, నవనవోన్మేషంగా స్ఫురిస్తూ, పెరిగిపోతుంది. అట్లే, ఈ కావ్యార్థాలు అనంతములైననూ, నవీనములైననూ అనేక కవులబుద్ధులగలలో అనుభుక్తములైననూ, ఏమాత్రము తరుగక,కొంగ్రొత్త వ్యుత్పత్తులతో పెరుగుతూనే ఉంటాయి. ''సంవాదిన్యో మేధావినాం బుద్ధయః'' మేధావుల బుద్ధులు లోటి సాదృశ్యము తదితర బుద్ధులందు కూడా స్ఫురించుటను - చూచి, ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఇట్టి, బహువిధసంవాదాలు, ఇతర మహాకవులందరి గౌరవముతో గాని లేక వారి గ్రంథాలను పౌనఃపున్యముగా, (వాలసార్లు) పఠించుట వలన కూడ కలుగవచ్చును. అంత మాత్రాన వానిని నకిలీలని, కాపీలని పిలువగూడదు.

పై మూడింటిలో మొదటిది "అనన్యాత్మ", రెండవది "తుచ్ఛాత్మ" (ఆత్మశూన్యము), మూడవది "ప్రసిద్ధాత్మ"గా చెప్పబడినది. మొదటి దానిలో శరీరమే లేదు. రెండవదానిలో శరీరమున్ననూ, అనుప్రాణాత్మకమగు "ఆత్మ"లేదు. కనుక, బుద్ధిమంతులగు కవులు ఈ రెండింటిని విడిచిపెట్టవలెను. ఇక, మూడవదానిలో వాస్తవికమగు శరీరము, ఆత్మ, ఉండుట వలన దీనిలో మరొక దానితోకొంచెం సామ్యం స్ఫురించినా, దానిలోని స్వతంత్ర జీవశక్తిగాని, రమణీయత్వం గాని తగ్గదు. ఒకనిపోలిక గల మనిషి మరొకరుండవచ్చు. అంత మాత్రాన, వారిద్దరూ ఒకటౌతారా? కారు. అట్లే, వారి స్వతంత్ర జీవనానికి చేటేమైనా కలుగుతుందా? కలగదు. కనుక ఈ తుల్యదేహిరూపసాదృశ్యము కమనీయమగుటచే, గ్రాహ్యమైనదనియే ఆనందవర్ధనాభిప్రాయము.

135.శ్లో. ఆత్మనోఽ న్య స్య సచ్ఛాసే పూర్వ స్థిత్యనుయాయ్యపి।
వస్తుభాతితరాం తన్వ్యాః శశిచ్ఛాయ మివాననమ్ ॥ ధ్వ.4-14
సారభూతమగు ఆత్మయే తత్త్వము అది, ఇప్పుడు పూర్వకవుల పద్ధతులననుసరించినను వచ్చు నష్టమేమి ఉండదు ప్రాచీనచ్ఛాయానుగ్రహీతము అగు ఆ వస్తువు, శరీరంవలె అధిక కాంతిని కూడ అందిస్తుంది. పునరుక్తమైనట్లుగా కూడ కన్పడదు. వనితా వదనమున, చంద్రకాంతి స్ఫురించినంత మాత్రాన, అవి రెండూ, ఏకత్వాన్ని పొందవు. రసికశేఖరుల అనాదరానికి ఆధారాలు కూడా కావు. మరియు, ప్రాచీన మార్గ రమణీయతతో కలిసిన నవీన సౌందర్యము ఏమీ తగ్గక, పెరుగుతుంది. మరియు, ఇంకా తత్త్వైక్యము చెందక, జీవకళాశోభితమైన, ఈ తృతీయ సంవాదము సహృదయులకు అత్యంతాదరణీయమైనదని కూడ గమనింపవలెను.

ఇప్పుడు చెప్పిన ఉదా:లన్నీ వాక్యార్థములే ఇక, పదార్థసంవాదాలు కూడా ఎన్నో ఉన్నాయి. వానిలోనూ తప్పేమిలేదు. కనుకనే,
136.శ్లో. అక్షరాది రచనేవ యోజ్యతే యత్ర వస్తురచనా పురాతనీ,
నూతనే స్ఫురతిః కావ్యవస్తుని వ్యక్తమేవ ఖలు సా న దుష్యతి ॥ధ్వ 4-15.
ఇతరులు వాడిన అక్షరాలు, పదాలు మనం కూడా వాడక తప్పడంలేదు. అవెట్లు తప్పుకాదో, పదార్థ సంవాదం కూడ తప్పుకాదు. ఇక్కడ, అక్షరాది రచనయే క్రొత్తది. వస్తురచన మాత్రం పాతదే. వాచస్పతి అంతటి గొప్పవాడు కూడ, అపూర్వ - అక్షరాలను, పదాలను సృష్టింపజాలనపుడు, మనం కూడ, ఇతరులు వాడిన అక్షరాలను, పదాలను, వాడటంలో తప్పేమిలేదు - అని భావం. అంతేకాక, పద, పదార్థశ్లేషాదులందు కూడా, అన్యసంవాదము ఉన్నంత మాత్రమున అదొక దోషంమాత్రంకాదని, నవీనతకు ప్రతిబంధకం కూడా కాదని, ఆనందవర్ధనుని అభిమతంగా తలంచాలి.

మొత్తం మీద శబ్దరచనలో పూర్వ చ్ఛాయలున్నా, అది వ్యంగ్య సమర్పణ సమర్థమైనచో, అది నింద్యము కాక, కావ్యానికొక అభూత పూర్వ శోభను, సహృదయులకొక అపూర్వ చమత్కారాన్ని కూడ అందిస్తుంది. కనుక, అనేకామృతార్థాలను స్పందించు వాక్కులను కవులు విస్తరింపచేయుదురుగాక! ఇతరార్థములను అందుకొనవలెనన్న మనసులేని కవులకు, ఆభగవతియగు సరస్వతియే, స్వయముగా అభిమతార్థాలను అందింపచేస్తుంది సుమా! అదియే మహాకవుల మహాకవిత్వము (సరస్వత్యైషా ఘటయతి యథేచ్ఛం భగవతీ) ఏత దేవహి మహాకవీనాం మహాకవిత్వం - ఇతి ఓమ్)

తుల్య దేహి రూపమగు సంవాదానికి కొన్ని ఉదాహరణలు.
137.శ్లో. 1.దుఃఖం న్యాసస్య రక్షణమ్ (భాసుడు) ప్రత్యర్పితన్యాస ఇవాంత రాత్మా (కాళిదాసు)
2. (మదనలేఖలు వ్రాయుటలో) - తవ న జానే హృదయం, మమ పునః..మనోరథాన్యం గాని (కాళి)
సుభగ! కుసుమ సుకుమారం -- మృదులం (దండి) దూరం ముక్తాలతయా విససితయా (బాణభట్టుడు)

138. 2. ( మధన లేకలు (వ్రాయుటలో) అని జానే ముహుర్ముహు -- మనోరథాన్యంగాని (కాళి) సుభగకుసుమసుకుమారం - వపుః (దండి), దూరం ముక్తామతయా బిసినితయా... (బాణ)

139. గుర్వపి విరహదుఃఖ మాశా బంధః సహాయతి (కాళి), ఆశా బంధః కుసుమ సదృశం . విప్రయోగే గుణాద్ది (కాళి) ఆశయా కిమివ హిన సాధ్యతే (భట్టబాణ), ఆశా భవతి రాజన్! శల్యో జేష్యతి పాండవాన్.( వేణి)

గమనిక : ఈ మూడు సంవాదాలలో, మొదటిరెంటిని పరిత్యజించాలి అయితే, అవి భిన్నకవి కర్తృకములైన గ్రంధాలలో కన్పడితేనే, పరిత్యజించాలి. ఆ సాదృశ్యాలు ఏక కవి కర్తృకములైన అనేక గ్రంధాలలో కూడ, కన్పడలాయి. అంతేగాక, ఒకే కవి యొక్క, ఒకే గ్రంధంలో కూడ ప్రకరణానుసారంగా, సమాన శ్లోకాలు, భావాలు, వాక్యాలు, పదాలు కూడ, సదృశాలుగా కన్పడినా వానిని దుష్టాలనరాదు.

140 ఉదా :-1 కాళిదాసుని రఘువంశ - కుమారసంభవాలలోని స్తుతులు, విలాపాలు, పర్వత వర్ణనలు, కుశలప్రశ్నాదికము, ప్రతిబింబ రూప సాదృశ్యానికి .

141. 2. కుమారసంభవంలోని "సర్వోపమాద్రవ్యసముచ్చయేన..." శ్లోకం, శాకుంతలంలోని "చిత్రేనివేశ్య పరికల్పిత సత్త్వయోగా..." లు సదృశ చ్ఛాయలగ్గయున్నందున, ఆలేఖ్యరూపానికి, ఉదాహరణములగుచున్ననూ, త్యాజ్యములు మాత్రము కావని తెలియవలెను.

142. ఇక, తుల్యరూప సాదృశ్యానికి .. కల్పేత లోకస్య కథం తమిస్రా (శాకుం), కుతో ధర్మక్రియా విఘ్నః .. (రఘు) ఇత్యాదిసాదృశ్యోదాః ులు గ్రాహ్యాలే అని ముందు చెప్పబడినది.

143. శ్లో : కిం చిత్రం యది రాజనీతి కుశలో రాజా భవే ద్ధార్మికః

కిం చిత్రం యది వేద శాస్త్ర నిపుణో విప్రో భవే త్పండితః

తచ్చిత్రం యది రూప యౌవన వతీ తస్యే భవే త్కామిని?

తచ్చిత్రం యది నిర్ధనో ఽపి పురుషః పాపం న కుర్యాత్ క్వచిత్ ?॥

సం : చిత్ర మనగా నేమిటి? ఈ వివరణ మిత్రుల మధ్యగాని ఒకరితోగాని కావచ్చు.

ప్ర 1. మిత్రమా ! రాజనీతిలో రాటుదేలిన కొందరు, ధన, అధికార, దాహాలతో, పైకి కన్పడకుండా ఎన్నో పిచ్చి పనులు చేస్తారు. అలాకాక రాజనీతిలో ఆరితేరిన రాజుకూడ ధర్మాచరణతో పుణ్యాత్ముడైనచో, దానిలో ఆశ్చర్యకర విషయమేమున్నది ?

ప్ర 2. వేద శాస్త్రేతిహాసాలతో, వేత్తలైన ఛాందస బ్రాహ్మణులు కూడ పండితులు కావటంతో పరమాశ్చర్య పడవలసిన పని లేదు.

ఎంత పారంపర్య, సంస్కార, ప్రాంతీయ పరిస్థితులననుసరించి, త్యాగస్థులు, పండిత పుత్రులైన, ఆ బ్రాహ్మణులు పాండిత్యం సంపాదించటంలో, అంత అద్భుతమేమి కన్పడదు.

ప్ర 3. ఇక, విచిత్రమేమిటంటే, మక్కువ అంద చందాలతో వలపు గొల్పు యువతి అగు భామిని, కులటయై చెడిపోక, భర్త ఎట్టి వాడైన, విడువక పరమ పతివ్రతగా సేవించటం ఒక ఆశ్చర్యకర విషయమే

ప్ర 4. అంత కన్న మరొక గొప్ప విచిత్రమేమిటంటే, చేత చిల్లి గవ్వ అయినా లేని, దరిద్ర దామోదరుడు, ఎంత హీన స్థితిలోనున్నా, ఎన్ని కష్టాలు ఎదురైనా, కడుపు కడివెడాకలితో మాడుతున్నా, అకూటికోసం

కోటి విద్యా ధనవాకాశాలున్నా, అట్టి పాప కార్యాలు చేయక, నిరాడంబరంగా నీతిగా జీవించడం ఎల్ల విచిత్రా" విషయన్నమాట.

144 శ్లో : అనవేమ మహీపాల ! స్వస్త్యస్తుతవ బాహవే ।
ఆహవే రిపు దోర్దండ చంద్రమండల రాహవే ॥

సం : ఒక కవి అనవేమ భూపాలు ని గూర్చి చేసిన స్తుతి

ఓ అనవేమ భూపతీ! యుద్ధ రంగంలో శత్రు భుజమండలమనెడు, చంద్రమండలానికి, నీ భుజదండ మొక రాహువు వంటిది సుమా! అట్టి భుజ దండమునకు శుభముగుగాక

కవి, పైకి ఇట్లు ఆశీర్వదించినట్లు, కన్పడుతుంది. దీని అంతరార్ధము ఏమనగా - వస్తుత: అనవేమారెడ్డి పేరులో, ''ఒకే'' ''వే'' ఉండగా, కవి శ్లోకంలో నాలుగు పాదాలలో, నాలుగు ''వే'' లు ఉన్నవి. అనగా రాజా! నీవు నాకు ఇంతవరకు ఏమీ ఇవ్వకున్నా, నేను మాత్రం నీకు ముందుగానే నాలుగు ''వే ''లు ఇస్తున్నాను సుమా !- అని కవి - హెచ్చరిక

ఆనాటి రాజులు నిరక్షర కుక్షులు కారు. సరసులు, సాహిత్య సమరాంగణ చక్రవర్తులు కనుక, రాజు ఆ శ్లోకంలోని ధ్వన్యర్ధాన్ని ఆపాతతః గ్రహించి, మంత్రి ద్వారా నాలుగు వేలు ఇప్పించెను. అంత, కవి, రాజా! అయాచితంగా, నేను నీకు నాలుగు వేలియ్యగా, వానినే నాకు త్రిప్పి అప్పగిస్తావా ? అనగా రాజు, ఐదు వేలు ఇప్పింప, కవి, మహా ప్రభో మాఇంటి పేరు ఆరువేల వారు, కనుక ఈ ఐదు వేలు తీసుకొంటే తక్కువ దనం తథ్యమనగా, రాజు ఆరువేలు ఇప్పించెను. నేను ఆరువేల వాడను కదా! మీరు ఆరు వేలే ఇప్పిస్తే, నాతో సమానుడవవుతావు! ఇక నీ గొప్పతనం ఏమున్నది ? .. అనగా, రాజు ఏడు వేలు ఇప్పింప, రాజా! మీరిచ్చేదానిలో చెరిసగం పైకంలో ముడున్నరవేలు నేను దేవుడికి ఇవ్వాలి. ఇలా ''అరకోర'' గా ఇవ్వటం, తీసుకోవటం కూడ, నీ గొప్పతనాన్ని తగ్గిస్తుంది. అంతేకాక, ఏడు (7) వినికిడి అశుభ సూచన. విను వారికి సొంపుగానుండదు - అనగా, రాజు ఆ కవి చాతుర్యానికి, చమత్కృతి మద్విశ్లేషణకు మెచ్చి, ఎనిమిది వేలు ఇప్పించెను - ఆనాటి రాజుల అభిజాత్యమట్టిది.

145 శ్లో : శ్వశుర గృహనివాసః స్వర్గతుల్యో నరాణాం
యది భవతి దరిద్రో పంచవా షడ్డినాని।
దధి మధు ఘృత లోభాత్ మాస మేకం. వసేత్ చేత్ -
తదుపరి దిన మేకం పాదరక్షా ప్రయోగః.॥

సం. అత్తవారి ఇల్లు ఎట్టిది ? అను ఉహాజనీత ప్రశ్నకిది సమాధానము ఒక మామగారి ఇంటికి నలుగురు అల్లుళ్ళు, ఒకసార మను గుడువు ( వివాహానంతరము అత్తవారింట్లో అల్లుళ్ళకు చేసే విందు) లకోసం విచ్చేసారట ! ఎంత ధనం, ఓపిక, ప్రేమ గలవారైన, ఎంత బాగ పెట్టాలనుకున్నా, ఎంతకాలమని, అల్లుళ్ళకు తినుబండారాలు, సేవలు చేయగలరు ? వారికేమాత్రం విసుగు పుట్టకుండా ఉంటుందా.

ఇలా ప్రతి దినం, పీక ల వరకు మెక్కి, మేలము ( పరిహాసము) లాడుకుంటున్న అల్లుళ్ళలో ఒకరికి బుద్ధి వచ్చి, అత్త వారిల్లు అన్ని విధాల స్వర్గ సుఖాలలో ఒలలాడిస్తుంది అనే అర్ధం వచ్చు, పై శ్లోకములోని ప్రథమ పాదం, అత్త వారింటి గోడపై వ్రాసి వెళ్ళి పోయాడట.

మరికొన్ని రోజులకు రెండవ వానికి బుద్ధి వచ్చి, అత్త వారిల్లు ఎంత స్వర్గసీమ అయినా, 5-6 రోజులు కంటే మించి ఉండటము మంచిది కాదు - అనే అర్థ కల రెండవ పాదాన్ని గోడ మీద వ్రాసి ఉడాయించాడట! మరికొన్ని రోజులు మెక్కి, అజీర్ణం తెచ్చుకొన్న మూడవ అల్లుడు ఎవో అత్త వారింట అనాయాసంగా గడ్డ పెరుగు, పాలు, పిండి వంటలు వడ్డిస్తున్నారు కదా అను అర్థం వచ్చే మూడవ పాదాన్ని అసంపూర్ణంగానే వ్రాసి పలాయన మంత్రం పఠించాడట !

ఇక నాలుగవ వాడు మాత్రం, తిని, తేపి , వారి మీద పెత్తనం కూడ చేస్తూ, ఇవి కావాలి, అవి కావాలి . అని అధికారం చెలాయించడంతో, పాపం ! ఎంత బావ మరుదులైనా ఏమి చేస్తారు? ఎంత కాలం అని భరిస్తారు ? ఏమి చేయునది లేక, ఆగ్రహోదగ్రులై, చెప్పుతో నెత్తిమీది బొచ్చు ఊడేటట్లు , నాలుగు దెబ్బలు కొట్టారట! దానితో ఆనాలుగవ వాడు పారిపోతూ, ఆదరబాదరగా ' తిండి మీది ఆశతో నెలల కొద్ది తిష్ఠవేస్తే, ఆ తర్వాత చెప్పు దెబ్బలు తప్పవు' అనే అర్థంకల నాల్గవ పాదాన్నివ్రాసి పారిపోయాడట !

వి : 1. ఎంత ఆశ పోతూ తిండి పోతులైనా, అత్త వారింట్లో అధిక దినములుండరాదని భావం.

# తెలుగులో సంవాద చిత్ర సాహిత్యమ్.

ఆంధ్రభాషలో అనేక విధ రసరంజిత, హాస్యభరిత, చమత్కార చందన చర్చిత, చారుచాటూక్తి సంకలిత, చాతుర్యయుక్త, అధిక్షేపణాత్మక..... ఆది సంవాద చిత్ర సాహిత్య సంపద ఎంతో కలదు. మచ్చుకు ఈ కొన్ని మన్నించండి.

సాహిత్య సమరాంగణ చక్రవర్తియగు కృష్ణదేవరాయుల ''భువనవిజయ'' కళాభువనంలో ఆస్థాన కవి పండితులేగాక, వస్తూ పోతూ ఉండే కవులు కూడ ఎందరో ఉండేవారు. వారు తమ పాండిత్యప్రకర్ష ననేక విధాల ప్రదర్శించి,పారితోషకాలు పొందెడివారు. ''విద్యాపతా మనేకత్వం, బోద్ధారోమత్సరగ్రస్తాః''.... అన్నట్లు వారిలో వాద, వివాదాలు, భూషణ దూషణ, తిరస్కారాలు కూడ విరివిగా జరుగుచుండెడివి.

భువనవిజయ మహాసౌధంలో, అష్టదిగ్గజాల కవితా మాధుర్య పరంపరల నాస్వాదించి, అపరిమితానంద భరితుడగు శ్రీకృష్ణదేవరాయ ప్రభువు, ఒక పళ్లెములో గండపెండెరము ( ఒక పదకము) నుంచి, తెచ్చి సంస్కృతాంధ్రాలలో సమానముగ కవిత చెప్పగలవారు దీనిని గ్రహింపుడని ప్రకటించారు.

1. ఉ. ముద్దుగ గండపెండియరము న్గొనుడంచు బహూకరింపగా
ఒద్దిక నాకొసంగుడని, ఒక్కరు కోరగలేరు, లేరొకో?
పెద్దన బోలు పండితులు పృథ్విని లేరని నీ వెరుం గవే (వో?)
పెద్దన కీదలంచినను పేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా!

ఓ కవి పండిత ప్రకాండులారా! సంస్కృతాంధ్రాలలో సమానంగా కవిత చెప్పగలవారీ గండపెండెరమును గ్రహింపుడని, ఆదరంగా నేను ఆహ్వానిస్తూ ఉంటే, మీలో ఏ ఒక్కరు గూడ నా కీయండి అని సవిలాసంగా, సవినయంగా, ముందుకు వచ్చి, కోరినా, గ్రహింపలేకున్నారేమి? అని ప్రశ్నింపగా...

ఇంతలో, పెద్దన కవి లేచి కృష్ణరాయప్రభూ! లోకంలో పెద్ద – అనదగిన లేక పెద్దన కవితో సమానులైన కవీశ్వరులు ఈ భూ ప్రపంచంలో ఎక్కడా, ఎవరూ, లేరని మీకు తెలియదా? కనుక పెద్ద అని చెప్పినా, చెప్పకపోయినా, లేక పెద్దన అను పేరుగల నాకు ఇవ్వాలనుకుంటే మాత్రం ప్రేమతో నాకివ్వండి -- అని మనవి చేసుకున్నాడట.

వి. 1. పెద్ద + అనన్-పోలు = పెద్ద,(గొప్పవాడు) అని చెప్పుటకు తగిన (పండితుడు) పెద్ద – అనక = పెద్దనక = పెద్దవాడు అని చెప్ప లేక పెద్దలనుకోకుండానే, పెద్దన అనేపేరుగల నాకు ఇవ్వాలనుకుంటే- నాకివ్వండి.

2. ఇక్కడ సంధిగత సౌందర్యం, శ్లేషసౌకుమార్యంతో కలిసి, పెద్దనగారి వినయవిధేయతలు ప్రస్ఫుటిస్తున్నాయి.

3. పద్యంలోని పూర్వార్థం రాయలవారిది కాగా ఉత్తరార్థం పెద్దన కవి పూరణ– సంవాదరూపంలో నడిచింది.

4. ఈ పద్యం పూరించిన తర్వాత పెద్దన, పూత మెరుంగులున్ -- ।

అనే ''ఉత్పలమాలికను '' 16 పాదాలు తెలుగులోను మిగిలిన వానిని సరస – సరళ సంస్కృత భాషలోను చెప్పి , తెలుగులో ''ఆశుధారాకవిత్వ మాలిక''కు పేలుబంతిగా, శ్రీకారం చుట్టినాడుపెద్దన కవీంద్రుడు.

2. చ. స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటిపల్కులకేలగల్గెనో?
అతులిత మాధురీమహిమ? ... హా తెలిసెన్, భువనైకమోహనో -
ద్ధత సుకుమార వార వనితా ఘనతాప హారి సం -
తత మధురాధరోదిత సుధారసధారల గ్రోలుటం జుమీ !

సం. పూర్వార్ధంలో 1 1/2 పాదాలు రాయల వారివికాగా, మిగిలినవి రామకృష్ణునివి. కుశాగ్రబుద్ధియగు ఆంధ్రకవి ''ధూర్జటి'' కవిత్వానికి, ఇంతటి తియ్యదనము ఎక్కడి నుండి, ఎలా వచ్చిందో గదా, ఊహకందడంలేదు సుమా- అంటూ రాయల వారు ప్రశ్నిస్తూ ఉండగా, -

వెంటనే పిలువని పేరంటంగా, కలుగజేసుకున్న రామకృష్ణుడు, దానికి గల ముఖ్యకారణం నాకు తెలుసు. చెప్తాతాను వినండి - అని, అదేమిటంటే - ఆ ధూర్జటి కవి, అనవరతము, సంతాపాన్ని తగ్గించే, లోకాతీత సౌందర్యముగల సుకుమారలగు భోగపుస్త్రీల అధరామృతాన్ని, ఆస్వాదిస్తూ ఉండేవాడు. అలా, వేశ్యాలోలుడై, వారి పెదవుల మాధుర్యాన్ని ఆస్వాదించిన ''ధూర్జటి''కవి నోటినుండి ఇట్లురావడంతో, అతని కవిత్వానికి అంత గొప్పమాధుర్యం, అనాయాసంగా లభించింది.- అని భువన విజయ సభలో బొరున ఉగ్గడించి వినిపించాడట రామకృష్ణుడు.

వి.1 దీనితో, ధూర్జటి వేశ్యలతో గడిపేవాడనే విషయం, అన్యాపదేశంగా రామకృష్ణుడు అందరికీ స్ఫురింపచేయడమే కాకుండా నవ్వింపజేసాడు.

2. సాధారణంగా సభలలో, ఇతర వ్యక్తిగత విషయాలను ఎవరూ పట్టించుకోరు. మన రామకృష్ణుడు వికట కవి, హాస్యప్రియుడు కావడంతో, అతడు ఇతరుల వ్యక్తిగత వ్యవహారాలను కూడా గమనించి, బహిరంగ పరచేవాడు. ఇట్లు చెప్పిన కవులులేరంటారు కొందరు.

3. ప్రశ్నించినట్లు లేకున్నా, స్వయంగా కల్పించుకొని, జవాబుచెప్పటం, ఇక్కడ మరొక విశేషం.

4. కొందరుదీన్ని ''సమస్య'' గా కూడ పేర్కొనవచ్చునంటారు, కాని సమస్యాలక్షణాలు దీనిలో ప్రముగ్యాలు

3. క తెన్నాలి రామలింగడు - తిన్నాడుర తప్పెడంత తీయని బెల్లం -
బెన్నగ మన పింగళి సూరన్నకు నోరంత పేడయై పోయెనురా?

సం. కసిపట్టలేక సూరన్న ఒకనాడు, రామకృష్ణుని ఇట్లు నిందింప, దానికి రామలింగని ప్రతీకారమిది. రామకృష్ణుడు ఇతరకవుల వ్యక్తిగత విషయాలను కూడ, నోటి దురద, దురుసుతనంతో, బైటపెట్టుచుండ, ఇతర కవులేమి చేయలేక, అనలేక ఊరక ఉండిపోయేవారు. ఒకనాడు రామకృష్ణుడు నోటినిండా బెల్లం తిని, తిప్పుకోలేక, ఉక్కిరి బిక్కిరై, తికమకపడటం చూచి, సందు దొరికింది కదా - అని సూరకవి ఇలా ఉన్నాడట.

మన తెనాలి రామలింగడు పేడపల్లికంత తియ్యని బెల్లము తేరగా దొరికింది కదా! అని తిన్నాడంటూ వెక్కిరింపగా, ఈ వికటకవి మాత్రం ఊరుకుంటాడా? వెంటనే సరిగా లెక్కపెట్టి చూస్తే, మన పింగళి సూరన్నకవి నోరుకాస్తా మొత్తం మీద, పేడతో కూరుకుపోయింది సుమా! - అని తన ప్రతీకారం ప్రదర్శించాడట!

వి. వికట కవి పదం ఎటు త్రిప్పిచదివినా, వ్రాసినా, రెండువైపులా ఒకేవిధంగా ఉన్నట్లు, అతని నోట కెవరు

తాళం వేయగలరు? ఒతని మాట ఎటు|తిప్పి ఎలా అన్నా వికటంగానే ఉంటుంది. ఒకప్పుడు ఆ హాస్యం మొరటుగా కూడ ఉంటుంది.

4. చ. పదలక మ్రోయు ఆంధ్రకవి వామ పదంబున ఉన్న నూపురం -
బుదిత మరాళకంఠ నినదోక్తుల ఏమని పల్కు? పల్కు డీ
గుది యలకాని నున్నని త్రికోణముపైగల భాగ్యరేఖ నీ? నుదుటను లేదు లే దనుచు నూరు తెరంగుల నొక్కి పల్కెడున్॥

ప్రశ్న: 1. సభ్యులారా! రాయల వారు ఆంధ్రకవి (పెద్దన) ఎడమకాలికి తొడిగిన ''గండపెండేరము'' హంసధ్వనులతో గలగల మ్రోగుతూ, ఏమని పలుకుతోందో, కొంచెం వివరించి చెప్పగలరా? అని ప్రశ్నించాడు మొదట రామకృష్ణకవి.

(ఇది విద్వజ్జన కోలాహలుని దంటాడు శ్రీదీపాల పిచ్చయ్యశాస్త్రి)

దానికి, ఉత్తరం : ''గుదియల కామి ''కి సంబధించిన రోమ రహిత త్రికోణము (యోని, ఆడుగురి) పైనున్న అదృష్టరేఖ నీ ఫాలభాగం (నొసలు) పై ''లేదు, లేదు'' - అని, గండపెండెర ఘలంఘలలు అనేక విధాల నొక్కి చెప్పుచున్నవి సుమా! అని రామకృష్ణుని కొంటె సమాధానం

వి. రామకృష్ణుడు ఒసలే హాస్యప్రియుడు, మదురైనవాడు, శృంగారప్రియుడు, కోలాహలపండితుని కొలుపట్టించు (హింసించు) టకు గాని లేక తాతగారి యొద్ద తగవులాడటం, తగవుతీర్చడం కూడ పనిగాపెట్టుకున్న ''వికటకవి''గదా! అందుచే, అఘటన ఘటనా సమర్థుడగు అతడు, గుదియలకామి విషయం కోలాహలుని పైపే మొగ్గుచూపుచున్నట్లు చేసినాడేమో.

సంస్కృతాంధ్రాలలో సాటిలేని మేటి పండితుడు ''విద్వజ్జన కోలాహలుడు''. అతడు, గాన, వినయ కుశలయు, తన ఉంపుడుకత్తెయు అగు ''గుదియలకామి''తో, కృష్ణరాయాస్థానమున కేతెంచి నపుడు, పెద్దగా బాధపడినపుడు, రామకృష్ణుడు ధైర్యంచెప్పి, కోలాహలుని పలాయన మంత్రం పఠించునట్లు, చేసినాడనియూ, కొందరుపెద్దలు చెప్పుచుందురు.

రామకృష్ణుని పంటి రాటుతేలినవారు ఉన్నచోటుకి రావటం తనదేతప్పు - అని కోలాహలుడే కోలుకొని - వెళ్లిపోయినాడని మరికొందరి మాట.

5. సీ. ఒట్టు సుమీ యన్న, ఒట్టు సుమీయంచు, నేమేమెయన్న, నేమేమెయనుచు,
కానీగదేయన్న, కానీ గదేయంచు వింకేమియన్న, వింకేమియనుచు,
ఓసి పోవే యన్న ఓసిపోవేయంచు, ఔనంటెనవిన, ఔనంటెననుచు
మరవకు మిదియన్న, మరవకు మిదియంచు,
నీ వెంతయనిన, నీ వెంత యనుచు,

తె. ఒక తె మగనికి నాశించు టొప్పదనిన
ఒకతె మగనికి నాశించు టొప్పదనుచు,
పట్టియాడె నారంభతో ప్రథమరంభ
ప్రియుడు నిలుచున్న నిలువక పెద్దర'దగ॥ క. పూ. 3-206

సం. పింగళి సూరన, కళా పూర్ణోదయం లోని ఉభయ రంభల ఉప్పుటసంవాద మిది.

భావం: ఓసీ! మాయారంభా! ''నీయమ్మతోడే'' అని ఒట్టుపెట్టుకుంటున్నానే అని సత్యరంభ అనగా, నేనూ అట్లే ఒట్టుపెట్టుకుంటున్నా నని మాయా రంభ పల్కెను.

2. ఏమి చేసితివే అనిన, ఏమి ఏమి అనినది.

3. కానీ, మాస్తానులేవే అన్న- అమె కూడ అట్లాగే కానీలేవే మాస్తానెను.

4. ఇంకా, నీతోపోరేల? అనిన, నాకు మాత్రం ఇంకెందుకు? అన్నది.

5. నీమోహం చూపకుండా దూరంగా పో, అనగా, నీవేపోవే అన్నది.

6. అవును, నేనన్నమాట నిజమేయను, నామాట కూడ అంతే సత్యం సుమా.

7. ఇంతలు చేశావు, మరచి పోకు - అనిన, నీవు కూడ వాటిని మరువవద్దు.

8. నీ వెంత? నీ సాహసమెంత? అనిన, నీ బలం బండపడుతుందిలే.

9. మరొక దాని మగనిని కోరటం తగదనిన - నీవు మాత్రం నాప్రియుని కోరడం లేదా.

10. ఇట్లు సత్యరంభ ఎంతో బాధతో తిడితే, ప్రియుడు- ''వలదు, ఆగు'' అంటున్నా, కపటరంభ నిలువక, పెద్దశబ్దం చేస్తూ, ''నీవునేర్పిన విద్యయే నీరజాక్షీ!'' అని, ఆమె మాటలను ఆమెకే అంటునడుతూ తిట్టడం మొదలుపెట్టింది.

వి. 1. ఇంత కంటే ప్రాచీన కవుల ''సామాజిక స్పృహ'' కు వేరొక నిదర్శనం కావాలంటారా?

2. పింగళి సూరకవి ''అష్టదిగ్గజాల''లో ఆఖరికి లెక్కింపబడిన చిన్నవాడు.(?) అయినా ఆనాడే కాదు, ఏనాటికైనా ఎంతో స్మరించుకోదగిన అపూర్వకళాఖండ త్రయాన్ని, ఆంధ్రదేశానికి అంకితం చేసాడు. ఆ త్రయం పరస్పర సంబద్ధం కాకపోయినా, సాహిత్యంలో ఒక క్రొత్త ఒరవడితో '' న భూతో న భవిష్యతి'' గా వెలుగొందుతోంది. ఈనాటి రేడియో, టి.వి.,లకు ఈ కవి ఆనాడే క్రాంత దృష్టితో దర్శించి, బీజారోపణం గావించాడా ? అన్నట్లు, దిఙ్మాత్రంగా ప్రదర్శించిన ప్రతిభాశాలి. అతని ''కళాపూర్ణోదయం'' సర్వకళా పూర్ణోదయమనుట- అతిశయోక్తి కానేరదు. స్వభావోక్తియే.

అతడు, అసలు రంభా నలకూబరులకు ప్రతిగా, అపరరంభానలకూబరులను సృష్టించి,'' ఆ సత్య- అసత్య రంభ ''లకు పెట్టిన సవతి పోరు- సంవాదాన్ని సందర్శించి ,స్పందించని వారంటూ ఉండరు. ''అంత మదింపకువేయని పల్కిన-- ''పద్యం (3-205) కూడా ఇట్టిదే.

6 శా. గుత్తిం పుల్లెలు కుట్టి, చంద్రగిరిలో గూడెత్తి పెన్గొండలో
హత్తిన్ సత్రమునందు వేడి, బలదుర్గాధీశు తాంబూలపుం
దిత్తుల్మోసి, పదస్థులైన ఘనులన్ దీవింప ----- / దీవించెదన్
మత్తారాతి యయాతి నాగమసుతున్ మంత్రీశ్వరున్ దిమ్మరున్ ॥

సం. భట్టుమూర్తి తిమ్మరుసును తిట్టుచూ/ ఆశీర్వదించిన పద్యమిది.

భట్టుమూర్తి పెద్దనకు పోటిగా ''వసుచరిత్ర'' వ్రాశాడు. ''లొట్ట యిదేటిమాట ---'' అంటూ, ద్విరుక్త టకార ప్రాసతో ఉత్పలమాలికను కూడా వ్రాశాడు. హరిశ్చంద్ర నలోపాఖ్యానాదులను కూడ రచించాడు. అయినా, అంత గొప్పపేరు తెచ్చుక ోలేకపోవడానికి, అనేక కారణాలు చెప్తుంటారు. ఆయన శబ్దాధికారాన్ని,

పంచః ప్రభుత్వాన్ని గ్రహింపని కొందరు, మూర్తికవిని నిందించారు కూడా. దానికతడు ఎంతో బాధపడినాడు. అసదృశమగు శబ్దచమత్కారంతో అనుప్రాసగా, కమ్మెమ్మును తీసినట్లుగా ఈ

7. నరసింహ కృష్ణరాయుని- కరమరుదగు కీర్తియొప్పెఁ గరిభి ద్గిరిభి -
త్కరికరిభి ద్గిరిభి - త్కరిభి ద్గిరిభి త్తురంగ కమనీయంబై ॥

(లఘుటీక: కరిభిత్= గజాసుర సంహారం చేసిన శివుడు, గిరిభిత్-కరి= పర్వతముల రెక్కలను తెగనరికిన ఇంద్రుని యొక్క- ఏనుగు, - ''ఐరావతము''. కరిభిత్ - గిరి= గజాసుర సంహర్తయగు శివుని కొండ-''కైలాసము'', గిరిభిత్= కొండలను భేదించిన వజ్రాయుధము, కరిభిత్- గిరిభిత్- తురంగ- కమనీయంబై = గజాసుర సంహర్తయగు శివుని, వాహనము(తురంగము) నందీశ్వరుడు, గిరిభిత్-తురంగము=పర్వతముల రెక్కలను భేదించిన ఇంద్రుని (గిరిభిత్) యొక్క ఉచ్చైఃశ్రవము (వాహనము)- వీనిచే సుందరమైనదైన, ఆ శ్రీకృష్ణదేవరాయని కీర్తి కరము- అరుదు అగు (నట్లుగా) ఒప్పెన్ = మిక్కిలి- వింతగొల్పునట్లుగా - వెలుగొందెను.

ఈ కంద పద్యం చెప్పి, రాయల మెడలోని అమూల్య తారహారాన్ని కూడ పారితోషికంగా పొందినాడు. అయినా, అతని కీర్తి పతాక ఆకాశంపై, రెపరెపలాడక పోవడానికి అనేక కారణాలు.

ఓనొక కారణంతో కోపగించిన మూర్తికవి, మంత్రి తిమ్మరుసు పుట్టుక పూర్వోత్తరాలన్నీ బహిర్గతం చేస్తూ, ఆ పద్యం మూపొలిక పూర్తిచేయగా, భయపడిన తిమ్మరుసు యుక్తితో అతని నోరు కట్టివేయుటకు, భట్టుమూర్తి మెడలో, తన పచ్చల హారం వేసి, ఆ తిట్టు పద్యాన్ని, ప్రశస్త పద్యంగా మార్పించి చమత్కారంగా పూరింపచేసుకొన్నాడట.

ఏమైనా భట్టుమూర్తికి కోపగుణం కొంచెం హెచ్చుమోతాదులోనే ఉన్నట్లు ఉంది. అతను '''ఉత్పలమాలిక''' యే కాక--

8 గీ. ముందు నిప్పుండు నికమీద మోద మలర
పద్యదండంబు చేబూని పార్థివులను
చంపుచున్నాడు, చంపును, చంపగలడు,
పరుషవాక్యత సమవర్తి భట్టుమూర్తి ॥

అనే పద్యం కూడ ఆయన పారుష్యాన్ని ప్రబలంగా ప్రకటిస్తుంది.

వస్తుతః, తిమ్మరుసు పూర్వం పడిన బాధలను స్పర్శిస్తూ, ప్రారంభింపబడిన, ఈ, '' గుత్తిన్ పుట్టెలు కుట్టి--- ''లోని 2 3/4 పాదాలలో దూషించినా, సంవాదం కాని సంవాదంగా, మధ్యలో తిమ్మరుసేమీ సంభాషింపకుండానే, ''పచ్చలహారం''తో ప్రత్యుత్తరమిచ్చినట్లుగా, మెప్పించి, మరలా, అతని చేతనే దూషణను భూషణంగామార్పించి, పద్యాన్ని ప్రశస్తితో పూరింపజేయించుకోవడంతో చేతోమోదాన్ని చేకూరుస్తున్నది.

9. వరబింబాధరమున్, పయోధరములున్, వక్రాలకంబుల్, మనో
హర లోలాక్షులు చూప కప్పరి మొగం బైనంత నేమాయె, నీ
గురు భాస్వజ్జఘనంబు, క్రొమ్ముడియు, మాకున్ జాలవే, ''గంగ క

ద్దరి మే లిద్దరి కీడు నుం గలవె? ఉద్యద్రాజబింబాననా! ॥

సం. వికటకవి రామకృష్ణునిదిగా వాడుకలోనున్నది ఈపద్యం.

ఈ పద్యానికి ''తెలుగు చాటువు'' కర్తలొక చమత్కార కథను జోడించారు. రాయల వారికి వేశ్యల్లో మాత్రం పతివ్రతలుండరా? అన్నంత భ్రమను ఒక ఉంపుడుకత్తె కల్గింపగా, మన వికటకవి ఆ వేశ్యా పాతివ్రత్యాన్ని పరీక్షింప, ''సువర్ణయోగి'' వేషంతో వెళ్ళి, వేశ్యామాతకు ఆశకల్పించాడు. ఆవేశ్యామాత ''స్వర్ణయోగ రహస్యం ''తెలుసుకోమని తన కూతురును ఆ యోగి ప్రక్కకు పంపగా, ఆయోగి వికృత వేషాన్ని, చేష్టలను చూచి సహింపలేక ఆ కూతురు, మారుముఖం పెట్టుకొని ప్రక్కకు తిరిగి పరుండగా, అప్పుడు ఆ యోగి వేషధారియగు రామకృష్ణుడు ఈ పద్యం చెప్పాడంటారు.

ఉద్యచ్చంద్రముఖీ! మనోజ్ఞలగు వంపలాక్షులు పక్కలో చేరి, ఎళ్ళ ఎదుటి తమ దొండపండు వంటి పెదవులను, గబ్బిగుబ్బలను, వంకరి టింకరి ముంగురులను, చూడనియ్యకుండా, ఎడమొహం, పెడమొహం పెట్టుకున్నంతమాత్రాన, ఏమి లాభం చేకూరుతుంది? (చెప్పు) ఆపంకజాక్షుల పృష్ఠ (వెనుక) భాగం మాత్రం తక్కువైనదా? ఓసీ! నీ వెనుకనున్న భాసురాలైన ఈ పిరుదులు, నీ కొంగ్రొత్త కొప్పుమాత్రం, తక్కువైనవా? – అవి మాకు సరిపోవా? తప్పక సరిపోతాయి అని భావం.

ఏల యనగా గంగానది – జనులందరికీ అన్ని చోట్లా పరమపవిత్రమైన నది. అట్టి పవిత్రగంగకు ఆ వైపు స్నానం చేస్తే మేలు, ఈ వైపు స్నానం చేస్తే కీడు కల్గిస్తుందా? ఏవైపయినా మేలునే కల్గిస్తుంది సుమా! – అని– అలవోకగా సోదాహరణంగా హెచ్చరించి , తరువాత రాయల వారి అస్థానమునకేగి, ఈ పద్యం చదివాడట ! ఈపద్యం దేనిలోనిదని అడిగినవారికి ''యోగి భోగిని సంవాదం'' లోని దని చమత్కరించి చెప్పి, వారికి కనువెలుగు కల్గించాడట!

వి. ప్రత్యేకంగా, పరస్పరప్రశ్నలు లేకున్నా, చేష్టలను ప్రశ్నలుగా భావించుకొని, ప్రత్యుత్తరించుట కూడ, ప్రశంసింపదగినదే.

**10.** చతురులలోన నీవు కడు జాణ వటంచును బిట్టు కౌగిలిం
చితి, నిటు మారు మోమిడగ చెల్లునె? – ఓ రసికాగ్రగణ్యా! ఆ
ద్భుతమగు రంగు బంగరపు బొంగరపుం గవ బోలు నీ కుచ
ద్వితయము రొమ్మునాటి, అల వీపున దూసెనటంచు జూచితిన్.

సం.'' రసికజనమనోభిరామ'' కర్త కూచిమంచి తిమ్మకవి గొప్ప రసికశేఖరుడుగా పేరొందినవాడు. అందగాడు . వాని గ్రంథం చదివిన ఒక వారవధువు(వేశ్య) అతనికొరకై అన్వేషించి, ఎలాగైతేనేమి? చివరికి ఒకసారి, ధారిగాచి దర్శించి, బిగి కౌగిటిలో బిగించుకొన్నదట! అప్పుడు వారిద్దరికి జరిగిన సంవాదమిది.

వారవధువు: ఓ రసిక శ్రేష్ఠా! అందంగల చురుకైన వాళ్లలో, నీవు మిక్కిలి నేర్పరివని, వీరావేశంతో, తనంతతావొలచి వచ్చి, కౌగిలించుకుంటే, నీవుకూడ నాకు గాఢాలింగనసౌఖ్యమిచ్చుటకు బదులు, నీతసంగా పెడమొగం పెట్టడం తగునా? ఇదేనా నీ రసికత? అని వేశ్య ప్రశ్నింపగా,

తిమ్మకవి ప్రత్యుత్తరం : ఓ కామినీ! నీవు హఠాత్తుగా, ఆశ్చర్యకరంగా, రంగారు, బంగారు, కఠోర బొంగరముల వలె కూచిగానున్న నీ స్తన ద్వంద్వము ఒక్కుమ్మడిగా, గాఢాలింగనముతో, గట్టిగా నారొమ్మున గుచ్చుకొనగా,

ఆ స్తనాలు నారొమ్ముననాటి, వీపువైపునకు కూడ పాడుచుకుని వచ్చినవేమో- అని భయంతో, అవ్వలి మొగం పెట్టుకుని చూచాను సుమా! అని చమత్కారంగా చెప్పి తప్పించుకున్నాడట!

వి. 1 ఈ పద్యంలోని పూర్వార్థమే వేశ్యది , ఉత్తర్థాం తిమ్మకవిది.

2. ఓ రసికాగ్ర గణ్యా ! అను సంబోధన ''దేహళీ దత్త దీపన్యాయం'' (గడపలో నుంచిన దీపం) తో, లింగభేదంతో, ఇరువురికీ విశేషణంగా కూడ, భావింపవచ్చును.

3. కోరిన కోరిక పూర్తిగా తీరకపోయినా, తిమ్మకవి చమత్కార చాతుర్యానికి చేతోమోదము నొందిన, ఆ ఆటవెలది (వేశ్య) ఆయనకు పసదనము (పారితోషికం) కూడ పంచి ఇచ్చి పంపినదట!. అనాటి రసికత అట్టిది!

11 అతడు గోపాలకుండు - ఇతుడు భూపాలకుండు -

ఎలమినాతనికన్న నితడు ఘనుడు.

అతడు పాండవ పక్ష - ఉతడు పండిత పక్ష, -----

------,,------,,---------,,-

అతడు యాదవపోషి ఇతడు యాచకపోషి -----

------,,------,,---------,,---

అతడు కంసధ్వంసి, ఇతడు కష్టధ్వంసి ------

------,,------,,---------,,---

గీ. పల్లెకాతండు పట్టణ ప్రభువితండు

స్త్రీలకాతండు పద్మినీ స్త్రీల కితడు.

సురలకాతండు, తలప భూసురులకితడు.

కృష్ణుడాతండు శ్రీ మహాకృష్ణుడితడు.

సం1. ఆంధ్రంలో, ఆబాలగోపాలానికి అర్థమయ్యేటట్లుగా, ఆర్ద్రంగా, మధురాతి మధురంగా, రామాయణము అందించిన కవయిత్రి ఆత్మ (తు) కూరి మొల్ల. ఆమె రాయలను సందర్శించినపుడు, (?) ఆప్రసిద్ధ కృష్ణావతారం కథతో పోల్చి, వానికంటే ఈ కృష్ణదేవరాయలే గొప్పవాడు - అని ఇలా స్తుతించిందట.

2. ప్రశ్నోత్తరాలు లేకుండా, శ్రీకృష్ణుని, కృష్ణదేవరాయులను ఇద్దరినీ పోలుస్తూ, ఒకరికంటెనూ మరొకరు ఘనులని వర్ణన చేసింది, చాతుర్యంతో ఈ మొల్లమాంబ.

1. ఆ ప్రసిద్ధ కృష్ణుడు గోవు ( ఆవు) అను కాచే గొడ్లకాపరి కాగా, ఈకృష్ణదేవరాయులు భూమిని పాలించే రాజు, కాబట్టి ఆ కృష్ణుని కంటే ఇతడే గొప్పవాడు.

2. ఆకృష్ణుడు పాండవపక్షం వహించగా, ఇతడు పండితపక్షపాతి గనుక అతని కంటె ఇతడే ఘనుడు.

3. ఆకృష్ణుడు ఆయాదవు (గొల్ల) లను పోషింప, ఇతడు యాచకులను పోషించి ఘనుడయ్యెను.

4. ఆ కృష్ణుడు కంసుని చంపగా, ఇతడు ప్రజల సర్వకష్టనష్టాలను నాశనం చేయుట వలన ఆప్రసిద్ధకృష్ణునికంటే ఈ కృష్ణదేవరాయులే గొప్పవాడు సుమా!

5. ఇంకా అతడు చిన్న (వ్రేపల్లె) కు మాత్రమే రాజుకాగా, ఇతడు పెద్దపట్టణానికి ప్రభువు.
6. అతడు గోపికా స్త్రీలకు పరిమితం. ఇతడు పద్మినీ జాతి స్త్రీలకి కూడా ప్రభువు.
7. అతడు దేవత (సుర) లను మాత్రమే రక్షింప, ఇతడు సర్వభూసురులను (బ్రాహ్మణులను) రక్షించెను.
8. అతడు కేవలం కృష్ణుడు మాత్రమేకాగా, ఇతడు ''మహాకృష్ణుడు'' కనుక పై హేతువాదాలను బట్టి, ఎన్నివిధాల విచారించినా, ఆ ప్రసిద్ధకృష్ణుని కంటే రః కృష్ణదేవరాయులే గొప్పవాడు.- అని మొల్ల గట్టిగా వివరించి చెప్పినది.

దీనికి ''పేరడీ'' గానా అన్నట్లు, తెనాలి రామకృష్ణకవి ''అతడంబకు మగడు--'' ఇత్యాదిగా ఈక్రింది పద్యం వ్రాసినాడంటారు.

12.సీ. ఆత డంబకు మగడు - ఈతడమ్మకు మగడు,

ఎలమి నాతని కన్న నితడెఘనుడు

అతడు శూలముద్రిప్పు. నితడు వాలము ద్రిప్పు-

------,,------,,---------,,---

ఆతడమ్మున వేయు- నితడు కొమ్మున వేయు--

------,,------,,---------,,---

అతని కంటను చిచ్చు, ఇతని కంటను బొచ్చు---

------,,------,,---------,,---

గీ. దాత యాతడు గొనెల మోత ఇతడు,

దక్షుదాతండు, ప్రజల సంరక్షుడితడు

దేవుడాతండు, కుడితికి (ని) దేవునితడు

పశుపతి యతండు, శ్రీమహాపశువితండు॥

సం. 1 ముందు చూపిన మొల్ల పద్యమునకు ఇది ''పేరడి'' వలె కన్పడుతుంది.

సాధారణంగా ''సంవాదం''లో ఒకరిప్రశ్నకు మరొకరి సమాధానం ఉంటుంది. దీనిలో అట్లుగాక, ఒకరే ప్రశ్నోత్తరాలు లేకుండా, తత్ ప్రాయంగా, ఊహించుకొని ప్రత్యుత్తరమిచ్చుటవిశిష్ట విషయంగా, కన్పడుతుంది.

సం. 2. ఆ ప్రసిద్ధ శ్రీకృష్ణదేవునికంటే, ఈ శ్రీకృష్ణదేవరాయలే గొప్పవాడని, హేతువాద పురస్సరంగా పైపద్యంలో మొల్లమాంబ ఋజువుచేయగా, అసలే వికటకవి యైన రామకృష్ణుడు హాస్యప్రాయంగా, దానికి ''పేరడీ'' గా పెంపెసలార్చినాడా ? అన్నట్లు శివుని, నందిని -- పోలుస్తూ, ఈ పద్యం రచించినాడట!

భావం :1 ఆ ప్రసిద్ధ శంకరుడు పార్వతికి (అంబకు) మొగుడుకాగా, ఈ ఎద్దు (నందీశ్వరుడు) తనను గన్న అమ్మకేభర్తయై, దాటి, దూడలను పుట్టిస్తాడు. అందుచే, ఆశివుని కన్న ఈ నందీశ్వరుడే గొప్ప.

2. ఆ శివుడు త్రిశూలమును త్రిప్పుచుండ, ఇతడు వాలము (తోకను) త్రిప్పుచూ, అతని కంటే ఇతడే ఘనుడగుచున్నాడు.

3. ఆశివుడు బాణం (అమ్ము) తో కొట్టగా, ఇతడు తలమీది కొమ్ముతో పొడచి గొప్పవాడయ్యెను.

**4.** ఆ శివుని కంట్లో అగ్ని (చిచ్చు) ఉండగా, ఇతని కంటి చుట్టూ వెంట్రుకలు (బొచ్చు) ఉండటం వలని, ఈ సామ్యంతో, ఇతడే ఘనుడు.

**5.** ఆ శివుడు ఈవి గలవాడు (దాత) కాగా, ఇతడు జనసార (గోనెల) మోతతో ప్రముఖుడయ్యెను.

**6.** ఆశివుడు సమర్థుడు (దక్షుడు) కాగా, ఇతడు ప్రజలకు రక్షకుడు.

**7.** అతడు దేవుడు కాగా, ఈ వృషభం (ఎద్దు) తొట్టిలోనున్న కుడితిని దేవుకొని తిను ఘనుడు

**8.** అతడు కేవలం పశుపతి కాగా, ఇతడు మహాపశువు (మహానంది) అగుటచే ఇతడే, ఆ శంకరునికంటే శ్రేష్ఠుడని, అపహాస్యంచేస్తూ, ఈ వికట కవి విపరీత దృక్పథంతో వివరించెను.

13. పృథులత్పంబు వికార లీల దిగి, ధమ్మిల్లంబు చేబూని, రా
గద దృగ్జాలము తోడ కౌను నులి యూగన్,మోము మా ర్వెట్టుచున్,
వరలంజారిన నీవి బట్టుకొని, యావామాక్షియ ల్లేగె...../స
త్పదన భ్రాజిత రత్నదీపకలికాస్తం భంబుక్రీనీడకున్॥

సం. పెద్దనగారీ పద్యంలోని మూడు పాదాలు పూర్తిచేసి, నాల్గవ పాదం తోచక, బహిర్దేశమునకేగగా, ఆయన కూతురు హఠాత్తుగా వచ్చి, ఆ పద్యం చూచి, పూరించినదట ! ఈ పద్యాన్ని.

ఒక్కొకచో, ఒకరు ప్రశ్నింపకనే, మరొకరి పూరణ కన్పడు తుంది. ఇక్కడ, పెద్దన పద్యాన్ని ప్రారంభించి, 3 పాదాలు వ్రాసి, నాల్గవది సరిగా తోచక, బహిర్దేశమునకేగెను. ఇంతలో అటువైపుకు వచ్చినపెద్దనగారి కూతురు ఆ అసంపూర్ణ పద్యాన్ని చూచి, చక్కగా పూరించి పోగా, తర్వాత వచ్చిన పెద్దన, తానాలోచించిన భావాన్ననుసరించి, పూరింపబడిన, ఆ 4 వ పాదాన్ని, రసవత్తరమైనదిగా భావించి, సంతసించెనట!

భావము : సంభోగానంతరమొకనాయిక, అదొరకంగా మెత్తని సెజ్జనుండి దిగి, విడివడిన కొప్పునొక చేతిలో పట్టుకొని, అనురాగం గల చూపులతో, నడుము కొంచెం కదలుచుండ, ముఖాన్ని త్రిప్పి, వెడమొగం పెట్టుకొని, సడలిన కోకముడి (నీవి) ని పట్టుకొని, ఆ వామలోచన అటువైపుకు వెళ్ళినదట ! – ఇంతవరకే పెద్దన వ్రాత.

ఎట్టు? ఎక్కడకు వెళ్ళినదనగా – ఆ సద్గృహంలో ప్రకాశించుచున్న రత్నదీపాల కళగల కంబము (స్తంభము) యొక్క క్రింద పడిన నీలి నీడ దగ్గరకు(వెళ్ళినదట!) ఇది పెద్దన కూతురు యొక్క సుందర పూరణ. ఆమె కూడా ఆ తోటలోని సుందరపుష్పమే గదా!

పేర్గాంచిన కవులు, పండితులు, గురువర్యులు తమ తమ పాండిత్యంతో, చాతుర్యంతో చేయజాలని వానిని, వారి కూతుళ్ళు, శిష్యులు కూడా ,సులభంగా సుబోధం చేసిన, ఉదాహరణలు కూడ , కొన్ని కొల్లవచ్చినట్లు ముందుకు వస్తాయి.

మీమాంసా శాస్త్రజ్ఞుడగు గురువర్యునకే అర్థం కాని,''పూర్వం తు నోక్తం, అధునాపినోక్తం'' అన్న విషమవాక్యాన్ని, చక్కగా, పదవిభాగపురస్సరంగా, ప్రదర్శించిన శిష్యుడు, గురువును మించిన శిష్యుడైనాడట!

ఇక, పెద్దన పుత్రిక సంగతి ఇట్లుండ, రాయలసుత'' మోహనాంగి'' యు, వేలకొలది వరహాలను వెచ్చించి కొన్న, ''ఉద్ధతుల మధ్య పేదలకుండ తరమె'' అను పాదంతో,పూరణ పొందిన పద్యం కూడ రాణకెక్కియున్నది.

ఇంకా లోతుగా ఆలోచిస్తే, కొందరుపండిత పుత్రులు (పరమశుంఠలు) గా ప్రసిద్ధులైయున్నారు గాని, పండిత పుత్రికలుమాత్రం ఆవిధంగా ప్రసిద్ధలైనట్లు కన్పడరు. అలాంటి సామెత వచ్చినట్లు కూడ కన్పడదు.

14. బసవనకుపుట్టినప్పుడె – పరసముగోవిందరాజా, పసరంబైతే
కసవేటికి తినడంటే? – కసవ్వుస్‌చిను శత్రులాజి కలిసినవేళన్

సం.1 పూర్వకవులలోకొందరు వాక్శుద్ధిలో పాటు, శాపానుగ్రహదక్షులుగా కూడ నుండెడివారు. (వారిలో వేములవాడ భీమకవి ప్రముఖుడు, ఇతని వలె) రామకృష్ణుడు కూడ వాక్శుద్ధి కలవాడనుటకు ఉదాహరణంగా, ఈ పద్యం ''అప్పకవీయం'' లో ఉదాహరింపబడినది.

2. పూర్వం ''గోవిందరాజ''ను శత్రువుపై దండెత్తుచూ, రాయల వారు, తనతో పాటు రామకృష్ణుని కూడ తీసుకొని పోయెనట. ఆనాడు కొందరు వాక్శుద్ధి - సిద్ధి గల కవులు, పద్యాలలో విషమాక్షరప్రయోగం చేసి, వైరులకు అపకారం చేసేవారట!

3. రామలింగ కవి ఐదింట'క' కారం,ఏడింట 'ట' కారం ఉంచి, విషమాక్షర ప్రయోగంతో ఈ పద్యాన్ని రచించినట్లు వినికిడి.

భావం : ఈ గోవిందరాజ బసవన్న ( ఎద్దు) కు పుట్టినప్పుడే, పశువు (పసరము) అయినాడు. పశువైతే గడ్డి (కసవు) నెందుకు తినటం లేదు? అని ప్రశ్న.

దానికి రామకృష్ణుని సమాధానమేమనగా, శత్రువులు యుద్ధం ( ఆజి) లో విజృంభించిన సమయంలో, (ఓడిపోయి) తప్పకుండా, దాన్ని తినగలడని శాపనార్థం పెట్టెనట!

వి.1. ఇక్కడ, వికటకవి హాస్యంతో పాటు, శ్లేషకూడ లాస్యం చేయుట వలన , ఈ పద్యప్రభావం మీదపడి, గోవిందరాజ రాయలధాటికాగలేక, పూరి ( గడ్డి) గరచి, ఓటమినంగీకరించాడట.

2. బసవన= అచ్చుపోసి విడిచిన ఎద్దు, బసవన/డు–అనే పేరుగలవాడు అని కూడా నానార్థశ్లేష. అట్టి బసవన్న/ బసవడు అను పేరుగలవానికి (శ్లేషతో–అచ్చుటెద్దుకు) పుట్టినవాడు గనుక, గడ్డి (కసవు) మేయక, ఏమిచేస్తా డని భావాన్తరం.

15. శ్రీ మద్భూమి ధరాధి రాజతనయా! శృంగారగాత్రోజ్జ్వలా!
నామీదన్ దయలేక నీవును వృథానన్నేల వీక్షింతువే ?
ప్రేమన్ వేటనె వంటు నంజని పర స్త్రీగూడి నా విప్పుడున్
శ్రమింపన్ ననుగూడ నేల ? వదరా శ్రీశైల మల్లేశ్వరా!

సం. శృంగార, మధుర, రసభరిత భ్రమరాంబామల్లీశ్వరీ సంవాదం. ఈ పద్యంలోని పూర్వార్థంలో మల్లీశ్వరుని అనునయం, ఉత్తరార్ధంలో 'ఖండితా' నాయిక యగు పార్వతి ఉపాలంభం (దూషణ) లు రెండూ ఉంటాయి. భక్తులు రెండు జట్లుగా విడిపడి, ఒకజట్టు భక్తులు పూర్వార్థం చదువగా, మరొకజట్టు ఉత్తరార్థం చదివి, శృంగార మాధుర్యానుభూతిని పొందుతారు.

శివాలయంలో – పవలింపు సేవాసమయాలలో ద్వారం వద్ద ఒకరు, వెలుపల మరొకరు ఈ పద్యాలను బాహాటంగానే, పాడుతూ ఉంటారని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి భణితి.

శివుని ప్రశ్న : – పర్వత – రాజ ( భూమి ధర + అధిరాజ) పుత్రి ! సింగారింపబడిన శరీరంతో

ప్రకాశించు దానా! పార్వతీ! నీవేల నా మీద దయమాలి, నన్ను చూస్తున్నావు? అనగా సరిగా చూడుటంలేదండి సుమా అని భావం.

పార్వతి ప్రత్యుత్తరం: – నీవేం తప్పు చేయలేదా! వేటకు వెళ్ళుచున్నాననె వ్యాజం (కపటం) తో, అడవికి వెళ్లి, పరభామ (భ్రమరాంబ) ను కలుసుకోలేదా! అంతపని చేసి, ఇప్పుడు నన్ను కూడ రమ్మంటున్నావా? ఎందుకు ? పోవయ్యాలవి ఈర్ష్యాద్వేషాలతో 'ఖండితా' నాయికయై ప్రత్యుత్తరించింది పార్వతి.

వి. అన్య నాయికలతో రాత్రంతా గడిపి ప్రాత: కాలంలో తిరిగివచ్చిన నాయకునిలో, దంత, నఖ క్షతాది చిహ్నాలకు గుర్తించి, కోపగించిన నాయికను 'ఖండితా' అంటారు. అష్టవిధశృంగార నాయికలలో నీమెయొకతె.

16. ''సరసుడుకాడొ ? 'జాణ', రతి సంపదలేదొ? సమృద్ధి, రూపమో ?
మరుని జయించురూపము, మోహ? మనమానమె, ఇన్నియు కల్గి జారవై
తిరిగెదవేల? బాల! 'అతి ధీరవు ప్రౌఢవు', నీ వెరుంగవే?
నెరగృహమేధియన్ పలుకు నీచము దోచె, కొరంత దే సుమీ!

సం. 1. శృంగార పురుషుడగు శ్రీనాథుని సంవాదాత్మక పద్యాలలో నిదొకటి. ఒకవనిత, తనకు తగిన భర్తతో కాపురం చేస్తూనే, వ్యభిచరించుచుండ, ఆమెతో జరిగిన సంభాషణ!

ప్ర.1. ఓసీ ! నీ భర్త రసికుడుకాదా! ఉ. కాకేమి? గొప్పనేర్పరి (జాణ)

2. సంభోగ సంపద (మగతనం) లేదా? ఉ. అదిచాలఎక్కువగానే ఉన్నది.

3. అందంగాలేని వికారియా ??. అబ్బే! అందంలో అనంగుని (మన్మథుని) జయించినవాడే!

4. మరి వలపో (మోహము) ? ఉ. అదియును అధికమే.

5. అయితే, నీ భర్త ఇన్ని రతిచిహ్నాలతో రాసిక్యం వెలగబోస్తూ ఉంటే, నీవుమాత్రం జారిణి(వ్యభిచారిణి) విగా తిరుగుటకు కారణమేమి? అని, ఒక చెలి ప్రశ్నింప, ఉ. నీవు చాల తెలివి గల దానవు, (ధీర = భర్త పై వచ్చిన కోపాన్ని స్పష్టంగా చెప్పక, వ్యంగ్యంగా ప్రకటించునాయిక) అంతేకాక, నీవుబాగా తెలిసిన ప్రౌఢవు. (సంపూర్ణయౌవనంలో ఉన్నావు). ఇక ఆ మాత్రం నీకు తెలియదా?

అతడొక పరిపూర్ణ గృహస్థుడు,శాస్త్రోక్తంగా గృహస్థ ధర్మాల నన్నిటికీ ఆచరిస్తూనే ఉంటాడు. 'భర్తే పరమార్థం, సర్వస్వం' అనుకోవడం నాకంతగా పట్టదు. అతడు ఆ కట్టుకొన్న (తనదనిపించుకొన్న) భర్తకాక, కేవలం కట్టుకొన్న (బంధించిన) భర్త మాత్రమే కావడం దోషం (కొరత)గా నాకు తోస్తోంది సుమా! – అని ఆ వనిత వ్యంగ్యంగా, తనమనసులోని కామోద్రేకాన్ని తెల్పుకొన్నదట!

17. ఉ. ''రాజనిభాననా! సరసురాలవు, జబ్బుగ అల్లినా వదే
మేజడ?'' ''యింతకంటె వలెనే ?'' వలనొప్పబిగించియల్లవే?
' ఓ జవరాల ! వేరె పనియున్నది'' ''దోసము దోసమే మహా
రాజగునట్టి యవ్విజయరాఘవు మై విగురాకె (కు) కొమలి''.

సం. ఇది రంగాజమ్మకు, ఆమె సఖికి జరిగిన శృంగార సంవాదము. రంగాజీ (17శ) విజయరాఘవ నాయకుని వెల్లాటకత్తె (భోగముది, వేశ్య), అయిననేమి? ఆమె ఏకచారిణి. అతనిచే

'కనకాభిషేక – అది అనేకసత్కారములందిన ఆ స్థానిక. కొందరీ సంవాదము విజయనగరాధిపతిపై సూరకవి చెప్పినదనగా, వే. ప్రభా. శాస్త్రిగారు రంగాజమ్మదే అని నిర్ధరించారు.
ప్ర. 1. చంద్రముఖీ! సహ్యాదయవు. జడనింత వదులుగా అల్లినావేమి?
ఇంతకంటె నేర్పుగా, సమర్థంగా ఉండాలా?
2. ఔనే, జవరాల! ఇంతకంటే నేర్పుగా, కామోచితమగునట్లు (వలనొప్ప) గా బిగించి అల్లరాదా? వేరే పని కూడ ఉన్నదే!
ఉ. తప్పు, తప్పే, విజయరాఘవరాజు శరీరంపై (మెత్తని) చిగురాకువుగదా!
వి. 1. మొత్తంమీద శృంగారాన్ని కూడ సంవాదాలలో సంధించా రానాటి ఆంధ్రకవయిత్రులు
2. కొటేషన్ల తేడాతో మరొకవిధంగా కూడ అర్థం చెప్పుకోవచ్చుదీనికి.
18. '' ఇంతీ ! పాముపు పై ఇదె కంతుడు కూర్చున్నవాడు, కనుగొను మహహా, ''
''కంతు డనంగుడు, నీ తెలివింతేనా? విజయరాఘవేంద్రుడె చెలియా''
సం. రంగాజికి, ఆమె చెలికి జరిగిన మరొక సంవాదం.
ప్ర. 1. చెలీ! ఆశ్చర్యంగా ఉన్నదే! ఇదిగో ఈ శయ్య పై మన్మథుడు కాదే! ఆ మన్మథునికి అసలు శరీరమే లేదు, అనంగుడు. ( ఆ మన్మథుడే నేడు మారురూపం దాల్చి వచ్చిన) విజయరాఘవనాయకుడే ఇతడు. ఆ మాత్రం తెలుసుకోలేని దద్దమ్మవా? నీవు!
వి. 1. ఇక్కడ ఒకరొక విధంగా చెప్పితే, మరొకరు కాకు స్వరంతో మరొక విధంగా విశదీకరించటం వలన, దీనిలో 'వక్రోక్తి' అనే అలంకారమున్నది.
2. మొత్తం మీద పై రెండు పద్యాలు రంగాజీలోని రాసిక్యాన్ని చక్కగా రంజింప జేస్తున్నాయి.
19. నారీలలామ! నీ పేరేమి చెప్పుమన్న? – వామాక్షముంజూపి పలుకకుండె,
మత్తేభయాన! నీ మగని పేరే మన్న ? – దన చేతి జీర్ణవస్త్రమును జూపె,
వెలది! నీకేమైన బిడ్డలా? చెప్పుమన్న? – గర మొప్పమించి చుక్కలను జూపె,
కుటిల కుంతల! నీడు కులము నామంబన్న? – పంజరంబునమున్న పక్షిజూపె,
ప్రభువు మీకెవ రన్న గోపకుని జూపె,
ధవుని వ్యాపారమేమన్న దండ మిడియె,
చతురమతులార! ఆప్రౌఢజాణతనము
తెలసి కొనరయ్య బుద్ధి కౌశలము మెరయ॥
సం. ఇదొక చతుర నారితో జరిగిన చమత్కార సంభాషణము. మీ కుశాగ్రబుద్ధిని ప్రదర్శించి, ఆ జాణకు జవాబులు చెప్పండి – అని కవి ఒక సవాలు విసురుతున్నాడు మనపైకి.
ప్ర. 1. ఓ వనితామణీ ! నీపేరేమిటి?
ఉ. ఆమె మాట్లాడక–తన వామాక్షాన్ని ( ఎడమకన్నును) చూపించి. వామాక్షి = వామ + అక్షి = ' ఎడమ' అనియేగాక, అందమైన (వామ) కన్నులుకల దానని భావం. అనగా నాపేరు 'వామాక్షి' అని సమాధానాన్ని నోటితో చెప్పక, సంజ్ఞతో చక్కగా వివరించింది. తెలవి గల పాఠకులు పరించి ప్రతివచనాలు చెప్పుటయే

తరువాయి. కనుక, క్రిందిపాదాలలో గూడ, ఆ బ్రాహ్మణి, చూపించిన చేష్టలను బట్టే ప్రత్యుత్తరాలను ప్రదర్శించవలెనన్నమాట!

2. గజగమన! నీభర్త పేరేమి?

ఉ. ఆమె, తన 'చీర్ల (కు) వస్త్రం (చేల) (కుచేలం = చిరిగిన బట్ట) చూపింది. అనగా నా భర్త పేరు 'కుచేలుడు' అంటారని సంజ్ఞతో సూచించింది.

3. నీ కేమైన పిల్లలున్నారా?

ఉ. ఆకాశమున (మింట) నున్న చుక్కలను చూపింది. అనగా, అశ్విన్యాది నక్షత్రాలు 27 గనుక, నాకు పిల్లలు కూడ ఇరువది ఏడుమంది. అని తెలుసుకొమ్మని సూచన.

4. నీ కులమేది?

ఉ. ఆమె అక్కడే పంజరంలో నున్న పక్షిని చూపించింది. పక్షి = ద్విజము – రెండుసార్లు,మొదట గ్రుడ్డుగా, తర్వాత పిల్లగా, పుట్టును. ఇట్లే దంతములు, పాములు, బ్రాహ్మణులు కూడ ఆ 'ద్విజ' శబ్దంతో చెప్పబడతారు. బ్రాహ్మణుడు 'ద్విజ' డెట్లు కాగలడు? – అనగా అతనిది కూడ, అందరిమాదిరిగానే తల్లిగర్భంనుండి యేమొదటి పుట్టుక, కాని అటు తర్వాత 'యజ్ఞోపవీత (జంధెము) – అది ధారణతో రెండవజన్మము. కనుక 'ద్విజ- ద్విజన్మ'గా చెప్పబడతాడు. మొత్తంమీద 'నాది బ్రాహ్మణకులము' అని చెప్పినట్లైనది.

5. నీ ప్రభువెవరు? ఉ. గోపకుడు (కృష్ణుడు) – అని చూపెను.

6. నీ భర్త ఉద్యోగమేమి? ఉ. దండం (నమస్కారం) పెట్టటం అనగా బ్రాహ్మణుడు యాచనకు వచ్చి, భిక్షను గ్రహించి, 'సీతారామాభ్యాం నమః' అని నమస్కరిస్తాడు గనుక, నమస్కారంపెట్టటం నాభర్త యొక్క ఉద్యోగమని చెప్పినట్లైనది.

7.1. నోరార అడిగిన ప్రశ్నలకు, నోటితో వాచ్యంగా సమాధానం చెప్పక, చేష్టలతో చెప్పిన, ఆ వామాక్షి వావదూకత (యుక్తి యుక్త సంభాషణ) చతురమతులకెంతో చేతోమోదాన్ని కల్గిస్తుంది.

2. కుచేలుని భార్యపేరు 'వసుంధర' అంటారు మరి కొందరు.

20 ఏమి ముద్దులగుమ్మ! ఏమిరాచెలికాడ! – నీమీద నాప్రేమ నిలిపినాను,
రావె చక్కరబొమ్మ! రానైతి చెలికాడ! ఈ వేలమునసుద్దులెవ్వడెరుగు,
వరగదెవగలాడి! పగలురా చెలికాడ – మనసు నిల్పగలేము మావుదునుక,
ముద్దు బెట్టవెకొమ్మ! వద్దు రాచెలికాడ! యెత్తుడు గుబ్బల హొంతకారి.
ఓరిచెలికాడ! ఆమాటకొప్పినాను – అనుమనీరీతి నొడబాటు----
ప్రొద్దు చేయుదురిల దొర (?) పురుషులెపుడు -----
రెండవపాదంలో కొంత, నాల్గవపాదం సరిమైన పాఠాలు దొరకలేదు.

సం. ఈ పద్యం 'బ్రౌన్' దొరగారి సేకరణ. ఆయన ఆంధ్రభాష కు చేసిన సేవ అనల్పము. అ సూర్యంపశ్యలై, అటకలెక్కి, అంధకారంలోపడి, అజ, గజ, రామబాణ(చెద) భక్షితాలైన అపూర్వ పద్య-గ్రంథాలనెన్నిటకో, ఇనాలోకయోగం ఇప్పించిన మహనీయుడు. సాహిత్య సహస్రాక్షుడు.

వి. ప్రియుడొకడు రతికేళికి రమ్మని వేళపాళను గూడ వెక్కిరిస్తూ, మీద మీదకి దూసుకొని దూకుచుండ, అతని చేష్టలను ప్రశ్నలుగా గ్రహించి, ఈ సమాధానాలు చెప్పబడినవి.
వి. అర్థము సులభము

21. అక్కరో! సీదువల్లభుడహంక్రుతి చేసిన చేతవింటివా?
ఎక్కడ? ఎక్కడే?, మరియు నెవ్వరినెవ్వరి? నన్నె న్నా? నీ
పక్కడివేల పోపలయు ? నంపవ: యంపితి, గూడు మంటినా?
మ్రొక్కితి, వేడుకొంటి, నను ముట్టకుమంటి, నికేమిచేయుదున్॥

సం. ఇది కూడ బ్రౌన్ మహాశయుని సేకరణయే, పద్యశ్లోకంగారాన్ని ప్రకరణ సహితంగా, సార్థకంగా, సమన్వయించి చూపటం సామంజస్య రంజకం గాక, భంజక మౌతుందేమో!

22. మమతను దన్నునొక్క చెలి, మానిని! నీ విభు నామ మేమనన్
కమలజగంధి పల్కె - కరి -కంధి - ప్రజాపతి - చంద్రికా-తప
త్రముల, త్రివర్ణయుక్తముగ వ్రాసియు, నందలి మధ్యవర్ణముల్
క్రమముగ గూర్చి పల్కినను, క్రమ్మర, నావిభునామ మయ్యెడిన్॥

సం. ఇద్దరు చెలుల సంభాషణ. ఒకచెలి ''నీ భర్త పేరు చెప్పు'' మనగా, భర్త పేరు చెప్పుట, చేడియకు నావము (వెా)షిగనుక, కొన్ని పేరులూహించుకొని ,చెప్పి, ఆ పదాలలోని మధ్యాక్షరాలను కూడుకొనుమని, అన్యాస దేశంగా, ఆనామాన్ని , తెల్పినదట.

ప్ర. 1. ఒకచెలి తనవద్దకు వచ్చి, మానినీ! నీ భర్త పేరేమి? అని అడిగినదట. దానికామె

ఉ. ఓ పద్మగంధీ! నేనుచెప్పిన కొన్ని మూడక్షరాల పదాల యొక్క పర్యాయపదాలు వ్రాసుకొని, వానిమధ్యాక్షరాలను కలిపితే, నా భర్త పేరువస్తుందని - చెప్పినదట! ఆ చెప్పిన పదాలేవి? పర్యాయపదాలేవి? 1. కరి = ఏనుగు, 2. కంధి = సముద్రం, 3. ప్రజాపతి = బ్రహ్మ, 4. చంద్రిక = వెన్నెల, 5. ఆతపత్రము (గొడుగు) - ఈ 5 పదాలకు తగిన మూడక్షరాల పర్యాయపదాలేవనగా, 1. సా (రం) గం(= కరి - ఏనుగు) 2 సా (గ) రం (-కంధి - సముద్రము,) 3. వి(ధా)త (-ప్రజాపతి = బ్రహ్మ) 4. కౌ(ము) ది = (చంద్రిక = వెన్నెల;) 5. గొ(డు)గు (= ఆతపత్రము = గొడుగు)

ఈ అయిదు పర్యాయపదాల మధ్య బ్రాకెట్లలో పెట్టబడిన అక్షరాలను 'రం - గ - ధా - ము - డు అనే అక్షరాలను కలపగా, వచ్చిన ''రంగధాముడు'' నాభర్త పేరు సుమా! అని చెప్పిన ట్లైనది.

వి. 1. దీనిలో ప్రశ్నోత్తరాలు ప్రత్యక్షంగా జరిగినా, అడిగినవారికే, అన్యాపదేశంగా, ప్రశ్నించి, ఆలోచించి, తెలుసుకోమన్నట్లైనది. దీనిలో నామం(పేరు) గుప్తం(రహస్యం) గానుండుటచే, ఇది 'నామగుప్తం' గా కూడ అగుచున్నది.

23. చ. వెలమకులంబునందు విలువెల్ల రుకాంత - లనంగ విందున
వ్వలుకు లబద్ధమాయె! - కులపాలకధీమణి అప్పరాయరాట్ -
కలభం కీర్తికాలము, కృతికాంత, మహీజయకాంత, ముప్పురున్

కల జగమున్తిరుగ గా కనుగొంటిమి చిత్రమెట్లగన్॥

తం. 'వెలమదొరలసేవ వెయ్యేళ్లు చేసిన ఎల్లి గవ్వకూడ ఇవ్వబోరు', మెచ్చితే సల్లాపం చేస్తారు. కోపిస్తే ప్రాణం తీస్తారు – అని ప్రసిద్ధి, కాని ఈ నూజవీడు నారయ అప్పారావు గారట్టి వారు కారు. కవి పండితపోషకుడు, విశ్వదాతయై దానధర్మాలు చేయటంతో ఖజానా కాస్త ఖాళీ కాగా, ఒకనాడు కవిపండితులెవ్వరికీ కన్పడకుండ 'మేనా' తో తలుపులు మూయించి వెళ్లుతున్నారట. ఇంతలో చాలకాలంగా, వారి దర్శనం కోసం పడిగాపులు కాస్తున్న, పండితుడొకడు ఆయనవినునట్లుగా, పైపద్యంలోని 11/2 పాదాలు, బిగ్గరగా చదువగా, అప్పారావుగారువిని, మండిపడి, వానిని పట్టి శిక్షింపబోయారట! పండితుడుపలవిస్తూ, మహాప్రభో! పద్యమంతా పూర్తిగానిని, తప్పుంటేశిక్షించండి. అనగా, ''పూర్తిగాచదువు''అన్నారట.

పద్యభావం ''వెలమస్త్రీలు ఇంటినుండి బయల్వెడలరు – అనివిన్నాము, కాని ఈ దినాల ఆ మాటలు అబద్ధాలైనవి – అనటంతో, కోపగించిన రాజు, పూర్తి చేయుమనగా,

నేడు వంశోద్ధారక అప్పరాయని1.కీర్తి- 2 కావ్య – 3 భూజయ – కాంతలుముగ్గురు మాట గట్టుకొన్నట్లుగా, దేశమంతా తిరగటం చూస్తే, ఆశ్చర్యంగా ఉన్నది-అని పూరింప, ప్రభువు మెచ్చి, తగిన వసదన మిచ్చి, గౌరవించారట.

వి. దీనిలో అన్యోన్యసంవాదం లేదు. ఒక్కరే అడగటం, జవాబుకూడ, వారే చెప్పి, మెప్పించి. గౌరవింపబడటం విశేషం.

24. సీ. లజ్జ ఎవ్వరికమూల్యపుటులంకారంబు ? నెలతోడివెలిమిదేనికి చెలంగు
కలహంస విహరించు కాసారమెయ్యది? రామలింగకవీంద్రు నామమేది? --
విస్తతభీతిచే పూర్తిగా వ్రాయలేదు.

ఈ ప్రశ్నలకు ప్రత్యుత్తరాలు ఒయిదక్షరాలతో, అనులోమ విలోమాలతో కూడ సమానంగా ఉండాలని విషయ – షరతు.

ప్ర. 1. సిగ్గెవ్వరికి అమూల్యాభరణము ? ఉ. కులస్త్రీలకు ( ఉత్తమ స్త్రీలకు).

2. చంద్రుని (నెల) తో స్నేహము దేనికి ఉండును ? ఉ. కుముదముకు (కలువకు)

3. 'హంస' అనుపక్షి విహరించు సరస్సు ఏది ? ఉ. సురసరసు (దేవతల సరస్సు)

4. రామకృష్ణునికి పెట్టిన (నిక్) నామమేది? ఉ. ''వికటకవి''.---

పై 4 జవాబులు 1. కులస్త్రీలకు, 2. కుముదముకు, 3. సురసరసు, 4. వికటకవి. అను 4పదాలు అనులోమంగానే కాక, విలోమం (వెనుకనుండి ముందుకుచదివినా) కూడ, ఒకే విధంగా, సమానంగా ఉండటం ఎంతో సంతోషాన్ని కల్గిస్తుంది.

25. వంగతోట నుండు వరిమళ్లలో నుండు,
జొన్న చేలనుండు చోద్యముగను,
తలుపుమూలనుండు తలమీదనుండును
దీనిభావ మేమి తిరుమలేశ?

1 వంగతోటలోను, 2 వరి మళ్ళలోను, 3. జొన్న చేలలోను, 4. తలుపుమూలలోను, 5. తలమీదనుండునది చోద్యంగా ఉండునది ఏది? – అను ఈ పొడుపు, ప్రశ్నలు మొదట భ్రాంతిని కల్గించి "చిత్తాన్ని విస్మృతిలోకి" తోసివేస్తున్నాయి.

వస్తుతః, వాని పరమార్థరహస్యం పదవిభాగంలో ఉన్నదని తెలుసుకొంటే, దీని అర్థం ఇంత సులువా? అని ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

1. వంగ– తోటన్ – ఉండు = 'వంగచెట్టు' (వంగ) తోటలో ఉంటుంది.

2. వరి – మళ్ళలోన్ ఉండు = వరి (పంట) (వరి) మళ్ళలోనే ఉంటుంది.

3. చోద్యంగా, జొన్న – చేలన్ – ఉండు = ( ఆశ్చర్యంగా) జొన్న (పైరు) చేలలో ఉంటుంది.

4. తలుపు – మూలన్ – ఉండున్ = తలుపు – ఒక మూలగా ఉంటుంది.

5. తల – మీదన్ – ఉండును = శిరస్సు (తల) పై భాగాన ఉంటుంది.

వి.1. ఇలా విడదీసుకొంటే, కష్టం కల్గించక, ఎంతసులభంగా అర్థమౌతోంది.

2. "చోద్యముగను" పదాన్ని అన్నిటికీ అన్వయించుకొనవచ్చును.

26. ఎద్దీశున కశ్వంబగు? గ్రద్దన నేడడవి దిరుగు ఖర కంటకియై
హద్దుగనే వాడు ఘనుడు? పద్దుగ నుత్తరము లిందె పదయుంగానో॥

ప్ర.1. ఎద్ది + ఈశునకు, అశ్వంబు + అగు = ఏది – శంకరునకు – వాహనము ఔతోంది? అని 'ఇత్వ' సంధితో ప్రశ్నించ, ఉ. ఎద్దు + ఈశునకు అని ఉత్వసంధిలో విడగొట్టి, నంది ( ఎద్దు) శివునకు వాహనమని ప్రత్యుత్తరించవలెను.

2. ఖరకంటకి– ఐ – గ్రద్దన – ఏది – అడవిన్ తిరుగున్ = గట్టిముళ్ళు గలదై – తొందరగా – ఏ జంతువు – అడవిలో – తిరుగును? కాగా, ఉ. ఏదు + అడవిన్ – తిరుగు = ఏదు పంది( గట్టి ముళ్ళు గలపంది) అడవిలో – తిరుగుతుంది.

3. హద్దుగన్ – ఏవాడు – ఘనుడు = ఏమేరకు – ఎవడు – గొప్పవాడు.

ఉ. హద్దున్ – కనేవాడు – ఘనుడు = తనపరిమితిని, ఎల్లను ఎరిగినవాడే ఘనుడు.

1. ఈ మూడు కేవలం ప్రశ్నలే కాదు. పదవిభాగభేదంతో వాని ప్రత్యుత్తరాలు కూడ వానిలోనే ఉన్నవి.
దీనికి అడిదం సూరకవి పాఠాంతరం. ( ఉత్తరాలంకారంలో) ఈ క్రిందిది.

27. ఎద్దీశునకశ్వంబగు ? – క్షోణిని లెద్దాని వాంఛింతురెల్ల యన్ను?
విడెము వెద్దాన నొక్కంగగడగునరుడు? 'పంట' నని యుత్తరము చెప్పువాడ, నఖుడ!

ప్ర.1. ఏది ( ఎద్ది) ఈశ్వరునకు వాహనమగునది? ఉ. 'ఎద్దు' శివుని వాహనము.

2. కర్షకులు అన్నివేళలయందు దేనిని కోరుకొందురు?

3. మానవుడు తాంబూలమును (వక్కాకును, విడెమును) దేనితో నొక్కి, కొరకును?

ఉ. ఈ2,3 ప్రశ్నలకు 'పంటన్' అనునదొక్కటే ప్రత్యుత్తరము. ఎట్లు? ఉ. వ్యవసాయదారుడు ఎల్లపుడు పైరు (పంటన్) బాగాపండాలని కోరుకొనును. నరుడు తాంబూలాన్ని, దానిలోని వక్కను దన్తములతో (పంటన్ పన్నుతో) కొరుకును.

వి. పద్యంలోనే ప్రత్యుత్తరాలుండటం, రెండు ప్రశ్నలకొకటే విచిత్రంగా సమాధనం కావటం విశేషాలు.

28. సీ. ఏకచక్రముబండినెక్కు రేదెవ్వడు? 2 ఒడలెల్ల గనులైన యొడయడెవడు?
3 మఱ్ఱి యాకున బండు కుఱ్ఱవాడెవ్వడు? 4 శివుని యౌదల జేరి చెలగు నెవడు?
5 సమతమై సర్వభూతములనేలునెవడు? 6 వాయు భక్షణచేసిబ్రతుకునేది?
7 అఖిల జీవనంబుల కాధారమగునేది? 8 కొమరారమారుని గుఱ్ఱమేది?
9 కంధి దాటి లంక గాల్చిన మృగమేది? 10 క్షితిని జల్లబడగ జేయునేది?

అరయనన్నిటికిని నక్షర ద్వయమున - నొక్కయుత్తరుబె నొసగవలయు,

మొత్తం పది ప్రశ్నలకు రెండక్షరాలు గల పదమొక్కటే ప్రత్యుత్తరంకావాలి - అనినియమము. ఈ నియమాన్ని అనుసరించి, (హరి) అను రెండుఅక్షరాల పదమొక్కటే నానార్థాలతో సమధానముగుచున్నది.

ప్ర. 1. ఒకే చక్రం గల బండిపై నెక్కి తిరుగువాడెవడు? ఉ. 'హరి' (=సూర్యుడు).

2. దేహంనిండా కన్నులు గలవాడెవడు? ఉ.'హరి' (=దేవేంద్రుడు)

3. మఱ్ఱి ఆకుపై పరుండు బాలుడెవడు? ఉ. 'హరి' (= కృష్ణుడు).

4. శివుని శిరస్సుపై ( ఔదల) చెన్నొందువాడెవడు? ఉ. 'హరి' (= చంద్రుడు).

5. సర్వప్రాణులను సమానంగా పాలించువడెవడు? ఉ.'హరి' (=యముడు).

6. గాలినిమేసి బ్రతుకునదేది? ఉ.'హరి' (= పాము).

7. సర్వప్రాణులకు ముఖ్యాధారమైనదేది? ఉ.'హరి' (= వాయువు, గాలి).

8. మన్మథునికి సుందర వాహనమైన దేది? ఉ.'హరి' (= చిలుక).

9. సాగరందాటి లంకాదహనం చేసిన మృగమేది? ఉ.'హరి' (=కోతి, హనుమంతుడు).

10. భూమిని చల్లబడునట్లు చేయునదేది? ఉ.'హరి' (= వాన).

హరిశబ్దానికి నానార్థాలు:

శ్లో. యమానిలేంద్ర చంద్రాదర్క విష్ణుసింహాంశువాజిషు।
శుకాహిక పిభేకేషు 'హరి' ర్నా, కపిలేత్రిషు॥ అ.కో,

గుఱ్ఱము చిలుక, పాము, కోతి, కప్ప --- అనునవి నానార్థములు. ఇతర నిఘంటువులలో ఈ హరిశబ్దానికి ఇంకను ఎన్నో నానార్థాలు కలవు.

29. గీ. పర్వతశ్రేష్ఠ పుత్రికా పతివిరోధి -
అన్నపెండ్లాము అత్తను గన్న తండ్రి,
ప్రేమ వారింట పెరిగిన పెద్దబిడ్డ!
''మన్నమిప్పుడు తేగదే సుందరాంగి!''

సం. ఇక్కడ, ప్రశ్న ఒక పద్యంలో ఉండగా ప్రతివచనం మఱొక పద్యంలో ఉన్నది. పైకి, ఈ పద్యాలు మెదడుకు మేతనందించే, గూఢార్థాలు గలవిగా కన్పడుతున్నా, దురర్థాలు మాత్రం కావని గమనించాలి.

పర్వతశ్రేష్ఠ- పుత్రికా = హిమవంతుని వేలైన పుత్రిక లేక పర్వతశ్రేష్ఠ హిమవంతుని

వాడుడు''పార్వతి'', ఆమె- పతి= భర్త, శివుడు, అతని – విరోధి= శత్రువు మన్మథుడు, వాని – అన్న= బ్రహ్మ, వాని–పెండ్లాము= సరస్వతి, ఆమె- అత్త= లక్ష్మి, ఆమెను – కన్నతండ్రి= సముద్రుడు, వాని–పెద్దబిడ్డ = జ్యేష్ఠాదేవి, దరిద్రదేవత, పెద్దమ్మ, లేక ఓదరిద్రపుగొట్టు పెద్దమ్మా! సున్నము- ఇప్పుడు – తేగదే= (తాంబులంలోనికి) సున్నము – ఇప్పుడే కొంచెం తెచ్చిపెట్టవే – అని ప్రశ్న.

ఆమెమాత్రం తక్కువతిన్నదా? వచ్చిన విటుడు తనను అలాదూషించేవరకు, తానుకూడా తర్వాతి పద్యంలో దూషిస్తూ వున్నది. పూర్వం విద్యలునేర్చిన, రసికురాండ్రైన వెలయాండ్రెందరో ఉండెడివారు.

30. శతపత్రంబుల మిత్రుని-

సుతుఁజంపిన వాని బావ సూనుని మామన్,

సతతము తల ధరి యించిన – సుతవాహన వైరివైరి ''సున్నంబిదిగో''.

అర్థం – శతపత్రంబు – (పద్మాలకు) మిత్రుడు సూర్యుడు -------- వదిలనదట !

పై శతపత్రంబుల పద్యానికి పాఠాంతరములుగా కనపడుతున్నవి.

ఈ శతకపత్రం బుల మిత్రుని --''పద్యానికి పాఠాంతరాలుగా మరికొన్ని పద్యాలు కన్పడుతున్నాయి. మచ్చుకు-

శతకపత్రమిత్రు సుతుని తమ్ముని బావ – పెద్ద యగ్రజుండు ప్రీతిదాల్చు,

నట్టి యాయు ధంబు, నదనిని మోచిన న – యతండ యితడు – సుమ్మి, అంబుజాక్షి!

భ. ఓ పద్మాక్షీ! ఇతడు దెవరనుకొనుచున్నావు? ఆశత (క) పత్రమిత్రుడు- ఆపద్మాలకిష్టుడగు సూర్యుడు, అతని సుతుడు – కర్ణుడు – అతని తమ్ముడు అర్జునుడు. ఆ అర్జునుని బావ – కృష్ణుడు, అతనిపెద్ద – అగ్రజుడు (అన్న) బలరాముడు అతడు ఆదరంతో ధరించు ఆయుధం – నాగలి. ఆ నాగలిని మెడపై మాయు (వాడు) నది – దున్నపోతు అనగా – ఇతడు సాక్షాత్తు ''దున్నపోతు'' సుమా! అని భావం.

వి 1. కొందరీపద్యాలను ''బావమరదళ్ళ'' – కు కూడా సమన్వయిస్తారు

2. ఈ విషయమే మరోకవిధంగా కూడా చెప్పబడినది.

31. శతమ ఖు సతి యగు శశి కిని

సుతుడగు, వాని పినతండ్రి సూనుని మామన్,

సతతము తల దాల్చెడిదొర

సుతవాహన వైరి వైరి '' సున్నంబిదిగో ''

శతముఖు –సతి= నూరుయజ్ఞాలు చేసిన దేవేంద్రుని – భార్య, శచీదేవికి, సుతుడు= కొడుకు, జయంతుడు, వానిపినతండ్రి= ఉపేంద్రుడు (విష్ణువు), వానికొడుకు = మన్మథుడు, అతనిమామ- చంద్రుడు, అతనిని తలపై ధరించిన – దొర = శివుడు, అతని – సుతుడు = వినాయకుడు, వానివాహనం= ఎలుక, దానికివైరి= శత్రువు– ''పిల్లి'', ఆపిల్లికివైరి = కుక్క, ఓరికుక్కా! సున్నం ఇదుగోరా! అని సమాధానం.

గమనిక. ఈ 'శత పత్రంబుల మిత్రుని -- , ' పద్యానికి పాఠాంతరాలుగా మరికొన్ని పద్యాలు కన్పడుతున్నాయి మచ్చుకు :-

32. శతకపత్ర మిత్రు సుతుని తమ్ముని బావ

పెద్దయగ్రజుండు ప్రీతిదాల్చ
నట్టియాయుధంబు, నవనిని మోచిన
యతండు ఇతడు సుమ్మి, అంబుజాక్షి!

భావం. పద్మాక్షీ! ఇతడెవడనుకొనుచున్నావు? ఆశత(వ) పత్రమిత్రు(డు) ఆ పద్మాలకిష్టుడగు సూర్యుడు. అతని సుతుడు కర్ణుడు. అతని తమ్ముడు అర్జునుడు. ఆ అర్జునుని బావ కృష్ణుడు; అతని పెద్ద – అగ్రజుడు (అన్న) బలరాముడు. అతడు ఆదరంతో ధరించు ఆయుధము 'నాగలి' ఆ నాగలిని మెడపై మోయు (వాడు) నది – దున్నపోతు. అనగా – ఇతడు సాక్షాత్తు 'దున్నపోతు' సుమా అని భావం.

33. ''సరిబేసైరిపుడేల ? భాస్కరులు భాషానాథ''!, పుత్రా! వసుం
ధర యందొక్కడు మంత్రియయ్యె'', వినుకొండన్ రామయామాత్యభా-
స్కరుడో''? ''ఔ'' నైనన్ సహస్రకర శాఖల్లే, ''వవే!, ఉన్నవే,
తిరమై దానముచేయుచో, రిపుల హేతిన్, ప్రేయుచో, వ్రాయుచోన్.

సం. 1. అప్పకవి, ''రాపిపాటి తిప్పరాజు సంవాదము'', అనునామంతో, వ్యావహారిక, సంవాదాత్మకతను వెల్లడించాడు.

2. సూర్యులు ద్వాదశ (12) సంఖ్యాకులు. ''ధాత, మిత్రుడు, అర్యముడు....''మొ. నామాలతో, 2,4,6,8, 10, 12. – ఇవి సరిసంఖ్యలు కాగా, 1,3,5,7,9,11,–అనునవి బేసిసంఖ్యలు.

ప్ర.1. భాషాపతీ! భాస్కరులు (సూర్యులు) లోగా సరిసంఖ్య (12)లో ఉండేవారు. నేడు, బేసిసంఖ్య (11)లో ఉన్నారేమి? తండ్రీ! అని ప్రశ్న.

ఉ. కొడుకా! ఆ 12 గురిలో, ఒకరు భూలోకంలో మంత్రికావటంతో బేసిసంఖ్య (11) గా మిగిలినారుగదా! – అని సమాధానం.

2. అయితే, ఆ ప్రసిద్ధభాస్కరుడు – ''వినుకొండ''–లోనున్న రామయామాత్యభాస్కరు–డేనా!

ఉ. అవునయ్యా! అతడే !

3. అయితే, ఆ భాస్కరునికి 1000కిరణాలు వుంటాయిగదా? అవేవి వీనిలో కన్పడవు, ఎందుచేత?

ఉ. అయ్యో! లేకేమి? అవిగోచూడు. అవి ఎల్లప్పుడు కన్పడవు. దానధర్మాలు చేయునప్పుడుగాని, శత్రువులను తన ఖడ్గధారలతో చించి, చెండాడునపుడుగాని, వ్రాయునపుడుగాని మాత్రమే, సరిగా కన్పడతాయి.

వి. రామయ భాస్కరుడు –''మంత్రి''–అయినా, రాజులతోపాటు, అంతగొప్పగా దానధర్మాలు చేసి, అపారమైనకీర్తిని గడించాడన్నమాట!

గమనిక: ఇట్లు, ''సంవాద చిత్రాలతో'' కొందరు కవులు, రమ్యంగా రాజస్తుతులు చేసినారు. మచ్చుకు, మరికొన్ని వసన్నించండి. ఈ పద్యభావాన్నే, ఏమే జాహ్నవి అనే పద్యం అనుకరించినట్లున్నది. ప్రబంధాలలోకూడ చేసిన, ఇట్టిపద్య రచనలకు, ఈ సంవాద చిత్ర రచనల ప్రభావమే ప్రేరకం కావచ్చు.

34. ఏమే జాహ్నవి! ఏమిరాఘవ! అదేమ వైరి నెన్నేవు? నీ
నేమీ నా నవతిం గణించెద? వదేమీ, నీవు కాళిందివా?

జొ, మేనేటికి తెల్లనాయె?, జలధీంద్రా! తిమ్మమంత్రీశ్వర-

శ్రీమత్కీర్తులు గ్రమ్మగా ననిన, నాశ్లేషించు హర్షంబునన్. ప ప.పీఠిక

సం. యమునా సాగరాల సంవాదం – పేరుతో, ఫ. రామయమంత్రి, తిమ్మరుసు మంత్రినిట్లు స్తుతించెను.

సాగరప్రశ్న 1: ఏమే గంగా! ఉ. (కోపంతో) ఏమిటి? రాఘవా! (అని ''యమున'')

2. అదేమిటే, నన్నుబంధించి, నాకు శత్రువైన ఆరామునిపేరుతో నన్నుపిలుస్తావు?

ఉ. అవును, నీవుమాత్రం, నాసుతి –''గంగ''– పేరుతో నన్ను పిల్వటంలేదా?

3. అయితే, నీవు యమునవా? ఉ. ఔను

4. అవును, నల్లగావుండే నీరూపం తెల్లబడిందేల?

ఉ. జలధీశ! తిమ్మమంత్రి పద్యుని యశస్సు నాపై వ్యాపింప, తెల్లబడిపోయాను సుమా! – అనగా సముద్రుడు సంతోషంతో, యమునను కౌగిలించుకొన్నాడట!

వి. 1. గ్రమ్మగాన్ – అనినన్ – ఆశ్లేషించు––– అని పదవిభాగము.

2. కీర్తి తెల్లగా వుంటుందని కవి సమయము.

35. మ. ''పదవే రంభ! సురేంద్రు కొల్వునకు, అవ్వా''! నాకురాలేరదే!

''అదిఏమే? – ధర మండపాటి ''రఘునాథాధీశు ''– బాహాసిచే

నదనక్షోణిని నీగినట్టి రిపుసంఘాతంబు వేవచ్చెడున్

పదులన్, నూర్లురు, వేలు, లక్షలు, గణింపన్ శక్యమే చెల్లెలా?.

సం. ఈ అప్సరసల సంవాదం, రఘునాథరాజు (ఒంగోలు) చే లక్షంకి రాజుల పరాక్రమాన్నో తెల్పుతోంది.

ఒక అప్సరస (ప్రశ్న –1. ఓసి రంభా! దేవేంద్ర సభకు వెళ్లురాం, రావే!

రంభ– ఉ. అక్కా! నాకు రావటానికి తీరికలేదే!

2. అదేమిటే, సభలో సంతోషిద్దాం, రమ్మంటే, రానంటావేమే!

ఉ. ఓచెల్లెలా! భూలోకంలో రఘునాథ ప్రభువు తన బాహుఖడ్గంతో చెండాడిన శత్రుసమూహం వేలకొలది స్వర్గానికి తోసుకు వస్తున్నది. అల్లావచ్చేవారు పదులా, వందలా, వేలా? లక్షల కొలది కావడంతో, వారిని లెక్కింపలేక తలప్రాణం తోకకు వస్తోందన్నట్లుంది నాపని.

వి. 1. సమరంలో సమసినవారు, స్వర్గానికివెళ్లి, రంభాద్యప్సరసలతో రాణిస్తారని శాస్త్రులు.

2. గెల్చిన రాజుల వర్ణనలో, ఇలాంటి అతిశయోక్తులకు చోటు ఉంటూనే ఉంటుంది.

3. కనుకనే అవి – ''అతిశయోక్తి''– అలంకారాలని, నిజం దాచకుండా చెప్పబడ్డాయి. ఈ అతిశయోక్తులకు కొంత డిస్కౌంట్ ఇవ్వాలి.

36. శా. ''నేనాకాశ తరంగిణీన్, ధరణిలో నీవెవ్వరే''? నావుడున్

''నేనాజావలి ధర్మభూవిభుని పాణిన్ బుట్టు దానాపగన్,''

''నీ నాయంతర మేడకేడ''?– అవులే, నీ వేడ? నేనేడ? పో!

నీవా యాచకు పాదజాతవ టవే? నే''దాత్ర హస్తోదితన్''.

సం. ఆకాశ గంగకు ధర్మారాయని దానధారకు జరిగిన సంవాదం.

ఆకాశగంగ ప్రశ్న 1. నేను ఆకాశగంగను, భూలోకంలో నీవెవ్వరే?
దానాపగ ఉత్తరం: నేను జూపల్లి ధర్మారాయని చేతిలో పుట్టిన దానధారను.
2. అయితే, నీకూనాకూ తేడా ఎంత ఉన్నదో తెలుసా?
ఉ. ఆహా! తెలియకేమి? నీకూనాకూ తేడా హస్తిమశకాంతరం. పోపొమ్మి
నేను నీవలె, ఆ వామనావతారం (పొట్టి విష్ణువు) పాదంలో పుట్టిన దానను కానే, నేను మహాదాతయగు
ఆ ధర్మారాయుని చేతిలో పుట్టిన ''దానధారను'' సుమా!

వి. ధర్మారాయని దాతృత్వ పోషకమైన దీపద్యం.

37 ''ఏమీ! శేషుడ?'', ''ఏమి నారద''! - ''ముదంబేపారునా''?, తొంటివి
శ్రామం బేమియులే, ''అదేమి''?, సనిమీదన్‌రావు సింగాంకుడు
ద్దామ ప్రౌఢి జయింప, సోమకుల గోత్రాధీశ్వరుల్ జోగులై
భామల్ తామును భామలన్ వెదకగా, బాతాళమున్ దూరితిన్.

సం. నారద శేష సంవాదరూపంలో, వెం. వె. సింగభూపాలుని శౌర్యవర్ణన.
నారదప్రశ్న- 1. ఏమి ఆదిశేషా! నారదుని ఉత్తరం: ఏమంటావు నారదా?
2. సంతోషంగా ఉన్నావా? ఉ. పూర్వపు విశ్రాంతి దొరకటంలేదయ్యా!
3. అదేమి ? అట్లా అంటావు?
ఉ. రావుసింగభూపాలుడు, రాణయొప్పార విక్రమించి, చంద్రవంశ్యులైన జల్లిపల్లి ప్రభువుల నోడింప, వారు బిచ్చగాళ్లై భార్యలతోగూడ అగచాట్ల (బాముల) పాలుకాగా, వారు నన్నెక్కడ పట్టుకొని బాధిస్తారోనని, నేను పాతాళానికి పారిపోయి వచ్చానుసుమా!
వి. 1. కలహభోజనుడగు నారదునికి, పోరులేనిదే పొట్ట నిండదు. ఆపోరుకోసం ఆరాటపడతాడు కాబోలు!
2. ఓడిన రాజులు - బాములు = (కష్టాలు) పడుచుండగా, కవిచేసిన - సంధివశాన- పాములు - బాములుగా మారినవి. బాములలో పడిన రాజులు, ఇంకా - బాము- లను గాక, తత్సదృశంగా కన్పడు ''పాముల'' నెక్కడ పట్టి, పల్లార్చుతారో - అని, ఆదిశేషుడు (పెద్దపాము) తానుకూడా పాతాళానికి పారిపచ్చినట్లు కల్పించటం చమత్కారం గా వుంది.
3. వస్తుతః ఆదిశేషుడు అధోలోకంలో నుండగా, దానికి, కారణంగాని కారణంగా, సంధి సహాయంతో ఉత్ప్రేక్షతో ఊహించి, రచయిత - విభావనాలంకారాన్ని - కూడా జోడించి, విశదీకరించటం విశేషచమత్కారాధాయకం.

38. ఉ. ''రాయిటుభట్ట! యేమి కవిరత్నము!,'' పిల్చితి'', - ''వీవి పద్యముల్
ఏ యవనీశుపై?'' - నృపకులేశ్వరుడౌ - ఇభరాముశాహి-పై,''
ఆ యత పుణ్యమూర్తి యతడర్థులు వేడిన ఇచ్చు, ఇచ్చునా
వేయును, రెండువేలు, పదివేలును, లక్షలు, కోట్లునిచ్చు, నౌ.

సం. ఒక భట్టుకవికి, మరొకరికి జరిగిన సంవాదము.
ప్ర. 1: ఓభట్టు కవీంద్రా! ఇటురమ్ము. ఉ. ఎందుకు పిల్చినావు?
2. దావాన్ని గూర్చిన ఈ పద్యాలను ఏ రాజేంద్రునిపై వ్రాసినావయ్యా.

ఉ. ''రాజకులైక భూషణుండగు, ఇభరాముశాహిపై'' వ్రాశాను. ఆ పుణ్యమూర్తి మహాదాత.

3. అతడు అర్థులు (యాచకులు) అడిగినంతనే దానమిస్తాడు.

ఉ. నిజంగానే ఇస్తాడా?

4. ఔను, ఇవ్వటం మొదలుపెట్టాడా, ఒకటి, రెండు, పదివేలు, కాదు

లక్షలు, కోట్లుకూడా ఇస్తాడు సుమా!

వి. 1. మహమ్మదీయుడైనా,- ''మల్కిభరాము'' ప్రభువు- కవిపండిత భాషాభిమాని.

ఎందరో కవుల కెంతో ఇచ్చి,- ''యశస్వి''- యైన ధీశాలి.

2. కవిత్వం బాగానేర్చినవారినేకాక, అభ్యసించువారినికూడా ఆదరించేంవారట!

దర్వాజా ముందు, వెండి - బంగారు గొలుసులు కట్టించి, పరీక్షించేవాడట.!

ఒకప్పుడు, కవిత్వాభ్యాసం చేసేవారు కూడా ఎ. కరయుగములు చరణంబును--,

బి. యరలవ మదనన - అంటూ, పూర్వ - ఉత్తర కవితలు చెప్పిసమ్మానం పొందగలిగారట!

గమనిక: ఎ. పూర్వ కవిత అనగా, మొదటి మూడు పాదాలు పూర్వకవులవి గ్రహించి, నాల్గవ పాదాన్నిమాత్రమే, ప్రకృతోపయోగంగా తాను పూరించి చెప్పుట.

డి. ఉత్తరకవిత - అనగా సమస్యవంటిది. చివరిచరణం యిస్తే, ముందుండు మూడుపాదాలను సందర్భానుసారంగా పూరించుట.

గమనిక: ''భట్టు'' శబ్దం, ''పొగడ్తలు చేయు బట్టుజాతివాడు'' (బట్రాజు) నేగాక, విద్యావంతులు, కవిపండితులగువారి నామాలలో చేరి, - బిరుదుగా కూడా అయినది.

ఉదా. నన్నయ- నారాయణ- డిండిమ-భట్టులు. ఒకచో, ''భట్టుడు'', భట్టారకుడై, ప్రభువుగాకూడా ప్రయోగింపబడినాడు.

భట్టారకుడు, భట్టారుడు= పండితోత్తముడు.

వ్యా. విశేషాలు: పిల్చితివి + ఈ వి పద్యముల్---= పిల్చితివీవిపద్యముల్

39. ఎవ్వడవీవు కాళ్లు మొగమెఱ్ఱన? హంసను, ఎందునుండువో?
దవ్వుల మానసంబునను, దాన, విశేషములేమి తెల్పుమా!
మవ్వపు గాంచనాబ్జములు, మౌక్తికముల్ గల వందు, నత్తలో?
అవ్వి యెఱుంగ, మన్న - అహహా! యని నవ్వె బకంబులన్నియున్.

సం. బక-రాజహంసల సంవాదము. రాజహంసలు హిమాలయాలపైనున్న ''మానససరోవరం''లో నివసిస్తాయి. అప్పుడప్పుడు దేశంలోనికివచ్చి, వర్షాకాలనికి ముందే, తిరిగి మానసానికి చేరుకుంటాయని లోకప్రసిద్ధి. ఈ హంసలు కూడా పలువిధాలు.

''రాజహంసాస్తు తే, చంచుచరణైర్లోహితై స్సితాః'' - అనగాకాళ్లు, ముక్కు ఎఱ్ఱగామున్న హంసలు ''రాజ హంస'' లనిభావం. అట్టి రాజహంస నొక కొంగ ఇట్లు ప్రశ్నించినదట! .

కొంగ ప్రశ్న 1. కాళ్లు, ముక్కు ఎర్రగా నున్న నీవెవ్వరవు ఉ. నేను రాజహంసను

2. ఎక్కడ వుంటావు? ఉ. దూరంగా (దవ్వు) హిమవత్పర్వతాలపైనున్న మానస సరోవరంలో ఉంటాను.

3. అక్కడి విశేషాలేమిటో చెప్పరాదూ?

ఉ. అక్కడ కోమలములైన బంగారు తామరపువ్వులు, ముత్యాలు కూడా వుంటాయి.

4. మరి, ''నత్తగుల్లలు'' లేవా? ఉ. అదేమిటో మాకు తెలియదే!

ఓసి ఇంతేనా? నీతెలివి తెల్లారినట్లున్నదే - అని కొంగలన్నీ ఎగతాళి చేస్తూ పకపక నవ్వినవట!

వి. 1. గొప్పగా విశేషములెన్నో తెలిసిన పండితులను కూడా, విశేషాలేమీ తెలియని, కొద్దోగొప్పో చిన్నవి, పనికిమాలినవి మాత్రమే తెలిసిన మూర్ఖులు, ఏవో చిన్న ప్రశ్నలడిగి, ఇలానే, వెక్కిరిస్తారను, అంతరార్థము కూడా దీనిలో ఇమిడియున్నది.

40. హరిహరి! ఏమి సాంబ శివ!, అయ్యో! భయం పడి పల్కనోడెదన్,
అమరలేల పల్కు, భవద గ్రపురంధ్రి పెదక్క ఏదయా
సిరికిని దానికింబడక చీదర ఎత్తగ చింతపల్లెలో
వరకరణాల ఇండ్ల కడ వారకయున్నదయా! ఉమా పతీ!

సం. హరిహరుల సంవాదము సంవాదాలలో స్తుతులే కాక, నిందలు కూడా ఉంటాయి.

ప్ర. 1. హఠాత్తుగా ఓ విష్ణు దేవా ! అని పిలవగా, ఉ. ఏమిటి సాంబ శివా! అని విష్ణువు ప్రత్యుత్తరము.

2. ఏమీ లేదయ్యా! మిమ్ములను అడగాలంటే భయంగా ఉన్నదండి. ఉ. భయమెందుకు? నిస్సంకోచంగా అడుగు.

3. ఏమీ లేదు, మీ పెద్దభార్య, పెద్దక్క కన్పడటంలేదు. ఎక్కడకి వెళ్లిందేమిటి? ఉ. అదా సంగతి? పెద్దక్క సవతి యగు లక్ష్మీదేవితో పోరాడి, ఆ చింతపల్లిలోని దరిద్ర -నియోగి కరణాల ఇళ్లలో పాతుకుపోయిందయ్యా !

వి. కొందరు ఇతర తెగలవారిని ఎలా అన్యాపదేశంగా అడిపోసుకుంటారో తెలుస్తుంది.

41. మీరు. పొగ త్రాగుదురా? - వారిజభవ! వామదేవ! వైకుంఠహరీ!
ఓరీ నారద! వినురా! - రెండేడు జగంబులందు ఇది ముఖ్యమురా!

సం. పొగాకును అన్యాపదేశంగా, అధిక్షేపించుట

ప్ర. 1. హే బ్రహ్మన్! శివ! వైకుంఠవాసా! మీరుకూడా పొగ (పొగాకుచుట్ట---)ను త్రాగుతారా? ఉ. ఓరే నారదా!మేము చెప్పేది వినరా, ఆ పొగాకు ఈ ఒక్కలోకంలోనే కాదురా, పదునాల్గు లోకాలలోనూ ముఖ్యమైనదిరా.

వి. పొగాకు ముఖ్యమైనదని పైకి చెప్పినా, అన్యాపదేశంగా, అది అధిక్షేపించడమే దాని అంతరార్థం, పొగాకు ఉత్పత్తి వినియోగాల గురించిన ఇతర పద్యాల అంతరార్థం కూడ అధిక్షేపించడమే పరమార్థం.

2. రెండేడు = రెండు (ఏడు) లు రెండునకు ''రెండు'' రెండేసముగా రాగా, 2X7 = 14 లోకాలు

42. సీ గంగాధరుండు నీ మగండని సర్వంగ వేషధరుడు నీ పెన్మిటనియె,
ఎద్దునెక్కును నీడు నెమ్మికాడని నవ్వ గ్రద్దనెక్కును నీదు మగండటని యె
పల్లెవాడెల్లు నీ వల్లభుని కనంగ - నడి సంభ్రమిల్లు నీ నాథునని నె,
నాట్యంబు సేయు నీనాయకుండన - హంగు కావించు నీకాంతుడనియె

గీ. భిక్షువెక్కడికేగె నీ యిష్టుడనిన
బలి మఖంబున కేగెనో లలన! ధనియె,
ఇట్లు అన్యోన్య మర్మంబు లెంచుకొనెడి
పర్వతాంభోధి కన్యల ప్రస్తుతింతు ॥

సం. లక్ష్మీ పార్వతీ సంవాదరూపమైన ఈ విశిష్ట సంభాషణ పద్యం, తిరుపతి వేంకట కవుల బందరు శతావధానములో ఆశువుగా చెప్పబడింది.

లక్ష్మి ప్ర.1. పార్వతీ! నీభర్త కావడితో నీళ్ళు మోసేవాడే! (గంగను ధరించినవాడే!)
పార్వతి ప్రతివచనం - నీ భర్త నానావేషాలు వేసే నటుడు (అనేకావతారాలు ఎత్తినాడు)
2. నీ ప్రియుడు నంది (ముసలి ఎద్దు) నందినెక్కి తిరుగును. ఉ. నీభర్త గ్రద్ద (గరుత్మంతుడు)నెక్కి తిరగటం లేదా).
3. నీ ప్రియునికి స్మశానమే ఇల్లు ఉ. అవును, నీ నాథుని ఇల్లు నడి సముద్రములోనే కదా!
4. నీమగడు (తాండవ) నాట్యం చేస్తూ ఉంటాడు.! ఉ. అవును, నీ మగడో ప్రక్క- హాంగువాడుదు.
5. అడుక్కోటానికి నీ మగడు ఎక్కడికి వెళ్ళాడో? ఉ. ఓలలనా! మూడడుగుల స్థలం అడుక్కోవడం కోసం బలిచక్రవర్తి యజ్ఞభూమికి వెళ్లాడు. ఈ విధంగా పరస్పర మర్మాలను వేళాకోళంగా, ఎత్తిపొడుచుకొనుచున్న పర్వతనందిని, పాలకడలి కూతులగు ''పార్వతినీ లక్ష్మినీ'' ప్రశంసించుచున్నాను.
వి. మొత్తం మీద దేవ దేవతలకు కూడా తప్పలేదు. ఈ గృహ ఛిద్రాలు, ఎత్తిపోటులు!
కవులు ఒకర్ని మాత్రం విడిచిపెడతారా? వారు ? నిరంకుశులుకదా!

43. నాతి దూరము గుడివాడ? నా వెలంది
నాతి దూరము గుడివాడ నా వచించె! (ఆ.నా.)

సం. గుడివాడలో ''ఆంధ్రనలంద'' అను సాహిత్య, సాంస్కృతిక సంస్థను స్థాపించిన సవ్యసాచి, డా. అడుసుమల్లి నారాయణరావు ''నారాయణీయం'' లోని పద్యాలు.
ప్ర.1. ఓ నాతి! (ఓనారీ) గుడివాడ ఎక్కువ దూరంలో ఉన్నదా? అని ఒకరు ప్రశ్నింపగా
ఉ. అత్యంత దూరంగా లేదు. (న + అతి దూరము + అ) సుమా అని మరొకరి ఉత్తరం
వి. పద్యంలో ''నాతి దూరము'' అనే పదం రెండుసార్లు ఉపయుక్తం కావడం విశేషం.

44. సూర్యభగవాను పత్ని భార్య ఎవతె? నీతిలేని యుద్యోగి చింతించు నెద్ది?
బాట నెదిగోరి వృక్షముల్ నాటుచుంద్రు దాని ''ఛాయ'' యటన్న ఉత్తరము గాదె!

ప్ర.1. భాస్కరుని భార్య ఎవరు? 2. నీతి మాలిన గుమాస్తా దేనిని గురించి, ఆలోచిస్తాడు?
3. త్రోవ కిరుప్రక్కలా చెట్లనెందుకు నాటుతారు?
ఈ మూడు ప్రశ్నలకు ''చాయ'' ఒక్కటే ప్రత్యుత్తరముగుట ప్రముఖ విశేషం.
ఉ. ఛాయ = ఛాయాదేవి సూర్యుని భార్య.
2. నీతి లేని ఉద్యోగి చేయవలసిన పనిని ఎగగొట్టి, మా చాయగా ఎలా కాలంగడుపుదునా? డబ్బు సంపాదింతునా ? అని ఆలోచిస్తాడు.

3. రోడ్డుకిరుప్రక్కలా నీడ(ఛాయ) కొరకై వెళ్ళునాటువారు.

వి. ''నాతి దూరము'' పద్యభాగంలో భిన్న–పదవిభాగ– అర్థభేదాలతో, ఒకప్రశ్నకు ఒక్కటే సమాధానం కాగా, ఇక్కడ మూడు ప్రశ్నలకు మూడు ప్రత్యుత్తరాలు కాక, ఒకే ''ఛాయ'' అనునది ప్రత్యుత్తరముగా, ప్రత్యక్షమై, సమన్వితమగుట చమత్కార జనకము దీనివలన సాహిత్య, వైద్య రంగాలలో సవ్యసాచియైన డాక్టరు గారి ప్రతిభాపాండిత్య ప్రాభవములు కూడ ప్రత్యక్షములైనవి.

45. చరణములకడనే పాసంగడి మీకి 'సీ'
   వధువు పేరు తెల్పవలెనె? మహి'త'
   నయ యటంచ్రకు తెలియుతే'దెగ'॥

46. వరుని పేరేమని యెద 'తా' – సరస 'మ' యుక్తంబునైన 'స్వామి 'నుడీ
   పఠించి తెలిసికొండని – ధరణీ సుత వ్రీడతోడ తరుణులకనియెన్॥

సం. కీ.శే. పోకూరి కాశీ పత్యపథానిగారు గద్వాల ఆస్థాన మహాకవి పండితులు, నానావిధ చిత్రకవిత్వ రీతులను, చిందులు త్రొక్కించిన, అనేక గ్రంధ కర్తలు పై పద్యాలు వారివే.

కొంత కాలం క్రిందటి వరకు, కొన్ని సనాతన కుటుంబములలో, వివాహానంతరం, గడపదగ్గర వధూవరులు ఒకరిపేరొకరు చెప్పుకొనకున్న, ఇంటిలోనికి పోనియ్యరు. ఏదియో ఒకవిధముగా చెప్పకతప్పదు. శ్రీ కాశీపతిగారు సీతారాముల పేర్లు, చెప్పించిన తీరు, చారు చమత్కార చందన చర్చితము, అర్థంకావడం కొంచెం కష్టమైనా మన్నించి మననం చేయండి. వానిని పాఠక మహాశయులకు పరిచయం చేయకుండా ఉండలేనందుకు క్షమార్హులము.

పాదముల – చరణముల కడనే పడిగాపులు కాయు దాసదాసీజనులగు మీకు, ఇసీ! (ఛీ) నావధువు పేరు చెప్పాలా? మహిత–నయ= గొప్పనీతి వరులాలు, మహి– తనయ= భూ–పుత్రి యగు, నారాణి – భార్య పేరును తెలుసుకొనలేరా? సీతామాత్రం తెలివికూడ లేదా? అని పైకి అర్థమవుతుంది.

కానీ, దీనిలోని అంతరార్థమేమనగా– ఈపద్యం నాలుగు చరణాల చివరనున్న (చరణములకడనే పాసంగెడి) ''సీ, త గా, దె,''= 'సీత' గాదా అనగా ఆనాలుగు అక్షరాలను కలిపిన నాభార్య పేరు 'సీత' గా తెలుసుకొనలేరా? అని శ్రీరాముని ప్రత్యుత్తరము.

ఇక, సీత సమాధానం. వరుని పేరేమి! అని అడుగుతారా? ఛీ, ఈ సరసమేమీ బాగోలేదు. ఆయనను 'స్వామి' అంటారు. అలోచించి తెలుసుకోండి– అని సీత సిగ్గుతో చెప్పెను.

ఇక దీనిలోని అంతర్గూఢార్థ మేమనగా, 'తా' సరస (న) 'మ' యుక్తంబయిన 'స్వామి' 'రా' కు ప్రక్క (సరసన) 'మ' కారం కలిపి, పిమ్మట స్వామిని కలినిన ''రామస్వామి యగును'' గదా! ఆ ''రామస్వామి'' యే నా భర్త పేరు– అని సీత సిగ్గువిడిచి అన్యవిధంగా తెలియజెప్పినది.

47. సీ. ఎవరయా? మీరుచక్కని(?) రాజులిద్దరు?
   అర్క వంశ్యుల మయోధ్యాపురంబు,
   మీపేరు లెవరయా? ఓపుణ్యనిధులార!
   రాఘవుండతడు, నే లక్ష్మణుండ – – –

సం. ఇదొక రామాయణ సంవాద చాటువు. విస్తరభీతిచే పద్యాన్ని పూర్తిగా వ్రాయలేదు. ఇట్టివే, భారత, భాగవత- సంవాదములుకూడ చాలకలవు.

ఋష్య మూక పర్వత ప్రాంతమున, హనుమకు లక్ష్మణునికి జరిగిన సంవాదము.

హనుమంతుని ప్రశ్న 1. ఎవరుబాబూ ! మీరు చక్కగా, రాజలాంఛనాలతో ఉన్నారు?

లక్ష్మణుని ప్రత్యుత్తరము - మేము సూర్య వంశీయులము, అయోధ్యా పట్టణం మాది.

2. ఓపుణ్యపురుషులారా! మీ పేరులేవి? ఉ. అతడు శ్రీరామచంద్రుడు, నేను లక్ష్మణుడను.

48. అరరే అధ్వని ఏమిటో? ఉరుములో? అంబుధి పొంగెత్తెనో ।

మరి ఇంకొక్క మహా ప్రపంచ రణ సంరంభమా? సేనా పతీ!

భరతక్షోణిని పార్లమెంటున పభల్ ప్రారంభమై సభ్యులం

దరు నొక్కుమ్మడి నోండ్రపెట్టెదు నినాదంబిద్ది అంబోదరా!

సం. ఇది వినాయక కుమారస్వాముల హాస్య, వ్యంగ్య-అధిక్షేపణ సంవాదం. మిత్రులు డా. ఎమ్. నళినీ మోహన్‌గారి అంబోదరా! శతకం నుండి గ్రహింపబడినది. అధునిక ప్రపంచంలో, వృత్తసభలతో, సంభవించు సంఘటనాలకు ఇది సంక్షేపనిదర్శనము.

వినాయకుని ప్రశ్న 1.

ఏమి సైన్యాధిపతి! కుమారస్వామి! ఆహాహా ! ఏమిటీ గందరగోళం! ఆశ్చర్యంగా ఉన్నదే ? ఈ ప్రళయ మహోదగ్ర భయద నిస్వాన మెక్కడిది? మేఘగర్జనమా ? లేక సముద్రం ఉవ్వెత్తున ఉప్పొంగిన ఉప్పెన శబ్దమా ? అథవా, ప్రపంచమారణ హోమానికి నాంది ప్రస్తావన రూపమైన మహా యుద్ధసంరంభమా? ఇందులో ఏది? కుమారస్వామి ప్రత్యుత్తరం - అన్నా! నీవు చెప్పిన దేదీ కాదు. మన భారత దేశంలో, లోక సభ (పార్లమెంటు) లో ప్రధాన పక్షం ఏదో ఒక బిల్లును చర్చానన్, ప్రవేశపెడుతూ ఉంటే, ప్రతిపక్షసభ్యులందరూ ఏకధాటిగా దానినెదుర్కొనుటకు గట్టిగా అరుస్తూ బల్లలు గుద్దుతూ మైకులు విరుస్తూ, పోడియం దగ్గర పోరాడుతూ ( నినాదాలు చేస్తున్న నిష్ఠుర శబ్దమయ్యా ఇది - అనెను.

వి. ఆనాడే కాదు. ఈనాడు కూడా గౌరవనీయములైన పార్లమెంటు సభలలో, ప్రారబ్ధాలైన కర్మలు, పోట్లాటలు, పెడబొబ్బలు, బైటాయింపులు, చేతులెత్తి బయటకురా చూస్తాము అని వాకవుట్లు, మార్షల్సు వచ్చి , ఎత్తుకుని బయటకు కూలబడదోయటం -- ఇత్యాదిగా శాసన కర్తల రంకెలు, బండబూతుకూతలు, పూర్వం పత్రికలలో చదివేవారము. రేడియాలలో విన్నాము.కాని, నేడు రేడియోలలో వింటున్నాము. టి. వి. లలో దురదృష్టవశాత్తు, కన్నులార కాంచి విచారిస్తున్నాము. వీనిచే అత్యంతము అసంతృప్తుడయిన ఈ కవి కసిపట్టలేక, మద్దిగాడిదల వలె, ఏకంగా ఓండ్రపెట్టుచున్నారని అత్యంత బాధతోనే, వట్టలేక ప్రకటించుచున్నాడు. ఇక, ప్రాచీన చమత్కార బంధుర ఛందోవృత్తాల నాపి, గద్యానికి వస్తే అక్కడ కూడ చమత్కృతి మచ్చుదిబ్బలు, ఎత్తిపొడుపులు, మొ॥ ఎన్నో కన్పడతాయి. మచ్చుకు కొన్ని మన్నించండి.

''ఏ యావురా బావా'' అనే గద్యాన్ని కూడ పద్యంగా బంధించిన విధానాన్ని గమనించండి.

సం. ఒక బావ తన మరదితో ఎదుట నున్న ఆవులలో ఒకటి తెమ్మన్నాడట!.

49. బావమరదింగని ఆ-యావులలో నొకటి తెమ్మి యనగా నపుడే

యావని యడిగిన వాక్యము - గావలయున్ భాషలైదుగా నొక పదమునకున్.

పై ప్రశ్నవాక్యాన్ని 1 ఏ-2 ఆప్-3రా-4బా-5వా- అని విడదీస్తే అవి క్రమంగా 1 మహారాష్ట్ర 2హిందీ 3ఆంధ్ర 4కర్ణాటక, 5 తమిళ - భాషలైదింటిలోను సమాధానమౌతుంది. ఎట్లనగా -

1. 'ఏ' అనగా మహారాష్ట్ర భాషలో రమ్ము అను అర్థంతో ప్రత్యుత్తరమౌతుంది.
2. 'ఆప్'(= ఆవో=రమ్ము) అని హిందీ భాషలోని అర్థం.
3. 'రా'(=రమ్ము) అని ఆంధ్రబాషలోని అర్థం
4. 'బా' (=రమ్ము) అని కన్నడభాషలోని అర్థం.
5. 'వా' (=రమ్ము) అని తమిళభాషలో అర్థమువున్నది.

వి. ఇట్లు, 5 అక్షరాలుగల ఒక తెలుగువాక్యంలోని ఐదు అక్షరాలు విడివిడిగా, ఐదు భాషలలో, ఒకే అర్థాన్ని చెప్పుచూ, సామూహికంగా ప్రశ్నవాదంకం కావటం? చిత్రాలలో మహావిచిత్రం. కాదనగలమా!

## 50. ఊతునా?

రామలింగనికి భట్టుమూర్తికి ఎప్పుడూ షష్ఠాష్టకమే (విరోధమే) ఆవాదాల్లో కూడ ఏదో విధంగా రామలింగనిదే పైచేయిగా కన్పడుతోంది. పెద్దన 'నిరుపహతి' స్థలంబు ----పద్యంతో చెప్పినట్లు, పండితుల ఇండ్లలో ''తూగుటుయ్యాల'' లు కూడ ఆనాడు ఉండే విగాబోలు! ఒకనాడు ముక్కు తిమ్మన ఉయ్యాల (మంచం) లో ఊగుచుండగా, అనుకో కుండా అక్కడకు వచ్చిన రామలింగడు, హాస్యానికి తాతా ఊతునా (= ఉయ్యాలను ఊపుమంటావా?) అనగా, ద్వంద్వార్థాన్ని ఊహించని తిమ్మన కవి ఊయల ఊపుతానన్నాడని సరే అన్నాడట! వెంటనే వికటకవి తుపుక్కున ఆయనపై ఉమ్మివేశాడట! కోపగించిన తిమ్మన కాలిపాదుక నతనిపై విసరగా, ఆ దెబ్బకు రామలింగని పన్ను (దంతం) ఒకటి ఊడిపోగా అది కన్పడ కుండా దుప్పికొమ్ముతో చేయించిన పన్నును పెట్టుకొని, మరునాడు సభకు వెళ్లాడట. ఈ రహస్య మెవ్వరికీ తెలియదు. ఎలా గో రహస్యాన్ని రాబట్టిన భట్టుమూర్తి మాత్రం, తాత్కాలికంగా ఇచ్చిన "రవిగానని చో కవిగాంచునే గదా!" అనే సమస్యను పూరించుటకై "ఆరవి వీరభద్రుచరణాహతి డుల్లిన ......" పద్య పూరణకై ఉపయోగించి, రామలింగని రహస్యాన్ని గూఢంగా బట్టబయలు చేసికసి తీర్చుకున్నాడట. నాటి నుండి ఈ పద్యం భట్టుమూర్తి చాటువుగా ప్రసిద్ధమైనదంటారు.

వి. మొత్తం మీద ద్వ్యర్థకమైన "ఊతునా" అన్న పదం ప్రశ్నకాగా, ( ఉయ్యాల ఊపుమంటారా లేక మీ మీద ఉమ్మివేయుమంటారా అను రెండర్థాలతో ,పన్నూడ గొట్టించుకోవడం, సమస్యగా, పద్యానికెక్కి సాధింపబడుట ప్రత్యుత్తరమైనది కూడ.

## 51. నూరిప్పింతునా?

తర్కవ్యాకరణాది శాస్త్రపండితుడు, గొకర్ణపూడి సంస్థాన విద్వాంసుడు, ఆరాజుకు రుక్మవతీ పరిణయము నంకితమిచ్చిన కృతికర్త, రేకపలి సోమప్రకవి. తొంబది సంవత్సరములు జీవించాడు. అతడు తన మూడవ పెళ్లిని 60వ సంవత్సరంలో చేసుకున్నపుడు పెళ్ళికూతురుచే, ఆరాణిగారు, తమల పాకు చిలకల విప్పింపగా,పండ్లూడుటచే, నమలలేక బాధపడుటను చూచిన రాణీగారు, అయ్యా! నూరిప్పింమమంటారా?( ఆకు వక్కలను బాగా నలుగునట్లు నూరి ఇప్పింమమంటారా?) అని ప్రశ్నింపగా లౌకిక జ్ఞాన శూన్యుడగు, ఆకవి మిగతా పదహారురూపాయలు ఎవరిస్తారమ్మా? - అని వ్యాజంగా,

వాకొన్నాడట. ఈ చమత్కార సంవాదం చాటూక్తిని వ్యక్తీకరిస్తున్నా, అలౌకికత్వంతో, చాదస్తంతో అడుగునపడిపోయినది.

వి.1 ఈ కవి లోకజ్ఞానం లేని వైదిక కవి. కనుకనే, గడుసరితనం , లౌకికం సాహసం గల సూరకవిని ఎదుర్కొవడం అతనికి కష్టమైనది

2 పూర్వం కవిపండితులకు నూటపదార్లు దక్షిణగా, పారితోషికంగా ఇచ్చేవారు. నూరి + ఇప్పింతునా = నూరిప్పింతునా = ఆకు వక్కలను చిన్నరోట్లో మెత్తగా నూరి, నములుటకు వీలుగా ఇప్పింతునా? అను - అర్థంలో వాడిన రాణీగారి భణితిని, ఈ వీర విద్వత్ కవి నూరు+ ఇప్పింతునా(= నూరు రూపాయలు ఇప్పింతునా) అన్నట్లు వ్యాజంగా గ్రహించి, అమ్మా, మిగిలిన పదహారు ఎవరిస్తారు అనెనట! అందుచే, వాక్యం వ్యాజోక్తి అను అలంకారానికి కూడా దార్కాణమైనది.

## 52. తటాకోత్తర భూమి

వెలుగోటి కుమార యాచమనాయుడు గారు గొప్పదాత విద్వాంసుడు. ఒకనాడు తన ఆస్థాన పండితులనోడించిన, మరొక పండితునిపై దయయుంచి, కొంత 'తటాకోత్తర భూమి'ని పసదనంగా దానపత్రం వ్రాసి ఇచ్చారట. దాన్ని ఆ గ్రామ కరణానికి చూపి, భూమిని పరిశీలింపగా, అది చౌటపర్ర గా కన్పడినదట! అప్పుడు తటాకం (చెఱువు) దక్షిణభూమిని పరిశీలించి, అది సుక్షేత్రమని, కరణాన్ని తొంగదీసుకుని దానిలో కొంతకాలంగా పండించుకొనుచున్న రైతులను తొలగింపబోయెను.

వారెదురుతిరిగి రాజాగారికి విన్నవించుకొనగా, రాజు పండితుని పిలిపించి ప్రశ్నింపగా, అయ్యా! మీరు దానం చేసినది తటాకోత్తర భూమి గదా! అనగా తటాకము ఉత్తరమునందుగల భూమి, అనగా చెఱువు ఉత్తరంగా ఉంటే, దానికి ఎదురుగా నున్నది దక్షిణం భూమి - అనిగదా దాని అర్థము - అని ఆ కవి తన పాండిత్య ప్రసర్లనుప్రకటించి వివరించాడట. దానితో రాజుగారు అతని వ్యాకరణ శాస్త్ర పాండిత్యానికి మెచ్చి, పస్తుతః తానునూ పండితుడు గనుక, అయితే బహువ్రీహి = బహువ్రీహి సమాసం లేక బహుధాన్యాలు పండేభూమిని చేశారా? అని చమత్కరింపగా ఆ కవి అయ్యా! మీ దానం బహువ్రీహి కాకుండా, అల్పవ్రీహి ( తక్కువ పంట పండునది) ఎలా అవుతుందని చమత్కరించాడట.

వి. ఆనాటి పండితుల మాటలు, వాక్యాలు అంతచమత్కార చాతురీ ధురీణాలుగా ఉంటేవట! అందుచే అందరూ విరగబడి నవ్వుకొన్నారట.

3 . తటాకోత్తర భూమి అనగా, తటాకస్య ఉత్తర భూమిః- అని తత్పురుష సమాసంగా గ్రహిస్తే , చెఱువుకు ఉత్తర దిశగా నున్న చౌటి భూమి అనే అర్థమే లభిస్తుంది. అలా కాక - తటాకః ఉత్తరే యస్య భూమేః అని బహువ్రీహి సమాసంగా చెప్పుకుంటే, ఉత్తరంగా నున్న, చెఱువును ఆనుకునియున్న దక్షిణభూమి- అనే అర్థం వ్యక్తమవుతుంది.

4 . ఇదంతా, బహువ్రీహి సమాస ప్రభావంవల్ల వచ్చిన అర్థం. ఇతర భాషలలో దుర్లభ్యమైన ఈ బహువ్రీహి సమాసం, సంస్కృతంలో సాంస్కృతికమై సర్వులకు సాజాత్యం ( సద్భాశం) గా కన్పడుతున్నా, సాచివ్యం ( మంత్రిత్వం) చేసి, సాధువాదాన్ని (మెచ్చుకోలును) కూడ సాధించుకొన్నది.

5 . ఇది ప్రతాపరుద్రకాల సంబద్ధమైనది - అని కతిపయ పండితుల కథనం

శ్రీ మంగళేశ్వరశాస్త్రిగారి మాణిక్య వక్రోక్తులు విశాఖ- పార్వతీపురం తాలూకా బొబ్బిలి సమీపంలో నున్న 'నాగూరు' గ్రామం నడిమింటి మంగళేశ్వరశాస్త్రిగారి అభిజనం. ఉద్దండ వ్యాకరణ పండితుడీతడు. సంస్కృత భాషా పరిచయం కోరువారికి సమాసాలను సులభంగా బోధించు సమాసకుసుమావళి వ్రాసారు. గ్రంథం లఘువుదైనా చదివిన వారికి, అది అలఘు - ఆనందాన్ని కల్గిస్తుంది. వీరి సంవాదాలు, చమత్కోక్తులు, దేశం నలుమూలలా ప్రచారం పొంది యుండేవి. అట్టి వానిని, వెలికి తీసి ప్రకటించిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి కృతజ్ఞతతో, కొన్నింటినయినా పరిశీలించక, పరధ్యానంతో వదిలివేస్తే, ఋషి ఋణాన్ని తీర్చుకోలేము.

## 53. ఊరిస్తారు.

''బొబ్బిలి సంస్థానోద్యోగి ఒకరు శాస్త్రిగారితో, రాజుగారు మీకు ఊరిస్తా''మన్నారు. ( =ఊరిస్తాము అనగా ఒక గ్రామాన్ని, అగ్రహారంగా దానంగా ఇస్తామని చెప్పినారు. ) అని చెప్పగా, రాజా వారు ఎప్పుడూ ఊరిస్తూనే ( నోరు ఊరునట్లుగా చేస్తూనే) ఉంటారు. అనగా నోరు ఊరునట్లు తీయని మాటలు చెబుతూనే ఉంటారుగాని, ఊరును ( గ్రామాన్ని) అగ్రహారంగా ఇవ్వడం మాత్రం జరుగదని భావం.

## 54. నిర్వాహకుడే

శాస్త్రిగారి కొడుకు గోపాలశాస్త్రి అందరినీ వెక్కిరిస్తూ ఉండేవాడట! సమయం కోసం పరిభూతులందరూ వేచి ఉండేవారట. ఒకనాడు దురదృష్టవశాత్తు, శాస్త్రిగారు జీవించి యుండగానే, కొడుకు కాల కబళీ బతుడయినాడట! ( చచ్చినాడట) ఇదే అదను అనుకొని ఊళ్ళోవాళ్లెవ్వరూ శవాన్ని మోయుటకు దరిదాపులకే రాలేదట. అప్పుడు శ్రీ శాస్త్రిగారు నీకొడుకు బ్రతికీ నిర్వాహకుడే, చచ్చీ నిర్వాహకుడే అని, ఆ కష్ట సమయంలో కూడా చమత్కరించారట. 1. నిర్వాహకుడనగా బ్రతికినపుడు ఏపనినీ సరిగా నిర్వహింపలేనివాడు. లేక కార్యమును నిర్వహించువాడనియూ అర్థాలున్నవి.

2. శవం మోయుటకు కూడా మనుష్యులు దొరకనివాడు- అని అభిక్షేపణోక్తి.

వి.1 కొందరీ కథను విశ్వగుణాదర్శకర్త అగు వెంకటాచార్యునికి సంబంధించినది - గా చెప్తుతారు.

2. ఏమైనా దీనిలో వెటకారం (హేళన,'' వెక్కిరిస్తూ ''వెగ్గలం ( ఎక్కువ) గా వెల్వడటం గమనార్హం.

## 55. నా కుమారునికి పెళ్ళి నాకుపనయనం.

ఒకసారి శాస్త్రిగారు గజపతిరాజుగారింటికి వెళ్లగా, ఏమి పనిమీద దయచేసారు. అని రాజు ప్రశ్నింప, నాకుమారునికి పెళ్లి, నాకు ఉపనయనం కావాలన్నారట. సభాపండితులకు కూడా, ఆప్రశ్న దానికి సమాధానం సరిగా అర్థం కాలేదట. రాజుగారు ''రేపురండి '' అని శాస్త్రిగారిని పంపించి. సభాస్తారులను ప్రశ్నింపగా, వారు శాస్త్రిగారికి మది మది ( తి) తప్పిందని కొందరు, భార్యావియోగ దుఃఖంతో తొట్రుపాటుతో తికమకగా, తప్పుగా చెప్పారని, మరికొందరు చెప్పారట!.

శాస్త్రిగారు తొట్రుపడతారా? అని రాత్రికి రాజుగారు ఆలోచించి మరునాడు సభకు పట్టుబట్టలు కప్పిన పళ్ళాలు రెండు తెప్పించి ''ఇది మీ కుమారునకు ఇది మీకు ''అని ఇప్పించారట.తెరిచి చూస్తే, ఒకదానిలో వివాహ సంబద్ధ - వెరడి బంగారు వస్తువులు, రెండవ దానిలో రకరకాల కళ్లజోళ్లు చూచి సభ్యులంతా సంభ్రమాశ్చర్యాలతో మునిగిపోయారట.

వి. పండితులకు అర్థంకాని విషయాలు కూడ ప్రభువులకు అర్థంకావడంలోని విశేషాలను గమనించి, పండితులందరూ ప్రభువుల పాండిత్య ప్రకర్షను పరిపరి విధాల ప్రస్తుతించారట.

## 56. కాము – కాము – కాము

పెండ్లి యైన పిదప, పెండ్లి కూతురుపేరు చెప్పుమని శాస్త్రిగారి కుమారుని కొందరు స్త్రీలు ద్వారం వద్ద నిర్బంధించారట. శాస్త్రిగారి కొడుకు ''మేము చెప్పవలసిన వారం కాము'' అనగా, మహిళలు ఒప్పుకోలేదు. ఇంతలో శాస్త్రిగారు అదే మళ్ళా, ముమ్మారు చెప్పరా! అనగా, కొడుకు కేవలం. పండిత పుత్రుడు కాదు, పాండిత్యం సంపాదించిన వాడు కావటంతో, ధర్మరాజు సందిగ్ధావస్థలో ''అశ్వత్థామా హత: (బిగ్గరగా) కుంజర: (నిదానంగా)'' అన్న దానికి విరుద్ధంగా, మరల మేము చెప్పవలసినవారము (నిదానంగా) కాము, కాము, కాము (బిగ్గరగా) చెప్పగా అందరూ ఆశ్చర్య నిమగ్నులై అట్లాగే ఉండి పోయారట! అంత శాస్త్రిగారు– పెండ్లి కూతురు పేరు కామాక్షి కదా? అని గుర్తుకు తెస్తే, శాస్త్రిగారి చాతుర్యానికి, చమత్కారానుకి వారందరు ముగ్ధులై లోనికి పోనిచ్చారట.

వి. ఇలాంటి వారి చమత్కార చందన చర్చ లెన్నో ఉన్నా విస్తరభీతిచే విడుస్తున్నా, చివరకి చెళ్లపిళ్ళ వారి చమత్కారాన్ని కూడా పరిశీలించుడని మనవి.

## 57. ధపమధ్యకాంక్షనై

ఒకప్పుడు, చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారొక రాజు గారి సభకు వెళ్లగా, రాజావారు, ఏమి పని మీద, దయ చేసినారని ప్రశ్నింప, ''ధపమధ్యకాంక్షినై'' వచ్చానన్నారట. ఆ వాక్యానికి అర్థం సభాస్తారులందరికి వచ్చినా అర్థంకాలేదట! పండితులను ప్రశ్నిస్తే, ''పరమ మౌనం'' పాటించారట!

అంతట ప్రభువులే పాండిత్యాన్నొక పట్టు పట్టి, ముందుగా, తప వర్గల ను తలపుకు తెచ్చుకొని (తథ) 'ధద' ప (ఫబభమ) గా, విడదీసుకొని, మరల వానిలో దమలకు ద (ధన) లను విడదీసికొని వాని మధ్యలో నున్న వానిని 'ధన' గా గుర్తించి శాస్త్రి గారు, ధన ''కాంక్షియై'' వచ్చారని ఆధనాన్ని ఇచ్చి, సగౌరవంగా వీడ్కోలిచ్చారట.

గమనిక : పండిత ప్రకాండులకే అర్థంకాని విషయమును గ్రహింపగలపోషకప్రభువులు కొందరు, తమ పాండిత్యంతో పర్యవేక్షించి, ప్రత్యాదిష్టం చేసి (త్రోసివేసి) పరిశీలించెడి వారుకూడా కొందరానాడు ఉండేవారు. నాగరికత నాణెంగా, నానా విధాల నాట్యమాడుచున్న నేటి పరిస్థితుల వ్యగ్యులు (''వెదకదగినవారు'') కావడంతో, మన – ము దము (సంతోషము) అంతా మునిముచ్చు – (పశ్యతో హరు: (చూచుచుండగానే, కళ్లల్లోకారం కొట్టకుండానే) మోసగించి, దొంగిలించు దొంగ) ల చేతుల్లో పడి నాశనం కావడం ఎంతో బాధాకర విషయం.

'' ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేగదా!?'' అన్న విజయ విలాసకర్త (చేమకూర వేంకట కవి) విలాసాల సామంజస్యాన్ని కూడా ఒక సారి సమీక్షించండి.

58 మ. 1. విహరించున్ శ్రీ మలయుచిలంచిచట, 2 దావిం జిల్కి నేమ్యేనియా,
విహరించున్, 3. పికినాదముల్ చెవికి గావించున్ జపుల్, 4. పోదమా

సహకారాళి పదంబు మూడగ వయస్యా 'హోళి' వాటిల్లెడాన్,

5. సహకారాళి పదంబు మూడగ వయస్యా ! 'హోళి' యౌనేగదా!

వి. 2 – 53 సం॥ కు బేరుని ప్రేయసి 'నంద' అను అప్సరస, తన నలుగురు చెలులతో లోకాలన్ని తిరిగి వస్తూ, ఒక అందమైన అడవిలో దిగినప్పుడు ఆ అయిదుగురు చెలులతో, ఆనందంతో ఆడుకొన్న చతురోక్తుల సంవాదాలు.

1వ చెలికత్తె : మలయ + అనిలంబు – ఇచట – విహరించున్ = ఓచెలీ ! మలయ మారుతము – ఈయడవిలో – వీచుచున్నది సుమా! అనగా,

రెండవ చెలి : 2. తావిన్ – చిల్కి –నేట (తీ) మేని – ఆవిన్ – హరించున్ = ( ఔను, నిజమే!) (ఆగాలి) తీయని వాసనను – వెదజల్లి, చక్కని శరీరమునందలి వేడిని – పోగొట్టుచున్నది. దీనికి ద్వితీయార్థము. నీవు – 'విహరిస్తుంది' అని మాత్రమే చెప్పినావు . ఆ విహరించున్‌లోని 'వి' న్ – చిల్కి = 'వి' అనే అక్షరాన్ని చ్యుతం చేస్తే, 'హరించున్' మాత్రమే మిగిలి, వేడిని వెడలగొడుతుందను. చమత్కారార్థాన్ని కూడ తెల్పుతుంది సుమా! అని రెండవదాని హెచ్చరిక.

3. పికనాదముల్ – చెవికిన్ – చవుల్ – కావించున్ = ( ఆడు ) కోకిలల అవ్యక్త ధ్వనులు - చెవులకు – రుచులను – కల్పించుచున్నవి, లేక – చెవికిగాన్ – చవుల్ – వించున్ = చెవి కోసమై మంచి రుచిగల్గిన పాటలను – వినిపించుచున్నవి. అనియు చెప్పవచ్చును. అంతేకాక , నా – దముల్ – కాన్ = 'నా' అనే అక్షరాన్ని 'దత్తము' చేసుకున్నవి, కాగా, వించున్ = వినునట్లు చేయుచున్నవి. అనగా '(కా) వించున్ ' అన్న పదమధ్య మందున్న 'న' (న్) కారాన్ని దత్తం చేసుకున్నచో, 'విన్చు – వినుచు' కాగలదన్న చమత్కృతి కూడ దానిలో చర్చితమైనట్లుండును.

4. వయస్యా – సహకార + ఆళి పదంబున్ – చూడగన్ – 'హోళి' – పాటిల్లెడున్ – పోదమా = చెలీ – ఆ తియ్య మామిడి చెట్ల – వరుసలున్న స్థలమును, – చూచుటకు – ఆసక్తి కల్గుచున్నది. (కనుక, అక్కడికి) వెళ్లుదమా? అని నాల్గవదిచెప్పగా–

5. వయస్యా ! స 'హ' కార – ఆళి – పదంబున్ – చూడగన్ – 'హోళి' – ఔనే – కదా! = చెలీ! – 'హ' కారంతో ' ఆళి' అన్న పదాన్ని చేర్చి.సంధించి, చూచినచో, 'హోళి' అన్న పదం సహజంగానే తయారౌతోందికదా! 'హ ఆళి' లేక 'హ + ఆళి' = (అనే పదాలకు సంధి) 'హోళి' అనేపదం సిద్ధిస్తోంది గదా! అనే చమత్కారంకూడ దానిలో చెంగలిస్తోంది.

లేక, సహకార – ఆళి – పదంబు = ఒండొరుల మేలుకోరి, సహకరించుకొను చెలికత్తెలుండు స్థానమును, చూచినంతనే, సంతోషం కలుగ గలదని కూడ, అర్థాంతరం ప్రతీయమానమగుచున్నది. లేక, 'సహకార + ఆళి – పదంబు – చూడగన్ = తీయని మామిడి చెట్లపై చెన్నారు – తుమ్మెదలు వ్రాలిన అడుగులు, లేక భ్రమరముల ఝుంకారములు వినగానే, సంతోషం (హోళి) కల్గుచుండును గదా! అనియు ప్రతీతమగును

ఇట్లు – అనురణన ధ్వనిగా, ఘంటారావంలో మాదిరిగా, రానురాను ధ్వనులనేకములు ఉద్భవంపగలవు. వానినన్నిటిని 'కలగూరగంప' తో నెత్తికెత్తి, పాఠకులపై భారం మోపుట కిష్టపడనందుకు మన్నింప ప్రార్థితులు. వి.

ఇక్కడ, వాచ్యంగా చెప్పబడకున్నా, దీనిలో చ్యుత, దత్త, ఆది చిత్రాలెన్నో చమత్కారాన్ని చిందించేవి, అందించేవి, ఎన్నో ఉన్నాయి. ఎన్ని అని వ్రాయగలము? మాకు మాత్రం ఎంతతెలుసు? కనుక ప్రస్తుతానికి ఇంతటితో విరమిస్తున్నామని మనవి.

**59.**సీ ఉరుము మెరుములతో, నుర్వి గురియున దేది? బంగారుతో జేయబడున దేది?
సన్యాసి కింకొక్క సరియైన పేరేది? శ్రీయర్థమిచ్చు పర్యాయమేది?
సుగ్రీవు సతి పేరు చూడనయ్యది యేది? మతితప్పువమ్మగు మాట యేది?
నక్షత్ర కోటిగన్పడు స్థానమదియేది? 'చదువు' దీనికి మారుశబ్దమేది?
తే రెండు ప్రశ్నంబుల జవాబులుండవలయు -
ప్రతి జవాబులో నంత్యాక్షరంబు దాసి -
పై జవాబులో నాద్యమై పరగవలయు
దేవ! శ్రీ వేంకటేశ! పద్మావతీశ! బై సు.

పై పద్యంలో 10 ప్రశ్నలున్నాయి వాని జవాబులు రెండక్షరాలలో ఉండాలి. మరొక విశేష మేమిటంటే, ప్రతిజవాబులోని ఆది - అక్షరం చ్యుతం (తీసివేయడం, తొలగించడం) కాగా, మిగిలిన రెండవ - అంత్య (చివరి) అక్షరం, తర్వాత వచ్చే మరొక జవాబునకు, ఆది (మొదటి) అక్షరమై ఉండాలి. మరల, దానికి మరొక అక్షరం 'దత్తం' చేయవలెనను నియమం కూడ సక్రమంగా పాటించాలి

పద్యంలోని 2వ ప్రశ్న నుండి వచ్చు ప్రత్యుత్తరాలు మన మెదడుకు మేత నందించి, కష్టపెట్టకుండా, ఆ వివరాలను ముందుగానే వెల్లడిస్తున్నాము. ఇకవానిని సమన్వయించుకోవడమే పాఠకులపని.

జవాబులు : 1. వాన, 2. నగ, 3. గద, 4 దయ, 5. యతి, 6. తిరు, 7. రుమ, 8 మది, 9. దివి, **10**. విద్య.

గమనిక : దీనిలో గమనింపదగిన మరొకచిత్రమేమనగా, పై 1---10 ప్రత్యుత్తరాలలో '1వ' ప్రత్యుత్తరములోని 'వాన' కు, ఆదిలోనుండు 'వా' ను, చివరి 10వ ప్రత్యుత్తరమగు 'విద్య' నుండి అంత్యాక్షరమగు 'ద్య' ను, ఈ రెంటిని తీసి (చ్యుతం), వేసి, మరల మిగిలిన అక్షరాలను రెండు రెండూ కలిపి, విడదీసి చదివిన, **1**. నన, 2 గగ, 3. దద, 4. యయ, 5. తితి, 6. రురు, 7. మమ, 8. దిది, 9. వివి, అను ఒకే అక్షరాల జంటలు, **చక్కని శిల్పముగా నేర్పడి, దానినుండి, 'గగ', 'దద', 'మమ'** అను

**సంగీత స్వరాలే కాక,** తి = తిరుమల, తి = తిరుపతి - క్షేత్రాలు మొ, విశేషాంతరాలు కూడ నేర్పడి, పాఠకమహాశయులకు చిత్రకవితా విశేష మాధుర్యాల నధికంగా నందింపగలవని మనవి.

పౌన : పున్యముగ చెప్పుకోదగిన విశేషాంతరమేమనిన, శ్రీ బైరెడ్డి సుబ్రహ్మణ్య కవీంద్రుల ఈ పద్యం కొన్ని సంవత్సరాల క్రింద, తిరుమల - తిరుపతి - దేవస్థానంవారి ''సప్తగిరి'' పత్రికలో ప్రకటింపబడి, ప్రత్యుత్తరముల నర్థింప, ఒకరిద్దరు కాదు, 7,8 వందల పాఠకులు సకాలంలో, సరియైన 10 ప్రత్యుత్తరాలను పంపగా, వానిని పరిశీలించి, సంపాదకమహాశయులు కూడ, వారందరికి పారి తోషికములను ప్రదానం చేసి, ప్రోత్సహించటం, సన్మానించటం మొమద్యమాన విషయం

గమనిక : మొత్తం మీద - 'చావలేదు - చావలేదు, ఆంధ్రుల చిత్ర కావ్య ప్రతిభ, మేలు కొని రండి, తెలిసి, చిత్ర విజ్ఞాన వీధి కెగయ' - అని అభ్యర్థించడం అతిశయోక్తి గాని అత్యాశ గాని కాజాలదేమో।

## ౬౦ వెలది! నీ దండ వెల ఎంత?

కృష్ణదేవరాయల కాలంలో పుష్పలావికలు కూడ, పురుషుల కంటే ముందే సంవాదంలో సందడించేవారట!

1 ' వెంది! నీదండ వెల ఎంత?' అని అడిగితే -

''నా దండకు వెలబెట్ట నెవ్వని తరంబు''? - అని శ్లిష్టంగా ఉండేదట వారిసమాధానం।

'దండ' కు 'పూలమాల' అనేకాక, కైదండ, బాహుబలం, చోటు, శయ్య --- ఇత్యాది

నానార్థాలతో నాణెంగా ప్రత్యుత్తరించేవారటం రాయలనాటి పూలభామలు

**61. ' తమ్ములంజూపవే'**

2. ''తమ్మ్మల జానవే ? తరుణీ శిరోమణీ!'' అంటే,,

' ఆడగాజనిరి రెపాడిరమ్ము' అని చమత్కరించేవారట!

తమ్మి + లు = తమ్ములు = తామరపువ్వులను కాక, సోదరులను కూడ గ్రహించి, రేపాడి (వేకువ) రమ్మనేవారట!

ఇట్లా చమత్కారచందనం వంటి పుష్ప గంధాలతో, ఆ నాటి పుష్పలావికలు పూలబాటలన్ని గుబాళింప జేస్తూ ఉండేవారట!

**62. ''కా పల్లీ ? తేవర్ణ : కో పితువద''**

ఒకప్పుడు 'అబ్రాహ్మణు' డనే కక్షతో, రుద్రకవికి ఆస్థాన ప్రవేశం దొరకనందున, కొండోజీ సహాయంతో, ఆస్థానంలో ప్రవేశించి ''మంగలి కొండోజీమేలు మంత్రుల కన్నన్'' అన్నాడట! అప్పుడు కోపంతో క్రుంగిన తాతాచార్యుల వారు ''కాపల్లీ ? తేవర్ణః కోపితు వద '' ( ఏ ఊరు ? నీకుల మేదో చెప్పు) ఇత్యాదిగా ప్రశ్నిస్తే, ''--- సత్కవులలోన తాతయాచార్య ! యేన, రూఢి కెక్కిన కందుకూర్ రుద్రకవిని'' అని ప్రగల్భించాడట! ఆనాడు బ్రాహ్మణేతర కవులంటే కొందరు బాపన్నలు 'బాపురే'! అంటూ, బావురుమనే వారట! 'అం ఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు'' అని కూడ అన్నాడట! అప్పన్న కవి కవిత్వానికి, భాషలకు కూడ, ఏవో భావాలనంట గట్టి, ఈసడించటం ఆనాటి కొద్ది పాటి వారి మాటే గాని, అందరిది కాదని భావించాలి.

వ్యవహారిక భాషలో కూడా సందడించే సంవాదాలు కొన్ని సందర్శనమిస్తాయి.

63 నల్లనిదేంది? బేరి! మృగనాభిరా గొల్లడ! దాన్ని తిందురా?
అల్లటుగారు స్త్రీలు చనులందున బూతురు, పూసినంతనే
జల్లున చేపునచ్చి, తెగి జారున?, కాదు, సుగంధమబ్బు, మా
మా పిల్లకు కాస్త - పెట్టు మన బేరియు గస్తురి మూసెనుగ్రక్కునన్ ॥

సం. ఇది కోమటికి గొల్లవానికి జరిగిన వ్యవహారిక భాషా సంవాదం.

ప్రశ్న 1 కొట్లో వున్న నల్లని పదార్థాన్ని చూచి, అదేమిటి? అన్నాడట - ఒక గొల్లవాడా!

రా ! గొల్లవాడా: అది కస్తూరి (మృగ నాభి) రా!

2. దాన్నేమైనా తింటారా? ఉ.హూ, కాదు, చన్నులపై పూస్తారు.

పూయంగానే, జల్లున చేకూర్చి పాలు కాస్త కారిపోతాయా? 3 కాదు. మంచి వాసన వస్తుంది. అయితే, మాపిల్ల కూడా పూసుకుంటుంది., కాస్త పెట్టవయ్యా - అనగా ఆ వ్యాపారి మూత పెట్టినాడట! వి 1. వ్యావహారికంలో ఉన్న ఈ సంవాదం హాస్యాన్ని లాస్యం చేయిస్తూ, సంతోషాన్ని సంబాళింప జేస్తోంది. 2. నేటి '' ''గణతంత్రరాజ్యం'' లో కులం పేరు పెట్టి పిలవడం సహ్యం కాకపోయిన , ఈ సంవాదం, ఏనాటిదో కావడం వలన సహ్యమైనది కావచ్చు.

64 క. నగపగతు పగతు పగతుని

పగతుండు మగధ రాజు బరిమార్చిన , యా
జగజెట్టి యన్న తండ్రికి
తగునాహానమైన యట్టి ధన్యుండితడే !

సం తన ఇంటికి వచ్చిన పెద్ద మనిషి ఎవ రని ప్రశ్నించిన కూతురికి ఆమె తల్లి వానిని పరిచయం చేయుట నగసగతుడు = పర్వత విరోధి ''ఇంద్రుడు'' అతని సుతుడు నరకాసురుడు అతని సుతుడు - కృష్ణుడు వాని విరోధి - ''జరాసంధుడు'' (మగధరాజు) అతని పరిమార్చిన (చంపిన) జగజెట్టి - ''భీముడు'', వాని అన్న ధర్మరాజు, వాని తండ్రి యముడు, అట్టి వానికి వాహనమైనది 'దున్న'! అట్టి ధన్యుడు - దున్నపోతు (లాక్షణికార్థం) ఇతడే = ఎదురుగానున్న మూర్ఖుడు, ఈ పెకురు (నుండి) దున్నపోతే సుమా! సి 1. పాతురు సిటుడెవరు అని ప్రశ్నించుట అసంభావ్యము కాగా, ఈ ''నెంజాణ ఇంత నచ్చిగా వర్ణించిన'', మూర్ఖుడు ''విద్యలేని వింత పశువు'' కాబట్టి సమగ్రార్థం అందలేదు కాబట్టి సరిపోతుంది. ఆనాటి వేశ్యలలో అంత తెలివి గల నెరజాణ లుండెడివారు అన్న మాట కూడా ఉన్నమాటే.'ఒక్కప్పుడు కొన్ని పద్యాలు ''అశ్లీల భాసాలు''గ పైకి కన్పడతాయి.

65. ఉ ఊరువులంటరాదిగిచి, ఉన్న తమైన కుచద్వయంబు పై
చీర చెరంగు తీసి సతి జేరి, చనుంగవబిగ్గబట్టి, తా
గోరిన కోర్కె దీర్చుకొనె, కొమలి బొందక యున్న మాత్రనే
సారముదెల్పుమీ సురత సౌఖ్యమెరింగిన వాడవైనచో?

గమనిక : దీని, ప్రతిపద్యపాదంలోని పదాలు ''రేప్'' చేసినట్లు, వచ్చే అశ్లీలార్థాన్ని చదవంగానే వెగటును పుట్టిస్తాయి. నిజమే, కాని అంత తొందరపడితే ఎలా? నిదానంగా ఆలోచిస్తేగాని, అసలు అంతరార్థం బైటపడి, అశ్లీలం ఆమడ దూరం పోదు. ఇక పద్యం చదవంగానే వచ్చేభావం, ఒక కాముకుడు ఒక దాని తొడలు పట్టి , దా ఎత్తైన చనుగట్లపైనున్న చీరను లాగి, ఆడుదాని (సతి - పెంటి) ప్రక్క- జేరి, రెండు చనులను గట్టిగా లాగిపట్టి తన కోరికను బలవంతగా తీర్చుకొనెనట

ఇక్కడ దానిని( ఆమెను) పొందకపోయినంత మాత్రాన వచ్చిన నష్టమేమున్నది? నీవే గనుక నిజంగా సంభోగ సౌఖ్యం తెలిసిన రసికుడవైనచో ఆ పద్యంలోని అంతరార్థాన్ని , రహస్యాన్ని తెల్పుమని ఒక మహాప్రశ్న ఉ. ఒక గొల్లవాడు గొర్రెపాలు పితుకుట దీనిలోని గూడార్థం, ఎట్లు? ఆ రహస్యచ్ఛేదనం జరిగే వరకు వ్యాఖ్యాత వ్యాఖ్యాతలపై సిగ్గు లేక బూతులు కూడా వ్రాస్తున్నా రని గ్రహించకండి. వ్యాఖ్యాతకు అన్ని అర్థాలు,రహస్యాలు కూడా రట్టు చేయవలసిన బాధ్యత ఉన్నది కదా! అసలైన అర్థం. గొర్రెల పాలు పితుకుటకు ముందు, పెంటిగొర్రెను పట్టి, కాళ్ళు గట్టిగా లాగి, తన తొడల సందున బిగింప, ఆ తల్లి గొర్రె తన పిల్లను చూడగానే చేపు చే, ఉబ్బిన దాని చన్నుల జంట పైనున్న ''ఉప్పుపాత గుడ్డ'' (చీర చెరంగు) లను తీసి స్తనములను గట్టిగా , పట్టి పిండి తనకు కావలసినన్ని పాలు తీసుకొనెని అసలైన అర్థం. ని. గొర్రె పిల్లలు ఎప్పుడు పడితే అప్పుడు పాలు త్రాగకుండుటకై, ఉప్పులో నాంచిన చిన్న గుడ్డలను పెంటి గొర్రె చన్నులకు అతికిస్తారు. అందుచే నాసనకు రుచికి భయపడి గొర్రె పిల్లలు పాలు త్రాగుటకు ముందుకు రావు 2. ఇట్లు అశ్లీలాభాసప్రశ్నకు అసలు అర్థం తెలుసుకొని సమాధానం చెప్పి, అశ్లీలాన్ని తొలగించుకొని ఆనందించాలి

66. సి ''అగుదాన'' మంటరో రబ్బరో! యిద్దరు -సిన బాపనయ్యలు చేస్తరంట!
అది కాదసీ, యెవ్వరడిగిన కాని క- విత్తంబు సెప్పి మెప్పింతురంట!
కాట్రేడి కత కాడ కైత గాండ్లందరు - సిల్లి గవ్వకునైన సెల్లిరారు
యేమి లేకుండినను బెద్దలెల్ల యిట్లు-కనుగొనగ వత్తురా? య్యైనను మననముగాడా తాశి

మూస్తమటంచవధానసభకు-పామరులు మాటలాడుచు వచ్చుచుండ్రు రా శే., వే. శె అవధాన .

సం అవధానం చూడజయలు దేరిన పల్లెటూరి వారి గ్రామ్య సంభాషణ 1 ప్ర. ఒకడు- ఓరబ్బాయి! ఇద్దరు బాపన బాలురు అవధానం చేస్తారంటరా! దానికిమరికని ఉత్తరం-అవధానం అంటే ఒకవిధమైన సుద్దులా? ఏంటిరా? (చెప్పు) 2.అలా కాదు రా! ఎవ్వరేమడిగినా కవిత్వం చెప్పి, అందరిన్నీ మెప్పిస్తారంటరా! ఉ. ఎవ్వరేమన్నా ఈ కువులందరూ మన కాట్రేనికత కాడ సిల్లి గవ్వకు కూడా పనికి రారు.3. ఏ విశేషము లేకుంటే ఇంత మంది పెద్దలు చూడటానికి వస్తారా? ఉ అయితే మనం కూడా కొంచెం ఆగి, నిదానంగా (తాళి) అవధాన సభకు వెళ్ళి చూద్దాము రా- అనుకొంటూ, ఆ పల్లెటూరి పామరులు సంవదించుకుంటూ చూడవచ్చారట! వి కాట్రేనికతా = కాటిరేడుకతట = వల్లకాటికి ప్రభువైన శివుని కథ.

67 చ. జనకునకు న్విషంబిడిన సాగరు తోయములన్ని నేలపా-
లొనరగ జేతునంచు గరమూనిని, గౌరియుజూచి, ''వద్దురా!
తనయ! సురేంద్రుధాటి కిటదాగిన మామను బయట వేతురా?
యనిన, గరమ్ము దీసిన గజాస్యుని గొల్తు నభీష్ట సిద్ధికిన్॥

సం. ఇదొక సంవాదం కాని సంవాదం. వినాయకుడీవిషయం ఇప్పుడు చెప్పకున్నా, అంతకుముందే తల్లితో, చెప్పినట్లు, ఇప్పుడు తల్లి నిషేధింపగా మారినట్లు, గమనింపగలము. సగరమథన సమయమున, అందరి కేవో బహుమానములిచ్చి, తన తండ్రియగు శివునకు మాత్రం 'విషము' (గరళము, నీరు) నిచ్చిన, (చంపదలచిన) ఆ సముద్రునికి ప్రత్యపకారం చేసి, కసిదీర్చుకొన దలచినవాడై, వినాయకుడు, ఈ సాగరజలం మొత్తంగా, పీల్చి మట్టిపాలు చేస్తాను సుమా! - అని ప్రతిన పూని, తొండము (కరము) చాచి ప్రయత్నింపబోయినాడట! అట్టి వినాయకుని చూచి, తల్లియగు పార్వతి, ''కుమారా! వద్దురా! నీ విప్పుడు సముద్రజలాన్ని పీల్చి, మట్టిపాలు చేస్తే, పూర్వం పర్వతములరెక్కలను నరుకుతూ వస్తున్న, దేవేంద్రుని దాడికి భయపడి, సాగరంలో దాగుకొన్న నీమేనమామయగు 'మైనాకుడు' బైటపడతాడు. అప్పుడు ఇంద్రుడు అతని మీదకు దూకి అపకారం చేయవచ్చు- అని తల్లి చెప్పగానే, తొండము (కరము) ను వెనుకకు తీసుకొన్న ఈ వినాయకుని కామితార్థము లిచ్చుటకు సేవిస్తాను అని ఒక భక్తుని ప్రార్థన.

వి.1 ఒక భక్తుని, లేక పద్యకర్త ప్రార్థనకు, నేరుగా గాక, ఒక భంగీ భణితితో చమత్కార చందనము చిందించి, జవాబు చూపుట ఆనందదాయకము.

2. 'ముక్తకం' గనుక, 'పొట్టకు రేమేముంది? ఏదైనా, ఎలాగైనా చెప్పవచ్చు అనుభవించవచ్చు మన కవీంద్రులు ప్రార్థనశ్లోకాల్లో, పద్యాల్లో కూడ, సంవాదాలను వదలకుండా వర్ణించారు

68 క. ఆడిన మాటకు దప్పిన - 'గాడిదకొడు' కంచుదిట్టగా, విని, అయ్యో!
వీడా? నాకొకకొడుకని - గాడిద యేడిచెగదన్న ఘనసంపన్నా! ॥

సం. చెప్పిన మాటలకు చేతలకు ఏమి సంబంధం లేకుండా, అన్నీ అబద్ధా లే చెప్పు వానిని గురించి చెప్పిన పద్యమిది.

భా. ఒక పెద్ద మనిషి ఎన్నో అసత్య వాగ్దానాలు చేసి, చివరికి ఒక్కటి కూడ ఆచరింప లేదట! అట్టి వానిని, '' ఓరి! గాడిద కొడకా! అని తిట్టగా, ఆ ప్రక్కనే ఉన్న గాడిద, ఆ తిట్టుమాట విని, '' అయ్యయ్యో! వీడా నా కొడుకు? '' అని, ఆ గాడిద గింజాకుని, ఎంతో బాధపడి, ఏడవటం మొదలు పెట్టిందట!

వి 1 దీనిలో ప్రశ్నోత్తరాయి మాటగా లేకున్నా, పశుజాతికి చెందిన గాడిద కూడ-విని, స్పందించి, పెత్పులరాన్ని చెప్పుకొని, బాధపడటం కన్పడుతుంది.

2 చివరి పాదం 'సమస్య'గా స్వీకరించి, ఒక అవధాని పూరణగా కూడా చెప్పవచ్చు.

69. ఆ.వె. కోటసింగరాజు కూటవాసియె కాని - గంగమాంబ పెంచ ఘనత కెక్క,
గంగమాంబ జగతి గయ్యాళియైనను - సింగరాజింకేమి చేయగలడు ?.

పిఠాపురప్రభువుడగు కోటసింగరాజు (15, 16శ.) ఒకమంత్రి. సరితాన్ని దాత అతని గొప్ప కీర్తి (మాటవాసి) కంతకీ కారణం, ఏ మాత్రం అడ్డు చెప్పని అతని భార్య గంగమ్మయే - అని ఒక కవి అంటూ, రెండవ పాదం, పాపం, ఆ గంగ మాంబ గయ్యాళి గనుక చేర్చేసఐనా, సింగరాజింకా చేసేదేమున్నది? - అని వాపోయాడట!

వి 1 గంగమ్మ గయ్యాళి కావటంతో, సింగరాజు కీర్తి చిరస్థాయిగా నిల్చిపోయింది.

2. వాస్తవానికి పద్యం ఏకకర్తృకంగా కూడా కన్పడుతుంది.

**70. ''ధనకోటి నీపాట కోటిధనము''**

ఏరు కొని, సోగు చేసే వారుండాలి గాని, చెళ్లపిళ్ల శాస్త్రిగారి సంవాదాల్లో, వక్రోక్తులు, హాస్యాలు, అధిక్షేపణలు ఎన్నో దొరుకుతాయి.

ఒకనాడు, దక్షిణాది 'ధనకోటి' గానమ్మునకు ముగ్ధుడైన శాస్త్రిగారు, 'ధనకోటికి ఏమిచ్చి ఋణం తీర్చుకోగలం? ఆమెనే త్రిప్పి ఇచ్చినా ఋణం తీరదు.' అని 'ధనకోటినీపాట కోటిధనము' అనే పద్యం పఠించారట!

**71. ''మీరు మాల, అవును, మాదిగా''**

తి.వెం. కవుల అవధానాల్లో వాడెళ్ల పురుషోత్తం గారొక పృచ్ఛకులు, కాగా ఒకసారి తిరుపతి శాస్త్రిగారి, 'చేతిరుమాల' జారి క్రింద పడితే, 'అయ్యా! మీరు మాల' (మీరు 'మాల' జాతికి చెందినవారని అధిక్షేపణ, 2. మీ యొక్క 'చేతిరుమాల' అని రెండవ అర్థం) అని చమత్కరించగా, వెంటనే తిరుపతి శాస్త్రి గారు 'అవును, మాదిగా!' (అవును, నేను మాలవాడనైతే, నీవు 'మాదిగజాతి' వాడవు - అని అర్థం, అవును, ఆ క్రింద పడిన రుమాల మాదేగదా! అని రెండవ అర్థం) అని త్రిప్పికొడితే, తన్నబోయి తలక్రిందుగా పడినట్లయినదట!

**72. లంజ చెరుకూరు, కుక్కకాకాని**

గుంటూరు జిల్లాలో 'చెరుకూరు, కాకాని' అనే గ్రామాలున్నాయి. అనాడు, మరొక చెరుకూరు కూడ ఉండేది. ఈ 'చెరుకూరు' లో వేశ్యలధికంగా ఉండటంతో, తేడా తెల్పుటకు, ఈ చెరుకూరును 'లంజచెరుకూరు' అనేవారట. అట్లే 'కాకాని' గ్రామాలనేకం ఉండటంతో, ఈ 'కాకాని'ని, 'కుక్క కాకాని' అనే పేరుతో పిలిచేవారట!

ఒకప్పుడొక కొంటె బాటసారి, త్రోవలో ఎదురుపడిన ఒక అమ్మాయిని 'లంజా - చెరుకూరు' కు మార్గమేది? (1. ఓసి భోగముదానా! చెరుకూరుకు త్రోవేది? అని, 2 ఓసీ 'లంజాచెరుకూరు'కు మార్గమేది? - అని రెండవ అర్థం) అని యాసగా అధిక్షేపిస్తూ అడిగినాడట! ఆమె మాత్రం తక్కువ తిన్నదా! (ఓరి) కుక్కా! కాకాని మీదుగా పొమ్ము (నన్ను 'లంజ' వేశ్య) అంటే, నిన్ను 'కుక్కా'' అని నిందిస్తున్నాను, అని ఒక అర్థంకాగా 2 అదిగో, ఆ 'కుక్క కాకాని' గ్రామం నుండి పొమ్ము - అని రెండవ అర్థం వచ్చునట్లు) అని చెప్పటంతో, బాణంబుపడినట్లు భావించి, కిమ్మన కుండ, నోరుమూసుకొని జారుకున్నాడట!

**73. ''60 గాడిదల బరువు''**

మాన్య శ్రీ రఘుపతి వెంకటరత్నంగారు, బ్రిటిషు వారి పాలనలో, పిఠాపురం రాజావారి కాలేజిలో ప్రిన్సిపాలు. బ్రహ్మసామాజికులు. క్రమశిక్షణను చక్కగా పాటించేవారు. వారొకనాడు తాను దిద్దిన 60 కాంపోజిషన్ పుస్తకాలను, తిరిగి విద్యార్థులకిచ్చుటకు, నిరాడంబరులు గనుక, తానే చంకలో పెట్టుకొని మోసుకుపోతున్నారట! ఇంతలో ఒక కొంటె కుర్రవాడు 'ఒరే' చూడు, మన ప్రిన్సిపాలుగారు 'గాడిద బరువు'

ఇక, ఈ 'వ్యర్థ సంవాది' సందర్శనానంతరం, కొన్ని పదార్థసంవాదాలను కూడా పరీక్షించండి. 'అచట బుట్టిన చిగురు కొమ్మైన చేవ ---' అను పెద్దనరచనకు, - 'చిగురుకొమ్మలు చేవల్ --(వసు 1-135) '--లేజిగురుకొమ్మంజేవాకుండునే ?' - (వసు. 3-173) అను రామరాజభూషణుని పద్యాలు 'పదార్థసంవాద రూపసద్యాలైనను మరియు కమనీయ దుష్టములు కావు.

3. దేహ్యాంతర సంవాదానికొక నిదర్శనము 'మేఘాలోపే భవతి సుఖినోప్యన్యథావృత్తి చేతః --' అను కాళిదాసరచనకు 'ముసురేసిందంటే పైన - అసలే మతి పోతది మామా--' ఇత్యాది శ్రీ కొనగళ్ల వెంకటరత్నం 'బంగారిమామ' రచనాభాగం ఉదాహరణం అవుతుంది ఇంకా వివరాలు కావలంటే, 'వేదాల'వారి 'ఆంధ్రధ్వన్యాలోకం' లో గాంచగలరు

77. మాన్య శ్రీ చిలకమర్తి నరసింహంగారు '' ప్రచండ యాదవ'' నామాంతరం గల 'గయోపాఖ్యానం' లో ఎన్నో గద్య పద్యాలలో- చమత్కార సంవాదాలను చూపియున్నారు. మచ్చుకు కొన్ని, సంగ్రహంగా

అర్జునుడు తెలియక, గయునకు 'అభయ హస్త' మందింప, 'వానిని విడువుము' 'అని కృష్ణుడు గద్దిస్తాడు'. 'అభయ' మిచ్చి ఎలా విడుస్తాను? అంటాడు అర్జునుడు అంత శ్రీకృష్ణుడు దెప్పిపొడుస్తూ,

'అర్జునా! మీ కెన్ని మేళ్లు చేసినా, వేపకుపానకం, పాముకుపాలు పోసిపెంచినట్లు అయినది. ఇక మీ అన్న యుధిష్ఠిరుని చూతమా - అతడు'పేరు ధర్మ రాజు, పెను వేప విత్తు, ఉత్త నేతి బీరకాయ యే సుమా!

ఉచ్చ నీచము లేక రాచపాడి దొరంగి - బిడియపించుకలేక బిచ్చమెత్త,

జనవిరుద్ధంబుగా నైదోడులేవురు, వెలదినొక్కర్తుక పెండ్లియాడ,

కొలువు కూటమునందు గురుజనంబులమ్రోల - సుదతి బందెము బెట్టి జూదమాడ -- నీవు, నీ అన్నదమ్ములే నేర్తు గాక

( అర్జునా రాజమర్యాదలు మాని, ఉచ్చ - నీచములు అని తలంపక సిగ్గు లేక, మీరు అడుక్కు తినలేదా? లోక విరుద్ధంగా ఐదుగురు అన్నదమ్ములు ఒకర్తెను పెండ్లాడలేదా ? నిండు పేరోలగంలో పెద్దమనుష్యుల యెదుట, ప్రాణేశ్వరినే జూదములో పందెము ఒడ్డి, ద్రౌపదీ వస్త్రాపహరణానంతరం అడవికేగాలేదా ?

ఇవన్ని మీఅన్న దమ్ముల చేతలే నయ్యా! ఉపకారికి అపకారము చేయు కృతఘ్నులు అయ్యా మీరు -- ఇత్యాదిగా ఎన్నో ఎత్తిపొడుపులను కృష్ణుడు ఎలుగెత్తి చాటగా,

ఇక అర్జునుడు - 'నీవు మాత్రం తక్కువ తిన్నావా, సామాన్యుడవా ? ఆనాడు మూడు అడుగుల నేల కోసం బలిచక్రవర్తి దగ్గర బిచ్చమెత్తుకోలేదా

'అల్లుడా రమ్మని ఆదరంబున బిల్వ - బంపుమామను పట్టి చంపగలమె

జలకేళి సవరించెడు జవరాంద్రకోకల - నెత్తుకొని పోయి చెట్టెక్కలేదె'

వెర్రిగా గొల్లపిల్లల చేరి కర్రపెట్టి , - అలమందనెల్ల కాయలేదె--

'ముద్దుల అల్లుడా! రానాయనా అని ఆదరంతో పిలిచిన కంస మామను పట్టి చంపలేదా

అన్నా! స్నానం చేసే గోపికా యువతుల చీరలు అన్ని ఎత్తుకొని పోయి, చెట్టి ఎక్కి కూర్చున్నది ఎవరయ్యా! వెర్రి గొల్లలతో వెళ్లి ఆవులను ఎంత కాలం కాయలేదు? ఇలా నీచ కార్యాలు నీవుమాత్రం చేయలేదా? నీవు మాకు నీతులు చెప్పడం 'గురువింద గింజ తంతు' వలె ఉన్నది. మాటలు వేయునేల? ఇవి అన్ని నీవు చేసిన పద్మలేనయ్యా నీరజాక్ష! అంటూ, మర్మస్పృక్కులైన మాటల ఈటెలతో, తూట్లు పొడిచాడు అర్జునుడు. ఇట్లు మన నిరంకుశులగు కవులు మానవులనే కాక, దేవాదిదేవులను కూడ మాటల ఈటెలతో తూట్లులెన్నో

పొడిచి ,బహిరంగపరచి, బండికెక్కించారు

ఇట్లే,సీతారామాంజనేయ సంవాదం, శుకరంభా- సరస్వతీ నారద - - పాండవోద్యోగ విజయాలలోను, పదులకొలది, కాదు, పదిపదుల కొలది, అధిక్షేపణలు ఎత్తిపొడుపులు ఉన్నవి అల్పజ్ఞులగు మాకుమాత్రం ఎన్ని గుర్తుకు వస్తాయి? గుర్తుకు వచ్చిన కొన్ని మాత్రమే, పాఠకప్రభువుల పాదపద్మాలపై, ప్రదర్శించాము

## 'పొడుపు కథలు కొన్ని''

ప్రశ్న 1 కన్నులెఱ్ఱగనుండు రాకాకకాదు, తలనుండి పొగవచ్చు భూతమ్ము కాదు
సరసరా పాకును పామైన కాదు- - (అది) ఏది? అని ప్రశ్న ఉ. రైలు.

2 ఇంతింత బండి, ఇనుపకళ్ల బండి, తొక్కితేనాబండి తొంబై ఆమళ్లు ఉ. సైకిలు

3 ఎద్దులేని బండి చూడముచ్చగుండు, నీరుత్రాగి పరుగిడు చుండునెపుడు
అరువదామడలైన అరుగుచుండును సదా .. ఉ. మోటారు.

4 ఎన్నెన్నో కతలు, కన్నెనో నీతులు, తెలియబలుకు చాల సులభముగను
ముసలి తాత కాడు, ముత్తవ్వయును కాదు.. ఉ. రేడియో.

5 తండ్రిని చంపింది, తాతను గూడింది, తండ్రినిగన్నది, ఒకానొకటి.. . ఉ మజ్జిగ.

6 మనిషి కానిపించు-మాటలు వినిపించు, పలుకరింప మారు పలుకలేదు
దాపుకేగి చూడ ధవళ వస్త్రంబుండు, దీని భావమేమి? . . ఉ సినిమా.

7. ముద్దుగానుండును-ముక్కుపైకెక్కు, చెవులు రెండు లాగి చెంపనొక్కు,
దండి పండితులకు దారిచూపుట వృత్తి - ? ఉ కళ్ళజోడు.

8 మూడువందలు పెట్టి మును కొన్నాక, ముందుపెట్టు కొనుచు, ముందు వెనుకకు లాగ
అది ఏడ్వ-నేనేడ్వ-దానినేమందురు? - ఉ హార్మోనియం.

9. తోక లేని పిట్ట తొంబదామడలేగు - ఉ. **ఉత్తరం, జాబు.**

10 వండగ నెండిన దొక్కటి-ఖండించిన పచ్చిదొకటి, కాలినదొకటౌ
తిండికి రుచియైయుండును, ఖండితముగ దీనిదెల్పు కనియుం గలదే? ఉ వక్క, అకు,సున్నము.

11 పామేల దుముకు? గుడిసేల కురియు ? ఉ. **కప్పకే**
(కప్పకే = కప్ప-కోసమే, తాటాకు గుడిసెపై కప్పనందుకే).

12. ముళ్ళ ముళ్ళ అడవిలో - ములగాకు తోపులో
బంగారు తిత్తిలో-వెండి పొన్నకాయ. ఉ. **పనసకాయ**

13 అద్భుతమైన సిటీ ఉంది, ఆ సిటీలోకి ఎవరెళ్లినా చస్తారు. ఉ. **ఎలక్ట్రిసిటీ.**

14. పురం గాని పురం ? ఉ. **కాపురం, గోపురం.**

15. రేసు గాని రేసు ? ఉ. **కాంగ్రేసు,** దేశం గాని దేశం **తెలుగుదేశం.**

16 మూడక్షరాల పుష్పం ? మధ్యాక్షరం తొలగిస్తే నక్షత్రం ఉ. **తా(మ)ర.**

17 మూడక్షరాలు మొదటినుండి చివరికి, చివరనుండి మొదటికి, చదివినా, రాసినా, ఒకటేఅర్థం

ఉ. **నటన, కనుక, కిటికి, జలజ, సరస, కునుకు...** మొదలగునవి.

18 సినిమానటి తారుమారైన ప్రజలు ఉ. **జమున-జనము.**

19 రైతు చల్లని విత్తనం, మేస్త్రి కట్టని కట్టడం, చాకలుతకని బట్టలు, ఉలితో చెక్కని రాళ్లు.

ఉ **పళ్లు, దంతాలు.**

20 ఊరు కొన్న దేందిరా ? ఊగులాడేదేందిరా ?

కాళ్ల సందు దేందిరా ? కమ్మి కొచ్చే దేందిరా ?

ఊరు కొన్న ''దావు''రా, ఊగులాడే దూడ రా, ( ఊడ )

కాళ్ల సందుది చెంబురా, కమ్మికొచ్చేవి పాలురా

21 ఏడ్వకేడ్చు, నవ్వకే నవ్వుచుండు, బాధ లేక బాధ పడుచునుండు

నిద్రరాకయున్న నిద్రించు, చావకే చచ్చు-నెవడొ చెప్పుడీ సరసులార. ఉ **నటుడు.**

**సినిమాలకెక్కిన పొడుపు కథలు కొన్ని.**

1. పిల్లికి ముందు రెండు పిల్లులు, పిల్లికి వెనుక రెండు పిల్లులు

పిల్లికి పిల్లికి మధ్య మరొక పిల్లి- మొత్తం పిల్లులెన్ని ? ఉ **మూడు(3)**

2 మగవానికున్నది ఆడదానికి వచ్చునది - ఏది ? ఉ **కడుపు.**

3 ఒంటి కాలిపైనుండి- హఠ యోగ నిద్రలో నుండి, గుట్టుగా తన పని

సాధించు కొనేదేదో ? వివరిస్తావా ? చినదానా!

ఉ. జ 'కుక్క-గొడుగు' అని కొందరు అంటారు, కాని, కొంగ అనడం సమంజసం.

4 బూచాడమ్మా బూచాడు- బుల్లి పెట్టెలో ఉన్నాడు ! ఉ **టెలిఫోను.**

## హిన్దీలో సంవాద చిత్ర సాహిత్యమ్

సంస్కృతములో భోజాదులు చేసిన, చిత్రాలంకార ప్రక్రియల నియమ వర్గీకరణాదుల, నాధారంగా చేసుకొని కేశవదాసాది కవులు కొందరు, హిందీలో చిత్రాలంకారాల సృష్టిచేశారు. నవీనులు మరికొందరు క్రొత్త పుంతలను కూడా త్రొక్కినారు.

సర్వప్రథమంగా 'కేశవదాసు' తన 'కవిప్రియ' లో చిత్రాలంకారాలను, వివరిస్తూ, వానిలో రసభంగాదులు, కించిత్తుగా, కొన్ని కన్పడినా, వానిని పరిగణింపరాదని, 'వ-బ' లకు, 'య-జ' లకు, 'ర-ల' లకు అభేదం పాటించాలని, అంతమాత్రాన ఈ అధికారాన్ని దుర్వినియోగం చేయరాదని, విశిష్టనియమాలను పాటిస్తూనే, బుద్ధిబలంతో, చిత్తైకాగ్ర్యంతో తన్నిషేవణం చేయాలని, నేను ఆచిత్ర మహాసింధువులో నిమగ్నుడనైన ఒక బిందువును మాత్రమే తెల్పుచున్నానని, చెప్పి

1 '' కేశవ చిత్ర సముద్రమేం'' - బూడత పరమ విచిత్ర।

తానే బూందక కే కణై బరతన హే సుని మిత్ర ॥ కే.క.16-1

ఈపద్యంలో వివరించాడు ''సూరదాస''కవికూడ కొన్నిచిత్రరచనలను ''వాక్యల'' అర్థంలో భాసింపజేశాడు ఈచిత్ర రచనలు క్లిష్టంగా దుర్భేధంగా, కన్పడటానికికారణమేమనగా- కవులు తమ పాండిత్యప్రకర్షను ప్రదర్శించి, పాఠకుల మెరడుకు మేతనందించి, చిత్తాలలో, వినోద, విస్మయ, కుతూహల, చమత్కారాలను చెంగలింప చేయాలనే తలంపులోనే చేశారు.

కేశవదాసు తరువాత బిఖారీదాస,కాశీరాజ, డా. రసాల, జగన్నాథ, జానకీప్రసాద - మొ.వారు కొన్నిచిత్రప్రభేదాలనుచిత్రించినారు గాని, నేడాగ్రంథాలు మృగ్యాలయికావటంతో, మాకున్న అల్పజ్ఞానంతో, కతిపయ - ఉదాహరణలు మాత్రమే, చూపగల్గుచున్నామని మనవి.

మొత్తంమీద, ఈ చిత్ర ప్రకియలు దుర్భేధాలు,అస్పష్టాలు అయినా, పాఠకలోకాన్ని కికురిస్తున్నా (వంచిస్తున్నా), వాని భావాలు తెలుసుకొన్న తర్వాత మాత్రం, భారాన్ని తగ్గించి, ఆమంధానందాన్ని ఆవిర్భవింప జేస్తూనే ఉన్నాయి కొన్ని చిత్ర ప్రక్రియాభేదాలు ఒకచిత్ర ప్రక్రియకు ఉదాహరణంగా కన్పడినా, కించిద్భేదంతో, అవే, అన్యచిత్రోదాహరణాలుగా కూడ కావటం విశేషం.

2. ''అక్షర కౌన వికల్ప కో, యువతి బసతి కే హి అంగ''

బలిరాజా కానే ఛల్యో - సురపతి కే పరసంగ॥

గమనిక హిందీభాషా వేత్తలకు ఈ ఉదా.ల అర్థాలు సులభాలేగనుక, అర్థవివరణ అంతగా చేయక, సమన్వయానికే ప్రయత్నిసున్నామని మనవి. ఇంకా, పద్యాలలోని హల్వర్ణాలకు, తెలుగుభాషలోని, అజాదులు కలిపి, వ్రాయబడినవి కూడా గమనింప ప్రార్థన.

పై పద్యానికి మొత్తము ప్రత్యుత్తరమగు ''వామన'' పదం బయటనుండి వెదకి తేబడినది. దీన్ని విడదీసుకొంటే, వికల్పాన్ని తెల్పేది 'వా' అనే అక్షరం, కాగా దానికి ప్రక్క 'మ' చేర్చితే, 'వామ' అయి ఆ ఎడమభాగం యువతీనివాసాన్నే కాక, అందమైనదనే అర్థాన్ని కూడ తెల్పుతుంది. బలిని మోసగించిన వాడు

(1) 'వామన' అని, మూడవ ప్రశ్నకు మొత్తంగా సమాధానమైనది.

వి. 1. వామనుడు బలిని మూడుఅడుగుల నేలనడిగి, సరే అనిపించుకొని, ఒకఅడుగుతో ఆకాశాన్ని, రెండవఅడుగుతో భూలోకమును ఆక్రమించి, మూడవ అడుగుతో, బలిచక్రవర్తిని పాతాళానికి అణగ్రదొక్కి- పంపినట్లు పురాణగాథ

3. 'ఆది కటేతే సబకో పాలై, మధ్య కటేతే సబకో సాలై'

అంత కటేతే సబకో మీఠా, సోఖుసరో మై అంఖో దీఠా॥

ఈ ప్రశ్నలన్నిటికి ప్రత్యుత్తరం 'కాజల' (కాటుక).

మొదటి అక్షరాన్ని తగ్గిస్తే, (కా) జల ='జల' గా.మిగిలి, ఆ 'నీరు' అందరినీ రక్షిస్తోంది. 2. మధ్యాక్షరచ్యుతితో 'కా(జ)ల' ='కాల' గా మిగిలి, యమ, మరణ, సమయ-అర్థాలను తెలుపుతుంది. 3. మరల అంత్యాక్షరాన్ని తొలగిస్తే 2'కాజ(ల)' = 'కాజ' గామిగిలి, కార్య, ప్రయోజన--- ఆది అర్థాలను తెల్పుతుంది- అని 'అమీర్ -ఖుస్రో' అభిప్రాయం. ఈ 'ప్రత్యుత్తరం' బైటనుండి, వెదకి తేబడుటచే 'బహిర్లాపి' గాకూడ ఔతుంది

వి.1 'కాజల' కు బదులుగా, దాని పర్యాయపదాన్ని వాడితే, ఈ అర్థాలన్నీ రావు. ఇట్లు శబ్దపరివృత్తిని సహింపదు కనుక, ఇది'శబ్దగతచిత్రమే' ఔతుంది.

4.'కహాన సజ్జన బసై, కహా సుని గోపీ మోహిత'
కహాదాసకో నామ,కవిత మహా కహియత కో హిత।
కోప్యారో జగమాహిం, కహా ఛత లాగే అనత।

కో బాస రకో కరత, కహా సంసార హి భావత॥
కహి కహా దేఖి కాయర కప్రత - ఆదిఅన్తకోహై సరన।
ఎక ఉత్తర కేశవదాస దియ, 'నబై జగత శోభాధరన' ॥

ఈ ''కహాన సజ్జన --- '', ''ఛప్పయ'' పద్యములోని పది ప్రశ్నలకు, పద్యాంతంలోని''సబై--రణ'' పదం, ప్రత్యుత్తరంకావటం విశేషం ఈ సమష్టి పదంలోని ఆద్యక్షరాలగు ''స-బై---'' మొ. వానికి, విడిగా, క్రమంగా, ఆ జవాబుల చివరనున్న 'న'ను కలిపిన,'నన, బైన(వేళ) జన,గన,తన,శోన,(లక్ష్మి),భాన,ధన, రన (రణ) అను తొమ్మిదిప్రత్యుత్తరాలు సమకూరగా,చివరి 10వ ప్రశ్నకు మొత్తంగా సమాధానమగుట విశేషాంతరము. ఇక,హిందీభాషా కోవిదులకు ప్రత్యేకార్థ రచన అనవసరమని, గ్రంధ విస్తర భీతిని, విడువబడి, సమన్వయమే చూపబడినదని మనవి.

5.'కై హైం రస,కైసే లయీ లంక,కాహే పీత పట'
హోత కేశోదాస కేన శోభి ఏ సభామే జన॥
భోగిని కో భో గవత, కౌనే గవై భగవత।
జీతే కాయతీన, కౌనహై - ప్రనామ కే బరన ॥
కేన కరీ సభా, కేన యువతీ అజీత జగ।
గావై,కహా గుణీ, కహా - భరే హై భుజంగ గన॥
కావై మోహై పశు, కహా-కరై తపీతప, ఇన్ద్ర
జీ బసత కహా ''నవరంగరాయ మన ''

గమనిక కేశవదాసును ఆస్థాన పండితునిగజేసి, పోషించిన రాజా 'ఇన్ద్రజిత్తు', ఆరాజ దర్బారులోని ఒక వేశ్యా పేరు 'నవరంగరాయమన' అనికూడ గుర్తింప వలెను.

ప్రశ్నలు. 1. రసములెన్ని ? ఉ.నవ (=తొమ్మిది)

2 లంక ఎట్లు గ్రహింపబడెను ? ఉ.వల (బల) ముతో. అనుస్వారమును విడుచుట, 'వ' కు బదులుగా 'బ'ను, 'ర'కు బదులుగా 'ల'ను గ్రహించుట మొ. వ్యత్యాసాలకు చిత్రనియమాలు అంగీకరించనని ముందే తెల్పినాము కనుక, ఇక్కడ 'వర =బల' అయినది

3 దేనివలన వస్త్రము పసుపు పచ్చ దగుచున్నది? ఉ. రంగ (=రంగు వలన)

4 సభలో నెవడు శోభించును ? ఉ.గరా (గాంభీర్యం గలవాడు)

5. సుఖము నెవడు అనుభవించును ? ఉ.రాయ (రాజా లేక నాయకుడు)

6. భాగవతులలో నొకనిగా నెవనిని లెక్కించారు ? ఉ. యమ(యముని)

7 మునులు దేనిని జయించిరి ? ఉ మన (మనస్సును)

## "కొన్ని ఆంగ్ల సంవాదాలు"

1. Why is an empty matchbox superior to all others?

Ans. Because it is matchless.

2. What is the most controbictory sign seen in the library ?

Ans. To speak aloud is not allowed (aloud).

3. My first is a pronoun, my second is not high, my third we all must do my fourth is a plural pronoun, and my whole is musical?

Ans. Melodious -me- low-die-us.

4. My first is company, my second is a bailed lady who shuns company, my third assembles company, and my whole amuses company.

Ans. Co-nun-drum.

5. My first is found every country of the globe my second is what we all should be, and my whole is the same as my first

Ans. Man - kind.

6. There is a word that's composed of three letters alone,
which reads backward and forward the same, It express
the sentiments warm from the heart, and the beauty lays
Principle claim.

Ans. EYE

7. What trade is noted among the authors of English Literature?

Ans. Goldsmit.

8. What is smaller than an ant's mouth?

Ans. What the ant eats.

9. What is there in your house that ought to be looked into?

Ans. A mirror.

10. What is your nose in the middle of your face ?

Ans. Because it is a scenter (Center).

11. What is the difference between a soldier and a pretty girl?

Ans. One faces the powder and the other powders the face.

12. Why is twice ten like two times eleven?

Ans. Because twice ten is twenty, and two times eleven is twe too (twenty two)

మోసుకొని వెళ్తుతున్నారు - అనగా, వినిన నాయుడుగారు అధిక్షేపణను సీరియస్‌గా గ్రహింపక, ' ఒరే! నాయనా ఒక గాడిద బరువుగాదురా' ఇది అరవై గాడిదల బరువురా!' అని త్రిప్పి కొట్టగా, ఆ విద్యార్థులు నాలుక కరచుకొని అక్కడ నుండి పలాయిన మంత్రం పఠించారట!

### 74. ''నాకీ పచ్చడమే చాలు నయముగ నిమ్మా!''

పూర్వం పలువురు కలిసి పద్యాన్ని పూరించినట్లు, 'భోజప్రబంధం' లోని ''పరిపతతి'' పయోనిధి పతంగః ---'' పద్యం సాక్ష్యమిస్తోంది. నేడు కూడ నలుగురు కలిసి, నాల్గుభాగాలతో, నవలను, నాటకాన్నో కథనో పూర్తి చేస్తున్నారు రాయల కాలంలో కూడ నలుగురితో పద్యపూరణ జరిగినట్లు ' నాటికి కావలి తిమ్మా ----' పద్యమే ప్రబలసాక్ష్యం. తిమ్మని నమ్మిన సేవకు మెచ్చి, రాయలవారొక పచ్చడం (శాలువా) ఇచ్చారట! దానిపై కన్ను పడ్డ రామలింగమొకనాడు' తిమ్మన్నా! రాయలవారికి నమ్మిన బంటువుగదా నీవు ఒక పద్యమైనా కృతి నందకపోవడం విచిత్రంగా నున్నది - అనగా, అయ్యా! నేనంత ధనం ఇచ్చుకోలేను - అనగా, ''ఏమిలేదు తిమ్మన్నా ! రాయలవారి'' దర్శనానికి వచ్చే కవులను, ఒక్కొక్క చరణం చెప్పుమని అడుగు వానితో ఒక చిన్న పొత్తం తయారౌతుందని సలహాయిచ్చాడట.

ఇంతలో పెద్దనగారు రాగా, అయ్యా! ఒక పద్యపాదం నామొహాన విసరండనగా, 'నాకిటి కావలితిమ్మా! అన్నాడట!' తర్వాత వచ్చిన భట్టుమూర్తినడిగితే 'ప్రాకటముగ సుకవి వరుల పాలిటిసొమ్మా! అనగా తర్వాత నంది తిమ్మన వచ్చి 'నీ కిదె పద్యము కొమ్మా ' అనగా, ఇదంతా గమనిస్తున్న మన వికటకవి, వెంటనే వచ్చి, 'నాకీ పచ్చడము చాలు నయముగ నిమ్మా!' అని పూరింపగా, కావలి తిమ్మన కిమ్మనకుండా శాలువా నిచ్చివేశాడట!

ఈ కథ నంతావిన్న రాయలవారు, దయదలచి, తిమ్మనకు మరొక శాలువా నిప్పించారట!

3.మొత్తం మీద 4 కవుల 4 పాదాలతో పూర్తియైన ఈ పద్యాన్ని అంకితంగొని 'కృతి పతి'యైనంతగా సంతోషించాడట! సంవాదంగాని, సమస్య గాని,కాని ఈ పద్య మొక చమత్కృతిమత్ పద్యం.

75. మాన్యశ్రీ చిలకమర్తి నరసింహంగారు 'ప్రచండయాదవ' నామాంతరం గల ''గయోపాఖ్యానం'' లోని సంవాదాన్ని కూడ సంగ్రహంగా సంభావించదాం

అర్జునుడు తెలియక, గయునకు 'అభయహస్త' మివ్వగా, వానిని విడువుమని కృష్ణుడు గద్దిస్తాడు. 'అభయమిచ్చి, ఎలా విడుస్తానంటాడు అర్జునుడు -అంత కృష్ణుని దెప్పిపొడుపులు. 'అర్జునా! మీ కెన్ని మేళ్ళు చేసినా, వేపకు పానకం, పాముకు పాలు పోసి పెంచినట్లయినది. ఇక మీ అన్న యుధిష్ఠిరుని చుద్దామా - అతడు 'పేరు ధర్మరాజు పెనువేప సిత్తు ' ఉత్తనేతి బీరకాయ.

ఉచ్చ నీచములేక రాచపాడి దొరంగి - బిడియమించుటలేక బిచ్చమెత్త
జనవిరుద్ధంబుగా పై దొడులేవుడు - వెలది నొక్కర్తునే పెండ్లియాడ
కొలువు కూటమునందు గురుజనంబుల మ్రోల - సుదతి బందెము బెట్టి జూదమాడ
----- నీవు, నీ అన్నదమ్ములే నేర్తు గాక ---

(అర్జునా! రాజమర్యాదలు మాని, ఉచ్చ - నీచమని కూడా తలంపక సిగ్గు లేక మీరు అడుక్కు తిన్నారు. లోకవిరుద్ధంగా అయిదుగురు అన్నదమ్ములు ఒక్కదానినే పెళ్లాడలేదా! నిండు సభలో పెద్దలముందు నిండుసభలో జూదములో భార్యనోడి ఆమెకు వస్త్రాపహరణం జరిగినా సహించి ,అడవి కేగలేదా! ఉపకారికి అపకారం చేయుటలో మీరే ప్రసిద్ధులు --- ఇత్యాదిగా ఎన్నో ఎత్తి పొడుపులను కృష్ణుడు ఎలుగెత్తి చాటగా, - ఇక

అర్జునుడు - కృష్ణా ! నీవు మాత్రం తక్కువ తిన్నావా! సామాన్యుడవా? ఆనాడు మూడుఅడుగులనేలకు బిచ్చమెత్తి లేదా 'అల్లుడా! రమ్మని ఆదరంబున బిల్వ పంపుమామనిగట్టి చంపగలమే!

జలకేళి సవరించు జవరాండ్ర కోకల నెత్తుకొని పోయి చెట్టెక్కలేదే---

(ముద్దులఅల్లుడా! రానాయన! అని ఆదరంతో పిలిచిన కంసుని చంపలేదా! అవ్వ! స్నానం చేసే గోపికా యువతుల చీరలన్నీ ఎత్తుకుపోయి చెట్టెక్కి కూర్చోలేదా! ------ నీవు మాకు నీతులు నేర్పడం 'గురునింద గింజ తంతు' వలె ఉన్నది. మాటలు వేయునేల 'నీవు నేర్పినవిద్యయే నీరాజాక్ష! అంటూ మర్మ స్పృక్కులగు మాటల ఈటెలతో ఎత్తి పొడిచెను.

ఇట్లు, నిరంకుశులగు కవులు మానవులనే కాక దేవాదిదేవులను కూడ మాటల ఈటెలతో బండికెక్కించారు. ఇట్లే సీతారామాంజనేయ, శుకరంభ, సరస్వతి నారద -- ఆది ఎన్నో సంవాదాలలో ఎన్నో అధిక్షేపణలు కనపడతాయి

76. ఈ 'సంవాదం' విషయంలో ఆనందవర్ధనుని అభిప్రాయం అత్యంత మాన్యమైనది. 'సంవాద' మనగా వక్రోక్తులతో, శ్లేషతో ---- అధిక్షేపించు 'పరస్పర సంభాషణ' మేకాక, 'అన్యసాదృశ్య' మనే అర్థాన్ని కూడ తెల్పి, ఉదాహరించినాడు. ఒకకవి కావ్య వస్తువునకు, ఇతర కవుల కావ్యవస్తువులతోడి సాదృశ్యము (సమానత్వము), ఆయా కవులందరి గౌరవంతో కాని, వారిగ్రంథాలను పలుమారు చదవటం వలన కాని సంభవింపవచ్చును. అంత మాత్రం చేత ఆ సాదృశ్యాలు వానికి నకిలీలు, పునరుక్తాలు అని చెప్పుటకు వీలుపడదు ఈ సంవాదాలు 1. ప్రతిబింబరూపము 2. చిత్రతుల్య(ఆలేఖ్యరూప) ము, 3. తుల్యముగు దేహ వంటివి అని మూడువిధాలు ప్రతి బింబకల్పమగు కావ్యవస్తువునందు తాత్త్విక శరీరముండదు. ఆలేఖ్యాకారమున శరీరమున్నను ఆత్మ ఉండదు కనుక కవులీ రెంటినీ త్యజింపవలెను ఇక మూడవదానిలో వాస్తవిక శరీరము, ఆత్మ ఉండుటవలన దానిలో జీవశక్తి, రమణీయతలు లుప్తములై ఉండవు మనిషినిబోలు మనిషి ఉన్నంత మాత్రమున, వారిద్దరు ఒకటౌతారా? వనితా వదనమున చంద్రకాంతి చెన్నారినా, అవి రెండూ ఏకత్వాన్ని పొంది, రసకజనమనోరంజనం చేస్తూనే ఉన్నాయి.

అట్లే, ఇతరులు వాడిన అక్షరాలను పదాలను మనంకూడ వాడకతప్పటం లేదు కనుక అట్టి వ్యంగ్యసమర్పణ సమర్థ - శబ్దరచనలలో పూర్వచ్ఛాయలున్నా నింద్యాలు కావు. అవి వద్దు అనుకున్న కవిహృదయాలలోకూడ ఆ సరస్వతి దేవి అభిమతార్థాలను స్ఫురింపజేసి, అనుగ్రహిస్తుంది. అదియే మహకవుల, మహకవిత్వ లాభమని, ఆనందవర్ధనుని భణితి.

దీనికి కొన్ని ఉదాహరణలు 1. బింబాకార సాదృశ్యం 'తరుణుండగు శీతలకరు - మరిగి వియల్లక్ష్మి తన్ను మాని ముదుకడున్ -- రవి పశ్చిమాద్రి కడగ్రుంగె నృపా!' అను పోతన - బింబాకారపద్యానికి, 'తరుండగు శీతకరు - మరిగి వియల్లక్ష్మి తన్నుమాని ముదుకడున్ -- నృపా అను అమరేశ్వరుని 'విజయసేన పద్యం ప్రతిబింబం అవుతుంది. 2. అలేఖ్యాకార సంవాదానికి ఉదా: లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యె, ప్రాణంబులా- ఠావుల్దప్పెను మూర్ఛవచ్చె -- ఇత్యాది పోతన - గజేంద్ర మోక్ష పద్యానికి - 'పూ విల్కాని సరోజబాణముల నంబోజారి మైఛాయలన్ - భావంబుంతయు డస్సె, నేను బడలెన్ --అను పద్యాన్ని వ్రాసిన కవి, 'చిత్రాకారసంవాదాన్ని' చిందింప జేసినట్లున్నది.

ఇట్లే ఒత్తుకొని వచ్చు కటికుచోర్వ్యతి జాచి

తరుణి తనుమధ్య మెచటికో తలగిపోయె---అను, రామభద్రుని పద్యానికి, 'స్తనజఘన భారములచేత జవ్వనంబు-- అను సూరన పద్యం కళాపూర్ణోదయ (6-204) పద్యం వస్తు 'సంవాద' మౌతుంది. అట్లే, 'అరిజూచున్ హరి జూచు జూచుకములందందండ మందారకే - కే - సరఘూల మకరందబిందు సలిలస్యందమ్ము లందమ్ముల - అను నాచనసోముని, పద్యానికి, - 'పెరుజూచున్ వరుజూచు చొంపనలరంపన్ -- ' అను పోత '' (భ.10.178) పద్యం'' పాకరూపసంవాద' మౌతుంది.